# ఉదాహరణ వాఙ్మయ చరిత్ర

13/14



గ్రంథకర్త:

విద్యారత్న నిడుదవోలు వేంకటరావు, ఎం. ఏ.,

విశ్రాంత ఆంధ్రభాషా శాఖాధ్యక్షులు,

మదరాసు విశ్వవిద్యాలయము.



ప్రకాశకులు:

విజయ భాస్కర పబ్లికేషన్స్,

హైదరాబాదు.

© సర్వహక్కులు ప్రకాశకులవి

ప్రథమ ముద్రణ : 1959
ద్వితీయ ముద్రణ : 1968
(పరిష్కృతము)

ప్రతులకు :

1. విడుదవోలు వేంకటరావు
ఇ. నెం. 2-2-1137/5,
న్యూ నల్లకుంట, హైదరాబాదు-13.

2. ఆంధ్ర సారస్వత పరిషత్తు,
తిలక్ రోడ్డు, హైద్రాబాదు-1.

మూల్యము :
రూ. 6-00

ముద్రణ :
శివాజీ ప్రెస్
సికింద్రాబాదు.

# అంకితము

స్వర్లోకవాసిని నా భార్య

లక్ష్మీకాంతమునకు

'నిడుదవోలు' ను పేరు నెల్లెడల వెలయంగ
సంసారజీవితము సాహిత్య జీవితము
అమృత మయంబుగా నవతరింపఁగఁజేసి
అతివలకు నెల్లను నుదాహరణమగు సుకృత
మతి ! "ఉదాహరణ వాఙ్మయ చరిత్ర" ను నిదే
యంకితం బిచ్చెదను అనవద్యమగు నాంధ్ర
సాహితిని నీమూర్తి శాశ్వతంబయి వెలుఁగ
కీర్తిత చరిత ! లక్ష్మీకాంతమా !
నీకు విశ్వేశ భక్తి బంధురువు.

— వెంకటరావు

**CATTAMANCHI RAMALINGA REDDY,**
PRO-CHANCELLOR,
MYSORE UNIVERSITY.

West Lake
Yelwal Road, Mysore,
*7th December, 1950,*

My dear Venkata Rao Garu,

Very many thanks for the sumptuous edition of Udaharana literature which you sent me and also for your kindly worded letter of the 5th December.

Without going critically into the matter for which I don't think, I have enough competence, I feel you have rendered a great service to the Andhra Public by bringing out this comprehensive edition. You deserve our congratulations and gratitude.

Yours sincerely,
*CATTAMANCHI RAMALINGA REDDY.*

కవిసామ్రాట్

# విశ్వనాథ సత్యనారాయణగారు

బెజవాడ, 7-2-51

మిత్రులు శ్రీ నిడదవోలు వెంకటరావుగారికి—

తమ 'ఉదాహరణకావ్య చరిత్రము' అందందు చదివితిని. ఉదాహరణ కావ్యముయొక్క గొప్పదన మిట్లనుకొను చుందును. జగత్తంతయుఁ గ్రియారూపము సర్వక్రియయుఁ బరమేశ్వరునందుఁ బర్యవసించును. ధాతువు సర్వదా విభక్త్యాశ్రయము. ఏ విభక్తికో సంబంధములేక క్రియలేదు. అందుచేత నన్ని విభక్తులతోఁ బరమేశ్వరునిఁ జెప్పినపుడు భగవంతుఁడు సర్వక్రియా స్థాన భూతుఁడని వ్యంగ్యము! ఇది యుదాహరణ కావ్యరహస్యము. తాదృక్కావ్య చరిత్ర వ్రాసిన మీ పరిశ్రమ భగవత్సేవయందు పర్యవసించుచున్నది. మీరు పరిశోధనా పరమేశ్వరులు.

ప్రేమతో

విశ్వనాథ సత్యనారాయణ

# ప్రకాశకుల విన్నపము

చిరకాలము నుండియు గ్రంథ ప్రచురణలద్వారా ఆంధ్రభాషామ తల్లికి మాకు తోచిన సేవచేయవలయుననెడి కోరిక నేటికి ఈ గ్రంథ ప్రచురణ ద్వారా కార్య రూపము ధరించినది. పండితుల ప్రశంసలకు పాత్రమైన ఈ "ఉదాహరణ వాఙ్మయ చరిత్రము"ను ముద్రించుటకు తగిన యవకాశము లభించుట మా భాగ్యము.

"జగమెఱిగిన బ్రాహ్మణునకు జందెమేల" యన్నట్లి గ్రంథకర్త జగద్విఖ్యాతులు, విద్యారత్న, పరిశోధనా పరమేశ్వర ఆచార్య నిడుదవోలు వేంకటరావుగారు ఆధునికాంధ్ర పండితులలో సుప్రసిద్ధులు. వీరు తెలుఁగు కవుల చరిత్ర, దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము, ఆంధ్ర వచన వాఙ్మయము, ఆంధ్రకర్ణాట సారస్వతములు – పరస్పర ప్రభావము, విజయనగర సంస్థానములో ఆంధ్రభాషా పోషణ, మించుపల్లె మున్నగు ప్రఖ్యాత గ్రంథములు రచించినవారు. చిరకాలము మదరాసు విశ్వవిద్యాలయమునందు ఆంధ్రశాఖాధ్యక్షులుగ నుండి బహు శిష్యులను తీర్చి దిద్దిన ఆచార్యులు.

ఈ గ్రంథమును కోరిన వెంటనే సర్వహక్కులతో మాకు అందజేసి ప్రకటించుటకు అనుమతి నిచ్చిన శ్రీ నిడుదవోలు వేంకటరావుగారికి మా కృతజ్ఞతలు. ఇందు ప్రకటించుటకు తమతమ ఉదాహరణములను, అనుమతులను దయతో నందజేసిన రచయితలకు మా కృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాము. ఈ గ్రంథమును సర్వాంగ సుందరముగ ముద్రించి మాకు అన్నివిధముల తమ సహాయ సహకారములతో సకాలమున కందజేసిన "శివాజీ ప్రెస్సు" వ్యవస్థాపకుల నెంతయో నభినందించుచున్నాము.

ఆంధ్రమహాజనులు, విశ్వవిద్యాలయములవారు, గ్రంథాలయాధికారులు యీ గ్రంథ విశిష్టతను గుర్తించి, ఆదరించి ఇంక నిట్టి యుత్తమ గ్రంథములు ప్రకటించుటకు మా సంస్థ కుత్సాహము కలిగింతురని ఆశించుచున్నాము.

ప్రకాశకులు
విజయ భాస్కర పబ్లికేషన్స్,
హైదరాబాదు–ఆం. ప్ర.

# ప్రథమ ముద్రణ విజ్ఞప్తి

ఇప్పటికి పదమూఁడేండ్ల క్రిందట నీ యుదాహరణ గ్రంథములలో కాలక్రమమునందు ద్వితీయమై కవితా ప్రకర్షయందద్వితీయమగు రావిపాటి తిప్పన "త్రిపురాంతకోదాహరణము"ను ప్రకటించితిని. దాని మాతృకను తంజావూరి నుండి తెప్పించి క్రీ. శ. 1912 లో విద్వద్వర్యులు మానవల్లి రామకృష్ణ కవిగారు ప్రకటించిన గ్రంథమును తోడు చేసికొని విపుల పీఠికా వివరణాదులతో వెలయించితిని. ఆ పీఠికలో ఉదాహరణశాఖ యనునది వాఙ్మయమున నొక ప్రత్యేక విశిష్టత గల శాఖయని సోపపత్తికముగ నిరూపించితిని.

ఈ గ్రంథ ప్రకటనమును కీ. శే. గిడుగు రామమూర్తి పంతులుగారును, పండిత ప్రభాకరులు వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారును గొనియాడుచు సవరణలను, పాఠభేదములను దెల్పిరి. స్వామి శివ శంకరులు 'ప్రతిభ'లో నీ గ్రంథమును సమీక్షించి గ్రంథవ్యాప్తికిఁ దోడ్పడిరి. క్రీ. శ. 1947 లో విశ్వఖ్యాత విమర్శకాగ్రేసరులు, ఆంధ్ర విశ్వకళా పరిషదధ్యక్షులు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారీ గ్రంథమును మిక్కిలి శ్లాఘించి, యిందలి పీఠిక అత్యుత్తమ విమర్శన శ్రేణికిఁ జెందినదిగా తమ యమూల్యాభిప్రాయముఁ దెల్పిరి. పలువురు ప్రసిద్ధపండితులు, పత్రికాధిపతులు గ్రంథ ప్రకటనమును సంభావించిరి. ప్రకటనమైన తోడనే ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు, మదరాసు విశ్వవిద్యాలయము వారు దీనిని ప్రాచ్య భాషా పరీక్షలకుఁ బఠనీయ గ్రంథముగ జేసిరి.

మదరాసు విశ్వవిద్యాలయమున తెలుఁగు భాషాశాఖలో నేను సహాయాంధ్రోపన్యాసకుఁడనుగా నియమితుఁడనైన నాట నుండి తగిన యవకాశము లభించుటచే వాఙ్మయ పరిశోధన కూడ నిర్ణీత కార్యక్రమమున చేర్చుకొని అమూలాగ్రముగ నీవిషయములను సేకరించి దీనిని సంపూర్ణముగా రచియించి విశ్వవిద్యాలయము వారికి పంపుకొంటిని. దానిని నేను ముద్రించుటకు మదరాసు విశ్వవిద్యాలయమువారి ననుజ్ఞ వేడితిని. అడిగినదే తడవుగా నా కనుజ్ఞ యొసఁగిన మదరాసు విశ్వవిద్యాలయము వారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

మదరాసు రాష్ట్రీయ ప్రభుత్వము వారు క్రీ. శ. 1949 లో తెనుఁగుభాషలోని యుత్తమ గ్రంథముల కేర్పాటుచేసిన బహుమతులలో విమర్శన గ్రంథశాఖలో

నుత్తమ గ్రంథములుగా నెంచఁబడిన రెండింటిలో త్రిపురాంతకోదాహరణ మొకటి. ఆ శాఖలో దీనికి తెలుఁగు భాషా సమతి ద్వారా బహుమతి లభించినది.

ఈ గ్రంథమును నేను వ్రాసిన దానికన్న దీని ముద్రణ ప్రకటనములకు హేతుభూతులైన ఆనంద ముద్రాక్షరశాలాధ్యక్షులు శ్రీ వి. మాధవరావుగారి కీర్తియే చిరస్థాయియై యాంధ్ర విద్వల్లోకమున వెలయఁగలదు. ఈ గ్రంథమునింత శీఘ్రకాలములో నింత చక్కఁగ ముద్రించి యాదరించి నందులకు ఆనంద ముద్రణా లయాధికారులకు పదివందల వందనములు. గ్రంథము ముద్రితమగు చున్నప్పుడు సంస్కృత భాగమునంతను సరిచూచిన సుప్రసిద్ధాలంకారికులు, సంస్కృతాంధ్ర పండితులునగు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారికిని ప్రూఫులను దిద్దుటయందు మిగుల శ్రద్ధవహించి మిక్కిలి యోపికతో నింత శుద్ధముగా నీ గ్రంథము వెలువడుటకు కారణభూతులైన శ్రీ కె. వెంకట సుబ్బాశాస్త్రిగార్లకు నా ధన్యవాదములు. మూల తాళ పత్ర మాతృకలతోడను, వ్రాఁత ప్రతులతోడను నీ గ్రంథము నామూలాగ్రముగ సరిచూచి పరిశీలించిన చిరంజీవి శివ సుందరేశ్వర రావునకు నా యాశీస్సులు.

గ్రంథ రచనారంభమునుండియు నమూల్యమైన సలహాల నొసఁగుచు నిరంత రము నాశ్రేయస్సు నాకాక్షించు నాంధ్ర విద్వదగ్రేసరులు, నాంధ్ర విజ్ఞాన సర్వస్వ ప్రధాన గ్రాహకులు నగు డాక్టరు గిడుగు సీతాపతిగారికి నా హృదయ పూర్వక నమస్సులు.

ఇతి శివమ్.

ఇట్లు
విధేయుఁడు
నిడుదవోలు వేంకటరావు
మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షుఁడు.

స్వాతంత్ర్య దినము
15-8-1950
చెన్నపురి.

# అవతారిక

ఉదాహరణ గ్రంథములు తెలుఁగు సాహిత్యముననొక ప్రత్యేకశాఖగా పరిగణింపఁదగినవి. తెలుఁగు సాహితీ రీతులును, కవితారచనలును పుట్టుకచేత తెలుఁగు భాషవలె దాక్షిణాత్య సంప్రదాయమునకు సంబంధించినవి. సాంస్కృతికమగు నార్యభాషాసన్నిహిత సంబంధమువలన నా సంప్రదాయములను మేళవించుకొని పెంపుఁజెందినవి. తెలుఁగున పదపద్య కవితలలో,పదకవిత దాక్షిణాత్య సంప్రదాయమునకు, పద్యకవిత యార్య సంప్రదాయమునకుఁ జెందినవి. వీనినే దేశియనియు, మార్గమనియు ప్రాచీనులు వ్యవహరించిరి. కావున నైసర్గికముగ నాయాదేశముల నుత్పన్నమైన కవిత దేశి యనియు, నట్టిదేశి కవిత యార్య సంస్కారమును పొందినది మార్గమనియుఁ జెప్పవచ్చును.

తెలుఁగు సాహిత్యములో మహాకావ్యములు, పురాణములు, చంపువులు, ప్రబంధములు మార్గ కవితలనియు, ద్విపదలు, యక్షగానములు, శతకములు, ఉదాహరణములు, దండకములు దేశికవితలనియుఁ జెప్ప నొప్పును. ఈ రెండు పథకములయందు రచనలు వేయేండ్లనుండి యవిచ్ఛిన్నముగా సాగుచున్నవి. తెలుఁగున నొక కాలమున నుత్తమ సాహితీ శ్రేణికి పద్యరచన యొక్కటియే చెందిన దనునభిప్రాయము ప్రబలమగుటచేత పద కవితలయందాదరణ సన్నగిల్లినది. అయిన నది దేశీయమగుటచేత ప్రజా సామాన్యమంతయు దానినే యాదరించు వారగుటచేత చరిత్రకెక్కకపోయినను నెంతయో యభివృద్ధిగాంచినది. దీనికి మతసంప్రదాయములు తోడుపడినవి. ఆర్షేయమగు వైదికమత సంప్రదాయకమగు మార్గ కవితయే రాజాదరణము గాంచినది, ఆ వైదికమగు శైవమత సంప్రదాయములు ప్రజాదరణము గాంచినవి. ప్రాచీనకాలమున నా సంప్రదాయములకు మతదృష్టి, సాహిత్యదృష్టి ప్రధానమైనవి. మఱియు నేఁటి చారిత్రిక దృష్టి మృగ్యమనియే చెప్పనగును. కాలక్రమమున నాయాదృష్టి పథకములు వేఱయినవి.

నవీనకాలమున చారిత్రిక దృష్టియు, సాహిత్య సామరస్య దృష్టియు ప్రధానములైనవి. కాబట్టి తెలుఁగున విలసిల్లిన నాయాశాఖల చరిత్రమును సమగ్రముగను, సప్రమాణముగను, సశాస్త్రీయముగను తెలిసికొనవలసిన యావశ్యకత యేర్పడి

నది. కాని యట్టి ప్రయత్నములు సక్రమముగా నీవఱకు జరిగినట్లు కానరాదు. ఒక్క శతక వాఙ్మయ శాఖకు మాత్రమట్టి చరిత్రకలదు. నేనుదాహరణశాఖకు కూడా నట్టి క్రమచరిత్రమును సమకూర్చితిని ఇంకను తక్కిన శాఖలనుగూర్చి నెంతయేని పరిశ్రమ జరుగవలసి యున్నది. ఇంక నిట్టి శాఖలలోఁ జేయవలసిన పరిశ్రమను దెలుపుచున్నాఁడను.

తెలుఁగున ప్రధానమైనది కావ్య ప్రబంధశాఖ. ఈ శాఖయందు బుట్టినన్ని యుత్తమ గ్రంథములు మరేశాఖయందు పుట్టియుండలేదు. వీనిలో నన్నింటిని గూర్చియూ విశేషముతెలుఁగ దగియున్నవి.

## 1. పద్యకవితలు

*1.* *కావ్య ప్రబంధశాఖ:–* సాహిత్యము, చరిత్ర, పురాణమహాకావ్యములు, కేవలకావ్యములు, ప్రబంధములు, ఇతిహాసములు, పురాణములు, మాహాత్మ్యములు, వీనిచరిత్ర, చంపూ పథకము, సాహిత్యరీతులు, ప్రబంధ వాఙ్మయమున శృంగార ప్రబంధములు, చారిత్రక ప్రబంధములు, ప్రబంధ పరిణామములు తెలుఁగు భాషలో గల ప్రత్యేకత.

*2.* *శతకశాఖ :–* పరిశీలన జరిగినది శతక కవుల చరిత్ర దీని ఫలితము.

*3.* *ద్విపద శాఖ :–* తెలుఁగున ప్రత్యేక విశిష్టతగల యీశాఖ చరిత్రమును నేను చేయుచున్నాఁడను. ఇది ప్రబంధశాఖవలె మిక్కిలి విలువ గలది.

*4.* *యక్షగానములు :–* మధురకవితలో నగ్రస్థానమును వహించి నాటకములకు మూలములునగు నీ యక్షగానములనుగూర్చిన పర్యాప్తమైన పరిశీలనలేదు. ఇది ముఖ్యముగ జరుగదగినది.

*5.* *ఉదాహరణములు :* ఈ చరిత్ర మిపుడు పూర్తియైనది.

*6.* *దండకములు :–* ఇదియును నపరిశీలితము. ఇందు భక్తి, శృంగార, చారిత్రక విభాగములు గలవు.

## 2. పదకవితలు

గేయకృతులు :- ఇవి సంగీత శాస్త్రమునకేగాక సాహిత్య శాస్త్రమునకు సంబంధించినవి. స్వర ప్రధానమగు సంగీతమునకును, వర్ణప్రధానమగు సాహిత్యమునకు నైకృతిగూర్చిన తెలుఁగు భాషలో నా రెండింటి పరస్పర సంబంధము విడదీయుటకంటె యజ్ఞత వేఱొకటిలేదు. ఇవియును సారస్వతమున నుత్తమ శ్రేణిలో జేరదగినవియే. ఇది యతివిస్తృతమైనశాఖ.

## 3. సంకీర్తనలు

*1*. సుసంస్కృతములు:- వీనిలో తాళ్లపాక, క్షేత్రయ, యోగంటి సారంగపాణి పదములు గలవు.

*2*. అసంస్కృతములు :- స్త్రీలపాటలు, తందానతాన పదములు, పురాణ కథారూపమున పదములు, ఏల, జోల, సువ్వాల పాటలు.

*3*. వచనకావ్యశాఖ :- ఆంధ్రవచన వాఙ్మయచరిత్రయనుపేర నీవిషయమై కొంత పరిశోధన ప్రారంభమై యొక సంపుటము వెలువడినది.

*4*. శాస్త్రీయ గ్రంథములు :- గణిత, వైద్య, వేదాంత, జ్యోతిషములు, వ్యాకరణ ఛందోఽలంకార గ్రంథములు, నిఘంటువులు.

పై శాఖలన్నియు ప్రాచీనకాలమునుండి నేఁటివఱకు నననఁగా నవీన వాఙ్మయము ప్రవర్తిల్లినదాక వర్తిల్లుచున్నవి. కాబట్టి నవీన వాఙ్మయశాఖలిందు చేర్పఁబడలేదు.

—గ్రంథకర్త


SRI VEMANA ANDHRA ... HYD-A.
శ్రీ వేమన
ఆంధ్ర భాషానిలయము,
నాంపల్లి, హైద్రాబాదు-ఆం. ప్ర

# ద్వితీయ ముద్రణ విజ్ఞప్తి

తెలుఁగు సాహిత్యమున ప్రప్రథమముగా ఉదాహరణ వాఙ్మయశాఖకు నొక సమగ్ర స్వరూపమేర్పఱచిన 'ఉదాహరణ వాఙ్మయ చరిత్ర' వెలువడిన తోడనే నది ఆంధ్రదేశమున వ్యాప్తిగాంచినది. పత్రికలు ప్రశంసించినవి. పండితులామోదించిరి. కవులుదాహరణ రచనలను గావింప ప్రారంభించిరి. విశ్వ విద్యాలయములలో వాఙ్మయచరిత్రలో నిదియొక విశిష్టశాఖగా పరిగణితమైనది. త్రిపురాంతకోదాహరణము పైననేకాక, ఈ గ్రంథమును గూర్చి శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు "With out going critically into the matter for which I do not think, I have enough Competence, I feel you have rendered a great service to the Andhra Public by bringing out this Comprehensive Edition. You deserve our Congratulations and gratitude." అని తమ యభిప్రాయము వ్యక్తపరచినారు. ఇది ప్రకటితమైన నాఁటికి, ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో నాంధ్ర శాఖకు నధ్యక్షులైన ఆచార్య శ్రీ గంటిజోగి సోమయాజిగారీ గ్రంథమునందలి విశేషముల మగ్గడించి "The book is an out standing work of scholorship and a distinct contribution to the study of Telugu Literature" అని సమీక్షించినారు. వీనియన్నింటికన్నమిన్నగ కళాప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణగారు. తమ "ఉదాహరణ కావ్యరహస్య" మూలమున దీని విశిష్టత నినుమడింప జేసిరి.

ఇట్లాంధ్రదేశముననేగాక ఉత్తర భారతదేశమున భారతీయ సాహిత్య చరిత్ర కారులవిది యాకర్షించినది. నవ్యభారతీయ భాషా సాహిత్యములలో అవధాన కవిత. ఉదాహరణ శాఖ. తెలుఁగుననేగాక భారతీయ సాహిత్యమంతటిలోను నొక ప్రత్యేక విశిష్టత గలవని ఆచార్య నగేంద్రగారు "All these literatures have these remarkable distinctive merits. the sangam Literature in Tamil, the Avadhana and Udaharana Literature in Telugu,the SandeshKavyas (Message Poetry) and the Killipatlu, as also the Manipravalam style (inter woven with Sanskrit Malayalam) of Malayalam, the Pawars (a form of ballad) of Marathi, the Akhyan of Gujarati, the Bargeet and Buran Literature of the Assamese, the ballads and the romances of the Punjabi the ghazil of Urdu and the Riti (a kind of rhetorical poetry and Chayavada Schools of Hindi poetry are some of the special features of the various modern Indian Literatures which are remarkable in themselves" (Introduction page ii Indian Literature Editor Dr. Nagendra) అని వ్రాసియున్నారు.

ఒక ఉదాహరణ శాఖకేగాక, తెలుఁగు సాహిత్యమునగల నితర వాఙ్మయ శాఖలలోను, ప్రత్యేకపరిశోధన జరుగుటకీ గ్రంథమే ప్రాతిపదికయని చెప్పవచ్చును. ముందవతారికలో వివరించినట్లుగా, ఆనాఁటికి (అనగా క్రీ. శ. 1950 నాటికి) విశ్వ విద్యాలయములలో ప్రత్యేకశాఖాపరిశోధన ప్రారంభముకాలేదు. అందాయా శాఖలలో జరుగవలసిన పరిశోధనగూర్చి నిరూపించి యున్నాను. ఇప్పటి కాయా విశ్వ విద్యాలయములలో, ప్రబంధము, శతకము, జానపదగేయ వాఙ్మయము, వచనము, యక్షగానము, ద్విపదలనుగూర్చి ప్రత్యేక పరిశోధనలు జరిగి గ్రంథములువెలువడినవి. ఇంకను తెలుఁగున ప్రత్యేకముగా పరిశీలింపదగిన శాఖలున్నవి. జరుగవలసిన పరిశోధన యెంతయోనున్నది. వానిలో 1. అవధాన కవిత 2. ఆశుకవిత-చాటువులు, 3. సమస్యలు 4. మాలికా కవిత 5. దండకములు 6. శాస్త్రీయ గ్రంథములు 7. చిత్ర-బంధ, గర్భకవితలు 8. పదకవితలు 9. సంకీర్తనములు 10. ఆకర గ్రంథములు - మున్నగునవి. కేవలము శాఖలనుగూర్చి యే ప్రసక్తమగుటచేత, ప్రత్యేక ప్రత్యేకముగా, ఒక్కొక్కకవి ఆత్మ గ్రంథములను గూర్చిన పరిశోధనల నిందు పేర్కొనలేదు. పై శాఖలన్నింటిలోను సాకల్యముగా పరిశోధనా గ్రంథములు వెలువడినగాని, ఆంధ్ర సాహిత్య సమగ్ర స్వరూపము మన కభివ్యక్తముకాదు. పై శాఖలన్నియు ప్రాచీన సాహిత్యమునకు సంబంధించినవే యని విజ్ఞులకు విశదమైన విషయమే. ఇట్లు వాఙ్మయ పరిశోధనకు, సాహితీ విమర్శనకు నీ గ్రంథము చాల దోహదముచేసినను, ఈ పదునెనిమిది యేండ్లనుండి, ఇది పునర్ముద్రణ భాగ్యమునందు నవకాశము లేకపోయినది. దానికొఱకు నాచేసిన ప్రయత్నములు ప్రార్థనలు ఫలింపలేదు. కాలక్రమమున నేనుపకార వేతనము పొందినవెనుక దీని నచ్చు వేయించునాశ అడియాసయైనది.

ఈ గ్రంథము వెలువడిన వెనుక ఉదాహరణ రచనలు ప్రచురణము కాజొచ్చినవి. వానిని నేనే సేకరించుచు వీలైనప్పుడెల్ల దీనిని గూర్చిన క్రొత్త విష యములు సేకరించుచునే యుంటిని ఇందలి సంగీతలక్షణములనుగూర్చి రగడలను గూర్చి, భాషావిషయిక విభక్తి ప్రత్యయములనుగూర్చి నూతనములైన సంగతు లను సంగ్రహించుచునే యుంటిని. సంస్కృత వాఙ్మయమునకుకూడ ఈ ఉదా హరణశాఖ నూతన మగుటచేత, ఉపలబ్ధములైన సంస్కృతోదాహరణములను (ఈ గ్రంథమున వాని నిచ్చితిని) దేవ నాగర లిపిలో నచ్చువేసి, ఆంగ్లభాషాపీఠిక వివరణములతో వెలయించిన యావద్భారత వర్షమున తెలుఁగువారి సాహిత్య విశిష్టత తేఁటపడునని ఆ పని ప్రారంభించితిని. అఖిలభారత ప్రాచ్య విద్వన్మహా సభలో అంతర్జాతీయ ప్రాచ్యవిద్వన్మహాసభలో దీని విశిష్టత నెఱుకపఱచితిని.

ఏమైననేమి తుదకు నా పరిశ్రమ లోకమునకు వెల్లడి చేయుటకు నా కవకాశము లేకపోయినది, అంతయు గాకపోయినను, కొంతయైన వెల్లడియగునను కోరికతో

పుస్తకము లభ్యము కాని కారణమున, నేను సంగ్రహించిన కొన్ని విషయములతో గ్రంథము మొత్తము ప్రతిని సంపూర్తించి, ముద్రణమునకొక ప్రతిని సిద్ధము చేసితిని. ఎందఱిని అడిగినను కాలము గడచినకొలది దీని ముద్రణవ్యవస్థ అంధకార బంధురముగనే యుండెను.

ఇట్లుండగా, అదేమి విచిత్ర సంఘటనయో ఒకనాఁడాకస్మికముగా శ్రీ విరివింటి ప్రభాకరశర్మ, శ్రీ ముక్కవాఁడి ప్రభాకరరావు అను సాహితీ జిజ్ఞాసువులు నాయొద్దకు వచ్చి ఈ గ్రంథమును వెలుఁగులోనికి తెచ్చుటకు పూనుకొని నన్నర్థించిరి. అడిగినదే తడవుగా వారి ద్వారా యీ గ్రంథమును ముద్రణమునకై యిచ్చితిని. వీరియుభయుల నామధేయములు, సార్థకనామధేయములు, శ్రీ విరివింటి ప్రభాకర శర్మగారు ఈ గ్రంథమహామాలాగ్రముగ, మూలములతోను, పాఠభేదములతోను పరిశీలించు చుండగా. ముద్రణ శోధనభారమంతయు తానే వహించి, దీని నిట్టి సుపరిష్కృత రూపమున తీర్చిదిద్దిరి. వెలుఁగుని కొఱకు ప్రభాకరుఁడే చాలును. అందు నిరువురు ప్రభాకర నామధేయులున్న కతన నిది ద్విగుణీకృత ప్రకాశమాన మైనది. ఒక సాహిత్యసంస్థగాని, ఒక ప్రచురణకర్తగాని, ఒక ముద్రాపకుఁడు గాని, ఒక సాహిత్యాభిమానియైన సంపన్నుడుగాని పూనుకొనవలసిన నిట్టిపనికి వీరిరువురు పూనుకొని యీ కార్యమును సంపూర్ణముగా సాధించినందులకు వారి నభినందించుచు, శివానుగ్రహమున వారికితోఽధికముగా విద్యాధన సంపద్యశములు గలుఁగు గాక యని యాశీర్వదించుచున్నాఁడను.

పూర్వముద్రణమునందు లేక, ఈ ముద్రణమునం దధునాతన కవి రచితములైన యుదాహరణములను చేర్చితిని. అట్లు చేర్చుటకు నడిగిన వెంటనే తమ తమ యనుమతుల నొసఁగిన – శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, డాక్టరు దివాకర్ల వెంకటావధాని శ్రీమాన్ చెలమచర్ల రంగాచార్యులు, శ్రీ మల్లంపల్లివీరేశ్వరశర్మ, శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి – శ్రీ తిమ్మావఝుల కోదండరామయ్య, శ్రీ శంకర ప్రసాదు, డాక్టరు సుప్రసన్న శ్రీ గాజుల వీరయ్య శ్రీమతి బుర్రా కమలాదేవి గారలకు నా కృతజ్ఞతలు తెలుపు చున్నాఁడను.

ఈ గ్రంథము స్వంతముగ ముద్రించుకొనుటకను జ్ఞనిచ్చి, యిరువదేండ్ల కాల ముద్యోగరీత్యా నా సాహిత్య సేవ కవకాశము గల్పించి, నేఁడుపకారవేతన మొసంగుచున్న, మదరాసు విశ్వవిద్యాలయోపాధ్యక్షులు – బహుశాంగ్లేయ బిరుదావళీ విరాజమానులులైన శ్రీ డాక్టరు ఆ. లక్ష్మణస్వామి మొదలియారుగారి ననవరతము స్మరించుచునే యుందును.

వాఙ్మయ ప్రపంచమున నా సాహిత్యకృషి కత్యంతము దోహదము చేయుచు, ఆప్తులు, నా శ్రేయోభిలాషులగు శ్రీ శివశంకర శంభుప్రసాదు, డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ పి. వి. రాజమన్నారు, శ్రీ వి. ఆర్ నార్లగార్లకు నా మనఃపూర్వక కృతజ్ఞతాంజలులు.

ఆదిని కట్టమంచి రామలింగారెడ్డిగారీ యుదాహరణ వాఙ్మయ ప్రథమ ముద్రణమునకు హేతుభూతులైనారు - ఈ ద్వితీయ ముద్రణకాలమున నీనాడు చిత్రముగా ఆంగ్లవర్ణ క్రమానుసారముగ సి ఆర్. రెడ్డిగారి వెనుక డి యస్. రెడ్డిగారు. (C. R. Reddy-D. S. Reddy), నా సాహిత్య జీవితమునకే గాక నా జీవితమున కాధారమైనారు. ఉస్మానియా విశ్వవిద్యాలయోపాధ్యక్షులై, ఉస్మానియా విశ్వవిద్యాలయమును, విశ్వవిద్యాలయ చరిత్రలో సువర్ణమయముగ (ఈ విశ్వవిద్యాలయమునకు 1968 స్వర్ణోత్సవ సంవత్సరము) నొనర్చిన విశ్వవిఖ్యాత విద్యావేత్తలైన శ్రీ రెడ్డిగారికి నేను శాశ్వతముగా ఋణిని. ఉస్మానియా విశ్వవిద్యాలయమున వెలువడు ఆంధ్రమహాభారత సుసంస్కృత ముద్రణము వలన, శ్రీ రెడ్డిగారి కీర్తి, ఆంధ్రసాహిత్య ప్రపంచముననే గాక సర్వాంధ్ర లోకము నాచంద్రార్కమై వెలయగలదు.

ఈ "ఉదాహరణ వాఙ్మయ చరిత్ర" నింత సర్వాంగ సుందరముగా ముద్రింపించి సకాలమునకు నందజేసిన విజయ భాస్కర పబ్లికేషన్స్, హైదరాబాదు వారి'ని నేనెంతయో యభినందించుచున్నాను.

ఇక నొక్కమాట - ఈ గ్రంథము వెలువడినను దీని ప్రచార భారమంతయు, విశ్వవిద్యాలయములు, సాహిత్య సంస్థలు, గ్రంథాలయ శాఖాధికారులు, పత్రికాధిపతులు, విద్యావేత్తలు విద్వాంసులు, విద్యార్థులు వీరిపైననే యాధారపడియున్నది. వారందఱు గ్రంథ వ్యాప్తికి సహకరింపగలరని యాకాంక్షించుచున్నాను.

గ్రంథ ప్రకాశకులయీ ప్రచురణము ప్రచారములోనికి వచ్చి, ఫలవంతమగునేని, అది నా సాహిత్య పరిశ్రమకు ప్రోత్సాహము గల్గించి ఇట్టి గ్రంథములు ముమ్ముందు వెలువడ జేయుట కవకాశము లభింపజేయునని విన్నవించుటకే యీ విజ్ఞప్తి.

ఇట్లు
నిడుదవోలు వేంకటరావు
లక్ష్మీకాంత నిలయము, 2-2-1137/5,
న్యూనల్లకుంట, హైదరాబాదు-13.

భాగ్యనగరము,
26-7-1968

# విషయసూచిక


పుటా

1. ప్రథమ ముద్రణ విజ్ఞప్తి ... ... ... vii
2. అవతారిక ... ... ... ix
3. ద్వితీయ ముద్రణ విజ్ఞప్తి ... ... ... xii
4. ఉదాహరణములు – వానిలక్షణము ... ... ... 1
5. ఉదాహరణములు – సాహిత్య సమీక్ష ... ... ... 13
6. సంస్కృతోదాహరణములు – వానిలక్షణములు ... ... ... 60
7. ఛందస్సు – రగడలు ... ... ... 70
8. ఉదాహరణములు – చారిత్రకయుగ పరిణామము ... ... ... 93
9. బసవోదాహరణము (తెలుఁగు) పాలకుఱికి సోమనాథుఁడు ... ... 94
10. త్రిపురాంతకోదాహరణము .. ... ... 104
11. శ్రీవేంకటేశ్వరోదాహరణము ... ... ... 119
12. శ్రీహనుమోదాహరణము ... ... ... 130
13. శేషార్యోదాహరణము ... ... ... 142
14. శ్రీకృష్ణోదాహరణము ... ... ... 153
15. శ్రీనాగేశ్వరోదాహరణము ... ... ... 171
16. గోపాలోదాహరణము ... ... ... 178
17. వీరేశలింగోదాహరణము ... ... ... 188
18. అన్నమార్యోదాహరణము ... ... ... 194
19. శంకరోదాహరణము ... ... ... 203
20. శ్రీమద్రామానుజోదాహరణము ... ... ... 211
21. శ్రీవిశాలంధ్రోదాహరణము ... ... ... 219
22. శ్రీవీరభద్రోదాహరణము ... ... ... 226
23. సామగాన ప్రియోదాహరణము ... ... ... 236
24. శ్రీవేంకటాద్రినిలయోదాహరణము .... ... ... 246
25. శ్రీలక్ష్మీనరసింహోదాహరణము ... ... ... 255
26. బసవోదాహరణము (సంస్కృతము) ... ... ... 262
27. చిక్కదేవరాయోదాహరణము ... ... ... 273
28. శివోదాహరణము ... ... ... 281
29. మల్లికార్జునదేవ స్తవోదాహరణము ... ... ... 289
30. పరిశిష్టము ... ... ... 297
31. శ్రీరామోదాహరణము (తెలుఁగు) ... ... ... 313

# ఉదాహరణ వాఙ్మయ చరిత్ర

---

## ఉదాహరణములు - వాని లక్షణము

ఉదాహరణములనగా భాషయందుగల సప్త విభక్తులు సంబోధన విభక్తిని నుదాహరించు లఘుకృతి.

ఇది ప్రధానముగా స్తోత్రరూపమగుటచే దేవతాపరమగు కావ్యము-కాని మానవ పరమగు కృతులును నుండును.

ఇందు-వృత్తములు-కళికలు-ఉత్కళికలు-సార్వవిభక్తిక పద్యము-కవి కృత నామాంకిత పద్యము అను విభాగములు గలవు.

ప్రతి విభక్తికి ఒకే వృత్తము, ఒకే కళిక, ఒకే ఉత్కళిక నియతములు.

వృత్తములలో చంప కోత్పలములు, మత్తేభ శార్దూల వృత్తములు మాత్రమే ప్రయుక్తమగును.

కళిక యనగా మాత్రాచ్ఛందస్సునకు సంబంధించిన రగడభేదము, ఇందెనిమిది పాదములు మాత్రమే యుండును.

ఉత్కళిక యనగా కళికలో సగము భాగము - అర్ధకళిక - ఇందును నెనిమిదిపాదములే.

కళికయందు ప్రతిపాదాంతమునను విభక్తి ప్రత్యయము భాసింప వలెను. ఉత్కళికయందు చివరి రెండు పాదములలో మాత్రము భాసింపవలెను. సంబోధనయందు మాత్రమన్ని పాదములను సంబోధనాంతములుగానే యుండ వలెను,

చతుర్థీవిభక్తియందు ప్రతిపాదాంతమున విభక్త్యాభాసము స్పష్టముగా నుండవలెను.

కళికలయందు ప్రతిపాదమును స్వతంత్రవాక్యముగా నుండవలెను. ఉత్కళికయం దేకసమాసముగా పాదములుండపలెను.

సార్వ విభక్తికము-దీని యందొక్క పద్యముననే యన్నివిభక్తులు ప్రయుక్తములు కావలెను. ఇది సాధారణముగ మత్తేభమున గాని, శార్దూల వృత్తమున గాని యుండును.

కవికృతి నామాంకిత పద్యము - ఇందొకే పద్యమున కవిపేరు, నుదాహరణము పేరు నుండవలెను.

ఉదాహరణములలో పైని వివరించిన వృత్తములు తప్ప తక్కిన పద్యము లేవియు ప్రయుక్తములు కావు.

ఇది కేవలము స్తుతిరూపకమైనది కావున గానయోగ్యమైనది-ఇందలి పద్యములు రాగాంగ ప్రధానములు. అనగా రాగములతో పాడదగినవి - కళికోత్కళికలు తాళాంగ ప్రధానములు. త్రిపుట-జంపె-రూపక తాళముల తోడనే పాడవలెను. ఆ తాళము కనుకూలములైన, త్ర్యశ్య - చతురశ్ర-మిశ్ర జాతులందు ప్రకటితములు కావలెను.

మహాకావ్యమునందలి నాయకునివలె నిందును నాయక గుణకీర్తనమే ప్రధానము.

"అల్పాక్షరముల ననల్పార్థ రచన కల్పించుటయగాదె కవి వివేకంబు" అన్న సూక్తికి నుదాహరణములు లక్ష్యములు.

ఇందలి కళికోత్కళికా పద్య సంఖ్య యిరువది యాఱు,

ఈ యిరువది యాఱు సంఖ్య సదాశివుని షడ్వింశతి తత్త్వములకు ద్యోతకము.

---

## ఉదాహరణముల ప్రాచీనత

ఉదాహరణములు ప్రస్తుత స్వరూపమునగాక పోయినను, వాని యందలి కొన్ని లక్షణములు ప్రాచీన భారతీయ వైదిక లౌకిక సాహిత్యమున గానవచ్చుచున్నవి.

ఉదాహరణము ప్రధానముగా స్తుతిపరమైనది. ఇట్టి స్తుతులు ప్రప్రథమమున మనకు వేదములయందాదియైన ఋగ్వేదమునందే కానవచ్చుచున్నవి. ఈ స్తుతులుగల సూక్తములకు "కుంతాప సూక్తములు" అని పేరు. ఇవి యా వేదమున నిరువదియవ కాండమున గలవు. వీనిని "నారాశంసి" అని కూడ పేర్కొందురు-వీని స్వరూపము నెఱుంగుటకు వాని యాంధ్రానువాదముల నీ క్రింద నిచ్చుచున్నాను.

1. ఓ జనులారా! దీనిని వినుడు ఒక వీరుని యశోగానము జేయఁబడును-అరువది వేల తొమ్మిది వందల గోవులను రుశమదేశపు కౌరము డిచ్చెను.

2. భార్యలతో గూడిన యాతని రథ మిరువది లొట్టియలతో లాగబడును. అతని రథము ఆకాశమంత ఎత్తుగలది.

3. ఇతడు ఋషికి నూఱునిష్కములను (బంగారు నాణెములను) పది వజ్రములను, మూడు వందల గుఱ్ఱములను పదివేల గోవులను నిచ్చెను.

4. ఓ కవీ! ఫలవంతమైన వృక్షముమీది పక్షివలె ననుభవింపుము క్షురము (కత్తి) రాలమీద వలెనే నీ నాలుక నీయోష్ఠముల నడుమ శీఘ్రముగ రాగలదు.

5. కవులు ఆవులవలె వేగముగ నడచుచు తమ పవిత్రమైన ఛందములను జదువుదురు. వారిపుత్త్రాదులింటి యొద్దనున్నారు. పశ్వాదులను కాపాడుచున్నారు.

6. ఓ కవీ! గోవులను సంపత్తులను యిచ్చు నీ కావ్యమును నీవలికి రానిమ్ము. వీరుడు తన బాణమును వేసినట్లు దేవతలలో నీవాక్కును విడువుము.

7. మనుష్యులలో దేవుడును, విశ్వములందు మనుజులందఱను నేలువాడుననగు వైశ్వానర పరీక్షితుని యశోగానము వినుడు.

8. పరీక్షిత్తు ఆపద యెఱిగి మాకు క్షేమము గలుగజేసెను.

9. ఈ రాజు రాజ్యమునందు యవలు (ధాన్యవిశేషము) సూర్యకిర
ములవలె పెరిగి పైకి పోవును.

పై వానియందు పరీక్షిత్తు ప్రశంస యుండుటచేత వీనిని పారిక్షితమ
లందురు. పై యనువాదము ఆంధ్ర విజ్ఞానసర్వమున అధర్వవేదము - అన
వ్యాసము నుండి గ్రహింపబడినది.

## లౌకిక సంస్కృత వాఙ్మయము

ప్రాచీన సంస్కృత కావ్యములలో "ఉదాహరణము" అని పేరిత
స్పష్టముగా నిది ప్రథమున కవికుల గురువగు కాళిదాసుని రఘువంశము
గాన వచ్చుచున్నది.

"జయోదాహరణం బాహ్వోర్గాపయామాస కిన్నరాన్"

4 సర్గ 78 శ్లోకము

రఘువంశమునందే కాక యాతని విక్రమోర్వశీయ నాటకమునందున
నీ పదము గానవచ్చుచున్నది.

"ప్రత్రేనివేశిత ముదాహరణం ప్రియాయా"

2 అం. 15 శ్లోకము

కాని వ్యాఖ్యాత లెవ్వరును దీనిని సరిగ వ్యాఖ్యానింపలేదు. కాళిదాస
కన్న ప్రాచీనుడగు భరతముని నాట్యశాస్త్రమున కళికోత్కళికల ప్రస్తావన
గావించెను. అవి మాత్రాచ్ఛందస్సంబంధములని ముందే తెలుపబడినది. దీనిని

(ఇది 3 వ పుటములో గల 6 వ సూక్తమునకు సంబంధించినది.)

1. ఈ భావము, లౌకిక సంస్కృతమున. కింకవి స్తవ్యకావ్యేణ కింకాండేన ధనుష్మతః.
అని యనూదితమైనది–దానిని నన్నెచోడుడు కుమారసంభవమున నిట్లనువదించినాడు.

క. ముదమున సత్కవికావ్యము
వదరక విలుకాని పట్టినమ్మును బరహృ
ద్భిదమై తలయూపింపని
యది కావ్యమె మఱియు పట్టినదియుం గరమే (1-41)

బట్టి భరతముని నాటికే, ఈ మాత్రాఛందస్సులలో నున్న దేశిరచనలు, సంస్కృత వాఙ్మయమున కెక్కినవని యూహింపనగును. కాళిదాసు పేర్కొన్న జయోదాహరణ మిట్టి మాత్రాఛందస్సహితములగు కళికోత్కళికలతో యుండె నని యూహించుట సమంజసమే యగును. ఇది కేవలము దేశిరచన కాన వ్యాఖ్యాతలు దీనిని వివరింపలేదు.

నేడు మనకు లభించిన నాలుగు సంస్కృతోదాహరణములు యాంధ్రోదాహరణ లక్షణ లక్షితములై యున్నవి. కావున నుదాహరణములు మార్గదేశ కవితా భేదమున రెండు తెఅగులుగా నేర్పడిన కవితా పథకములలో తెలుగున దేశికవితా శాఖలో ప్రత్యేక విశిష్టత గలవిగా నెన్ననగును.

సంస్కృతముననే లేకపోయినప్పుడు దేశభాషలలో లేకుండుట లో నాశ్చర్యములేదు. తెలుగు కన్న ముందు సాహితీరీతులను వెలయించిన ద్రవిడ కన్నడభాషలలో నివిలేవు. తరువాత సారస్వతస్థాయినందిన మళయాళ మహారాష్ట్రి ఘూర్జర భాషలలోనివి లేనేలేవు. కావున భారతీయదేశ భాషలలో నొక స్వతంత్ర విశిష్టశాఖ వెలయించిన గౌరవము తెలుగుదేయని నిశ్చయ ముగా చెప్పవచ్చును.

ఈ యుదాహరణములు భాషావాఙ్మయ చరిత్రల కెట్లు తోడ్పడునో వివరించెదను.

## ఆంధ్రకవితా పరిణామము

ఆంధ్రకవితా పరిణామమును దెలిసికొనుట కుదాహరణములు సాధన ములు. తెలుఁగు కవిత యేకపదమై, ద్వీపదమై, త్రిపదమై, చతుష్పదమై పరిణతిఁ జెందినట్లు కానవచ్చుచున్నది. ఏకపదములగు పాటలును, ద్విపదము లగు ప్రబంధములును, త్రిపదాది సంయుక్తములై సంపూర్ణగాన యోగ్యము లగు యక్షగానములును, సలక్షణ చతుష్పాద వృత్తకవితా సమన్వితములగు భారతాది గ్రంథములును వాఙ్మయ వీథిని ప్రథమ, ద్వితీయ, చతుర్థ ఘట్ట ములు. ఉదాహరణములీ తృతీయ ఘట్టమునఁజేరినవి. ఇవి కేవలము

ఏక పదములుగాక, ద్విపదాదులవలె నొకే ఛందస్సు ననుసరింపక, పదకవి యందలి యేదేనొక ఛందోవిశేషము ననుసరించును. యక్షగానములవలె గాన యోగ్యములైన పదములను హెచ్చుగాఁ గలిగి యుండకపోయినను లయ తాళసమన్వితములగు పదములతోఁగూడి వృత్తములు గలిగియుండును. కావున నివి ద్విపదకవితకును, యక్షగాన కవితకును మాధ్యమికములని నిశ్చయింప వచ్చును.

## సంగీత సాహిత్యముల సంబంధము

సంగీత సాహిత్యములు రెండును సరస్వతీ స్తనద్వయమని మన పూర్వులు వర్ణించిరి. అది యెంతయు స్వాభావికముగను, సత్యసూచకము గను, జ్ఞానోపదేశికముగనున్నది. మానవశిశువు మాతయైన వాగ్దేవి స్తన్య రసమును త్రాగియే మనోబల, ధీబల లేక బుద్ధిబలములచే వర్ధిల్లును. కన్నతల్లి పాలుద్రావి కమనీయమగు దేహబలము సమకూర్చుకొనును. ఈ యిర్వురు తల్లుల పెంపుచేతనే భారతీయులు దేహమనోబలముల రెండింటి యందును తేజరిల్లుచున్నారు. ఈ రెండింటి వలన నైహిక సుఖము నా ముష్మికానందము నొకేమారు లభ్యమగుచున్నవి.

సంగీత సాహిత్యములు వక్షోజములవలె ఏకకాలజనితములు. సంగీత మునకరిగి, దయాగుణమున ప్రబలు మనస్సును, సాహిత్యమున పెరిగి జ్ఞాన శక్తికి లోబడిన బుద్ధియు హృదయసంజాతములే. స్తనములు సమకాల జన్యములు. అట్లనే సంగీత సాహిత్యములును ఏదిముందు పుట్టినది యని చెప్పుట బ్రహ్మముందా? సృష్టిముందా? యనునట్టిది. ఈ సమాసమున నున్న మొదటి పదము సంగీతముగావున నదియే ముందు పుట్టినదని కొందఱు చెప్పుదురు. కాని యది వ్యావహారికమునకు దూరము. 'ఆ' యనునప్పుడు సంగీత పరమగుధ్వనిని, సాహిత్యమగు నక్షరములేక వర్ణమును రెండు నేక కాలమందే యుచ్చరించుచున్నాము గాని వేరువేరుగ నుచ్చరించుట లేదు.

కాబట్టి యీ సమాసము రెండింటి గుణములు సమసించిన విశేష రూపమని గ్రహింపవలెను. ఈ సామరస్యము చేతనే వేదములు స్వర వర్ణ ప్రధానములై సంగీత సాహిత్యములకు ప్రాతిపదికలైనవి. ఆ వేద స్వరములను సంపూర్ణ ముగ నాకళించుకొనిన తెలుఁగు భాష, యతిప్రాసములచే పద పద్య కవితల యందు సంగీత సాహిత్య సౌహిత్యమును సమాచీనముగా నవతరింపఁజేసినది- సంగీతము సామవేదమునుండి పుట్టినది.

స్వరప్రధానమైన సంగీతమునకు వర్ణప్రధానమైన సాహిత్యమునకు లక్ష్యభూతములైనవి యుదాహరణములు. ఇందు మాత్రాఛందస్సంబంధము లగు రగడలు. తాళములతో పాడఁబడుటచే ఛందస్సునకును సంగీతమునకుఁ గల సంబంధమును వ్యక్తము సేయుచున్నవి. స్వరముచ్చారణ కాలము ననుసరించి యుండును. ఆ యుచ్చారణ కాలముయొక్క దీర్ఘత ననుసరించి వర్ణములు లేక మాత్రలేర్పడును. దాని వివరము లివి.

స్వరకాలమున మొదటిది క్షణము. అది నూరు తామరరేకులు దొంతరగాఁబెట్టి సూదితోఁ గ్రుచ్చినట్లయిన అన్ని రేకులు దిగబడుకాలము.

అట్టిక్షణములు యెనిమిది లవము. అట్టిలవములు ఎనిమిదైనచో నొక కాష్ట. కాష్టలు ఎనిమిది కలిసి నిమిష మగును. అట్టినిమిషము లెనిమిది కళయనఁబడును. ఆ కళలు రెండయినచో నొక చతుర్భాగము. చతుర్భాగములు రెండు కలిసి అనుద్రుతమనఁబడును. ఇది హ్రస్వమైన అకారోచ్చారణకాలము. రెం డనుద్రుతములొకద్రుతము. ద్రుతములురెండు లఘువనఁబడును. ఈ లఘువు ఛందశ్శాస్త్రమునకు సంబంధించినది.

దీనికే మాత్రయని పేరు. ఈ వ్యవస్థనుఁబట్టి ధ్వనిశాస్త్రము ననుసరించి సంగీతమున నేర్పడిన లఘువు ఛందస్సున మాత్రాగణ సంబంధమగు లఘువుగా రూపొందినది. రగడలు మాత్రాగణ ప్రధానములు గావున నీరెండిటి అవినాభావ సంబంధమీ యుదాహరణములలో గోచరించుచున్నది. పైవానిలోని కళ, ద్రుతము అను పదములు సావధానముగా పరిశీ

లింపవలసియున్నవి. నేటి తెలుఁగు వ్యాకరణములలో కళ, ద్రుతము అను సాంకేతిక పదములు కానవచ్చుచున్నవి. కాని వీనియుత్పత్తి వ్యాకరణము లందుఁగాని, తద్వ్యాఖ్యానములందుఁగాని కానవచ్చుటలేదు. మరియొక విశేషమేమనఁగా ఈ కళాద్రుత విభాగము తెలుఁగున, తెలుఁగుభాషలో వ్రాయఁబడిన, యాంధ్రభాషాభూషణాది ప్రాచీన వ్యాకరణములందు కాన రాదు. కావ్యాలంకార చూడామణి, కవిచింతామణి, ఆంధ్రకౌముది (గణప వరపు వేంకటకవి)-వీని యందును నీ ప్రసక్తి కానరాదు.

ఈ పదములు రెండును నన్నయభట్ట కృతమని చెప్పఁబడు యాంధ్ర శబ్ద చింతామణి యందుఁబ్రథమముగా కానవచ్చుచున్నవి. తరువాత దాని ననుసరించిన, అప్పకవీ యాహోబలపండితీయాది గ్రంథములందును నేటి వ్యాకరణములందును నివి పరిగణితములై యున్నవి. పైధ్వనిశాస్త్ర సంప్ర దాయము ననుసరించి చూడఁగా నీ రెండు పదములును సంగీత శాస్త్రమునుండి గ్రహింపఁబడినవా యను సందేహము కలుఁగక మానదు. సూక్ష్మదృష్టితోఁ బరిశీలించిన యెడల నిదియే నిజమని నిర్ణయింపనగును. ఈ దృష్టితో తెలుఁగును గూర్చిన సంస్కృతవ్యాకరణములను జాగరూకతతోఁ బరిశీలించిన యెన్నో నూతనాంశములు బయల్పడఁగలవు.

సహజమాధుర్య ప్రధానమగు నాంధ్రభాషయట్టి సంగీతమున కనువగు నట్లితర భాషలు కాఁజాలవు. ఆంధ్రభాషయందుఁ బద, పద్యకవితలలో పదము సంగీతమును, పద్యము సాహిత్యమును దెలుపును. ఆంధ్రకవితా విషయమునఁ బ్రయుక్తములగు మార్గదేశి పదములు సంగీత శాస్త్రమునుండి సాహిత్యమునఁ బ్రసక్తములైనవి. భరతాచార్యుని నాట్యశాస్త్రముననే మార్గ దేశిభేదములు ప్రపంచితములైనవి. ఉదాహరణములలో నియమితములగు రగడలు తాళాంగ ప్రధానములు.

తాళాంగమున త్ర్యశ్ర, చతురశ్ర మిశ్రజాతులు ప్రకటితములగు చుండును. ఉదాహరణములోని రగడల నాయాతాళములతోడ గానముచేయ

వలెనని మనయాంధ్ర లాక్షణికులు నిర్దేశించియున్నారు. హరిగతియను రగడకు నాటతాళమును, హయప్రచారము, తురగవల్గనము, విజయమంగళము అను వీనికి రూపకతాళమును, మధురగతి కేకతాళమును, ద్విరదగతి, విజయ భద్రలనువానికి జంపెతాళమును, హరిణగతి, వృషభగతులకు త్రిపుటతాళమును ఛందోగ్రంథములందు నియతములై యున్నవి. అనఁగా నీ రగడ లాయా తాళముల ననుసంధింపఁబడవలెనని లాక్షణికులమతమని తెలియుచున్నది. మఱియు నవ్యక్తమధురమగు గానమునకు సువ్యక్తమధురమగు తెలుఁగు కవితకు నుదాహరణములే కుదిరికఁ గూర్చినవి.

## ఛందస్సు

ఉదాహరణములలో వృత్తములు మార్గకవితానుసరణములు. రగడలు దేశికవితానుసరణములు. ఉదాహరణములలో నుపయుక్తములగు చంపకోత్పల ములు, మత్తేభ శార్దూలములు నక్షర గణప్రధానమగు సంస్కృతచ్ఛందస్సు నుండి జనించినవి. రగడలు మాత్రాగణనిబద్ధములై దేశికవితకు నాధారమగు నాంధ్రచ్ఛందస్సునుండి పుట్టినవి. ఈ ఛందస్సమ్మేళనము తొలుత గ్రంథ రూపమున నాంధ్రవాఙ్మయమునం దుదాహరణములయందే కానవచ్చుచున్నది. మఱియు నీ విషయము సంస్కృతాంధ్రచ్ఛందస్సుల పౌర్వాపర్యనిర్ణయ మునకుఁ గూడఁ దోడ్పడఁగలదు. చంపకోత్పలములు సంస్కృతమున నున్నను వానికి సంస్కృతమునఁ బ్రచారములేదు. రగడకు 'రఘట' మనియు, సీసమునకు 'శీర్షక' మనియు సంస్కృత నామములు కలవు. కాని సంస్కృత మున రఘటకును, శీర్షకమునకును ప్రచారమేలేదు. ఇట్లే ద్విపదలక్షణము సంస్కృతమున నున్నను తెలుఁగుననే ద్విపదకుఁ బ్రచారము మెండు. సంస్కృతమున లేదు. రగడ, సీసము, ద్విపద మున్నగు ఛందస్సులు దేశి కవితకు సంబంధించినవి. ఏ జాతివారికైన జాతీయ వాఙ్మయము తొలుత పదరూపముగనుండఁగ, దానినుండియే ఛందస్సు లావిర్భవించుచుండును.

ద్రావిడభాషలలో, నందు ముఖ్యముగఁ గర్ణాటాంధ్రభాషలలో సంస్కృత భాషాసంస్కారమును, సంసర్గమును హెచ్చుగానుండుటచే ద్రావిడభాషాసహజములగు ఛందస్సులే సంస్కృతములై భారతీయ వాఙ్మయమునఁ బ్రపంచింపఁబడెనని ఛందశ్శాస్త్రవిమర్శకులు కొందఱు తలంచుచున్నారు. వారి తలఁపులకు నేఁడు తావులేక పోలేదు. నేఁడు సంస్కృతభాషయందు ద్రావిడ భాషలనుండి తీసికొనిన పదములు పెక్కువ్యవహారముననుండి సంస్కృతముగాఁ బరిగణింపఁబడుచున్నవి[1]. ఆ విధముగానే ద్రావిడ భాషలలోని ఛందస్సులుకొన్ని సంస్కృతమునఁజేరి సంస్కృతము లయ్యెననుటయు సమంజసముగఁ గన్పట్టుచున్నది. దక్షిణాపథమున నార్యానాగరకతా విజ్ఞానములు వ్యాపింపక పూర్వము తద్విలక్షణమగు ప్రత్యేకదాక్షిణాత్య విజ్ఞానమును, నాగరకతయును బెంపొందినట్లు చరిత్రవలన మనకుఁ దెలియుచున్నది. పై విషయములఁ బట్టి దేశభాషాసహజములగు ఛందస్సులంగూర్చి మన మెంతయేని పరిశ్రమ కావించి వాని ప్రత్యేకత నెఱుంగవలయును. నన్నయాది మహాకవు లీ దేశికవితాప్రాధాన్యమును, దేశభాషా ఛందస్సులను గమనించియే తమ గ్రంథములందు జాత్యుపజాతులను వృత్తములకంటె విపులముగా వాడియున్నారు. ఆంధ్ర కవితాసౌధనిర్మాణమునకు ఛందస్సు పునాది వంటిదిగదా!

## వ్యా క ర ణ ము

విభక్తిప్రత్యయములను నియతముగాఁ గూర్చుటచే నుదాహరణములు వ్యాకరణశాస్త్రమును, భాషాతత్త్వశాస్త్రమును దెలిసికొనుట కుపయుక్తములగుచున్నవి. ఆంధ్రవ్యాకరణములలోఁ జెప్పఁబడు విభక్తిప్రత్యయముల పరిణామమును, వానివ్యుత్పత్తులను నెఱుఁగుట భాషాచరిత్రకారుల కత్యంతావశ్యకము. ఆయాకాలములంబుట్టిన యుదాహరణముల నాయాకాలములఁ

1. ఇట్టి పదముల పట్టికకు కిట్టెలు దొరగారి "కర్ణాటాంగ్లభాషానిఘంటువు" భూమికను జూడఁదగు.

బుట్టిన వ్యాకరణముల ననుసరించి పరిశీలించినచోఁ గొన్ని విభక్తులకు వ్యాకరణములలోఁ బ్రత్యయములుగాఁ జెప్పఁబడినవి యుదాహరణములలోఁ గానరావు. ఒక్క యుదాహరణములయందేగాక ఆయాకాలములఁబుట్టిన కావ్యాదులందును నాయాప్రత్యయము లుపయుక్తములు కాకుండుటచే నాంధ్రవైయాకరణులు విభక్తులఁ గూర్చి యొనర్చిన సిద్ధాంతము లెంతవఱకుఁ బ్రమాణములుగాఁ గొనఁదగునో యూహింపవలసియున్నది. 'కై, కొఱకు' అనుచతుర్థీవిభక్తి ప్రత్యయముల నిందులకుదాహరణముగాఁ జూపుచున్నాను. క్రీ. శ. 1220 సం. ప్రాంతమునరచితమైన బసవోదాహరణమునఁగాని, క్రీ. శ. 1380 సం. ప్రాంతమున రచితమైన త్రిపురాంతకోదాహరణమునఁ గాని యీ ప్రత్యయములు కానరావు. ఒకవేళ యుదాహరణ కర్తలు వీనిని మానిరన్నను, నంతకుముందు క్రీ. శ. 1050 సం. ప్రాంతమున రచియింపఁ బడి మనకు లభ్యములైన గ్రంథములలోఁ బ్రథమముగాఁ బరిగణింపఁ బడుచున్న నన్నయభట్టరచిత భారత భాగమునఁగాని, యాకాలమున మనకు లభ్యములైన శాసనములలోఁగాని యీ ప్రత్యయములు కన్పట్టవు†. ప్రాచీన వ్యాకరణములలో నాంధ్రభాషలోఁ బద్యరూపమున వెలసిన తొలివ్యాకరణ మగు నాంధ్రభాషాభూషణమున 'కొఱకు' ప్రత్యయము లేదు. నన్నయ భారతమున 'కై' ఉపయోగింపఁబడినను 'కు + అయి'అని విభజింపఁ బడినది. ఆ ప్రత్యయము ప్రయుక్తమైనపుడెల్ల స్వరయతియేగాని, వ్యంజన యతి లేకుండుటచే నన్నయకాలమున నీ ప్రత్యయము వాడుకలో లేదని చెప్పనొప్పును. కేవలము 'అయి' అను ప్రత్యయమే 'కొఱకు' అనునర్థమునఁ

† ఆచార్య చిలుకూరి నారాయణరాయ విరచితము 'ఆంధ్రభాషా చరిత్రము' ద్వితీయ భాగము.

1. విభక్తి ప్రకరణము. పుట. 1060.

2. పదునొకండవు శతాబ్దమునాఁటి తెనుఁగుభాష. పుట. 1388.

3. ఆంధ్రశబ్ద చింతామణి – అజన్త పరిచ్ఛేదము. పుట. 1622.

పై యాకరములవలన 'కై, కొఱకు' 'చతుర్థ్యాః స్తః' అని సూత్రింపఁబడిన ఆంధ్రశబ్ద చింతామణి నన్నయకృతమనుట చెల్లదుకదా!

ప్రాచీనకాలమున వాడుకలో నుండెను. ముందు పేర్కొన్నిన బసవోదాహ రణముననుు, త్రిపురాంతకోదాహరణముననుు చతుర్థీవిభక్తి రూపము 'కున్నై' అని కలదు. ఇది షష్ఠీవిభక్తి ప్రత్యయమగు 'కున్' అనుదానికి చతుర్థీ విభక్తి ప్రత్యయము 'అయి' చేర్చుటవలన నేర్పడినది. ఇట్టి ప్రత్యయరూప నిష్పత్తి క్రమము మనమెఱింగినచో వ్యాకరణములోఁ జెప్పఁబడిన చతుర్థికి షష్ఠియే నిలుచునను సూత్రార్థమును సులభముగ గ్రహింపఁగలము. ఆంధ్ర విభక్తి ప్రత్యయముల చరిత్రము మన మీ విధముగఁ బరిశీలించిన భాషా తత్త్వశాస్త్ర మెంతయేని యభివృద్ధినందఁగలదు.

విభక్తి ప్రత్యయముల వాడుక నియతముగా నుదాహరణముల నున్నను, నాంధ్రప్రబంధములయందును, యక్షగాన, శతకాదులందును విభక్తి నియమము కానవచ్చుచున్నది. ఇది యావాఙ్మయములపైని ఉదాహరణ వాఙ్మయ ప్రభావలక్షణమేయని నిరూపింపవచ్చును. కొన్ని ప్రాచీనాంధ్ర ప్రబంధములయం దాశ్వాసాంతములు సంబోధనాంతములుగానుండక, యొక యాశ్వాసమే విభక్తితో నంతమొందినఁ దరువాతి యాశ్వాస మావిభక్తి తోడనే మొదలిడుట కానవచ్చుచున్నది.

ఇఁక సర్వాంధ్ర ప్రబంధసాధారణములగు షష్ఠ్యంతములు కూడ నీయుదాహరణ లక్షణమేయని చెప్పనొప్పును. ఆంధ్రప్రబంధములలోఁ గృత్యవతరణికతొల్లి సార్వవిభక్తికముగా నుండెడిదనియుఁ గాలక్రమమున నాపద్ధతిమాఱి శేషషష్ఠియు సంబోధనయు నుపయుక్తమై షష్ఠ్యంత సంబోధన విభక్తి రచనము నియతమయ్యెననియు నూహింపఁదగియున్నది. యక్షగానముల యందంతములు ద్వితీయా విభక్తితోనుండును. శతకము లన్నియు సంబోధనతో నుండుట యంద ఱెఱింగినదే ! పద్యమయములగు ప్రాచీనాంధ్రభాషా శాసనములయందు సంస్తుతుల యందు విభక్తులు వెలయు చుండుటచే, స్తుతిపరమగు నుదాహరణముల ప్రాచీనతకు నీవిషయము తోడ్పడు చున్నది.

## ఉదాహరణముల ప్రాముఖ్యము

ఆంధ్ర వాఙ్మయమునఁ బురాణేతిహాసకావ్య నాటకాదుల యందలి లక్షణము లన్నియు నంతర్భూతములై యుండుటచే నుదాహరణములా యా గ్రంథములవలనఁ గల్గుప్రయోజనములన్నిటి నొసంగి యానందముఁ జేకూర్చుచున్నవి. భక్తిరస ప్రధానములగు మతములకు, ముఖ్యాంగమగు గానకళకు సంబంధించిన యుదాహరణములు పండ్రెండవ శతాబ్దికిముందే వెలయుచున్నట్లు శైవవాఙ్మయమువలనఁ దెలియుచున్నది.

---

## ఉదాహరణములు సాహిత్యసమీక్ష

తెలుఁగుకవిత, ఆశు, మధుర చిత్రవిస్తర కవిత్వములని నాలుగు విధములు. వీనికే 'చతుర్విధ కవిత' లని పేరు. ఈ కవితా విభాగములు నన్నయ కాలమునుండి (క్రీ.శ. 1050.) తెలుఁగున వెలయుచున్నవి. నన్నయ భారతావతారికలో, "మృదుమధుర చిత్రవిస్తర నవరస భావభాసుర కవితా రచనా విశారదులైన మహాకవులు"న్నట్లు (ఆదిపర్వము 1-8) చెప్పియున్నాఁడు. దీనినే శ్రీ నాథమహాకవి నైషధములో[1] (1-11) "మృదు మధుర చిత్ర విస్తర కవితా విలాస వాగీశ్వరులగు కవీశ్వరులును," అని యనువదించినాడు. నన్నయ శ్రీనాథు లిరువురును నాశువునకు 'మృదువు' అనుపేరును వాడియున్నారు. తక్కినవారు పైరీతినే ఆశు మధుర చిత్రవిస్తరము లని పేర్కొనిరి. అప్పకవి (క్రీ.శ. 1656) నాఁటినుండి యీ సంప్రదాయము మఱుఁగుపడి ఆశు, బంధ, గర్భ, చిత్ర కవిత్వమను మతభేద మేర్పడినది. అయినను చాలమంది కవులును లాక్షణికులును ప్రాచీన సంప్రదాయమునే పాటించిరి.

1. నైషధము సర్వంకషవ్యాఖ్యానమున నీ విషయము తెలుపఁబడలేదు.

అష్టభాషల మధురాశు విస్తర చిత్ర
కవితలు చెప్పు సత్కవులు మెచ్చ (6-13)

—వెన్నెలకంటి అన్నయ్య - షోడశకుమార చరిత్ర 14 వ శతాబ్ది.

ఆశు మధుర చిత్రవిస్తార కవిత్వతత్త్వ కోవిదత్వప్రసక్తి

—పరమయోగివిలాసము - పుట 206 క్రీ. శ. 1540.

ఆశు మధుర చిత్ర విస్తారములు. (1-11)

—పింగళి సూరన - కళాపూర్ణోదయము క్రీ. శ. 1560.

ఆశువు, మధురము, చిత్రము, విస్తరము నా చతుర్విధకవితలు

—గణపవరపు వేంకటకవి క్రీ. శ. 1676.

చిత్ర విస్తర మధురాశులీల కవితల్ రచియింపఁగ నేర్చె (2-54)

—శేషము వేంకటకవి-తారాశశాంకవిజయము క్రీ. శ. 1720.

తెలుఁగు లాక్షణికులలో వార్తాకవి రాఘవయ్యయను కవి లక్షణ దీపిక'[1] అను గ్రంథములో నీ కవితాస్వరూపములను చక్కగా వివరించినాఁడు. ఈతఁడు క్రీ. శ. 1600 ప్రాంతమువాఁడు కాదగును.

"ఆశు మధుర చిత్ర విస్తార కవిత్వంబుల నివి విలసిల్లె, అందు

ఆశుకవిత్వం బన్నది

ఏకపాద త్రిపాద కఠినప్రాస విషమసమస్యాపూర్తులు వ్యస్తాక్షరీసంఘటిత పద్యంబులును, ఇష్టార్థదేవతా వరప్రతిపాది నిషేధాక్షర రచనాచమత్కృతియు, అష్టావధానంబులు, ఘటికాశతగ్రంథకల్పనయు, ఆకాశపురాణంబులని తత్కాలోచితాతిత్వరితగతిని రచియింపఁబడునది యాశుకవిత్వంబును,

మధురకవిత్వం బన్నది

నాటకాలంకారంబులు, కళికోత్కళికలు, విభక్త్యధిదేవతోదాహరణములు, సప్తతాళనటనలు, నట్టొట్లు, గీతప్రబంధములు, చతుర్భద్రిక అష్ట

1. లక్షణదీపిక (అముద్రితము) మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకశాలలో గలదు. వ్రాతప్రతి-సంఖ్య డి. 1929. ఈ గ్రంథమును క్రీ. శ. 1740 ప్రాంతముల విలసిల్లిన కస్తూరిరంగకవి ఆనంద రంగరాట్ఛందస్సు అను గ్రంథమున నుదాహరించి యున్నాఁడు. గ్రంథమున నుదాహృతులైన కవులను బట్టి కాలనిర్ణయము చేయఁబడినది.

ఛ్ద్రికలు బిరుదావళి నామావళి భోగావళి రంగఘోష జయఘోష చతురుత్తర సంఘటనలు యక్షగానంబున వెలయు పదంబులు దరువులు లీలలు ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, ఉయ్యాలజోలలు, జక్కుల రేకుపదంబులు, చందమామ సుద్దులు, అష్టకంబులు, ఏకపద, ద్విపద, త్రిపద చతుష్పదషట్పదాష్టపదులు, నివియాదిగా నన్నియు లయ ప్రమాణంబుల నొప్పి, మృదుమధుర వచనరచనలఁ బ్రసిద్ధంబైనయవి మధుర కవిత్వంబులు.

## చిత్రకవిత్వం బన్నది

పాదగోపనంబును, పద్యభ్రమకంబును, పాదభ్రమకంబును, నామ గోపనంబును. అనులోమ విలోమ గతి పద్యంబులు కందగీత గర్భిత వృత్తంబును, కందద్వయ గర్భితమణిగణ నికరంబును, క్రౌంచపదగర్భిత కందద్వయంబును, ద్విపద, చౌపద లాలి సువ్వాల మంగళహారతి ధవళంబులు శోభనార్ధ చంద్రికాది పద దర్వులాది లయ గర్భితసీసంబును, కంక పటహ మండూక తురంగ నట భేరీనినాద నాలుక రంపవృత్తంబులును, ఓష్ఠ్య నిరోష్ఠ్య, సంకర జిహ్వా అచలజిహ్వా వృత్తంబులును, రగడ భేదంబులును, తాళగతులును దండక వృత్తంబులును, అష్టదళ, షోడశదళ, ద్వాత్రింశద్దళ పద్మబంధంబులును నవావరణ ద్వాదశావరణ చక్రబంధంబులును రథ, నాగ, ద్వినాగ, తులాలచక్ర, ఆందోళికా చ్ఛత్రబంధంబులును గోమూత్రికా, పుష్పమాలికా, పుష్పగుచ్ఛ మృదంగ డమరు ఖడ్గ త్రిశూల, కంకణ సర్వతోభద్ర, కవికల్పిత కల్పవల్లరి నివి యాదిగాగల్గు బహువిధ చమత్కారంబుల చిత్రంబులు రచియించుటంజేసిన నిది చిత్రకవిత్వము.

## విస్తరకవిత్వం బన్నది

ఇష్టదేవతా ప్రార్థనయు, కృతికర్తవంశావళియు, పుర, గిరి, మృగయా యాత్రవనజలనిధి వర్ణన, ద్యూతవినోద, రాయబార, వివాహోత్సవ సురత క్రీడ పుత్రోత్సవ, సూర్యోదయ సూర్యాస్తమయ, చంద్రోదయ చంద్రో

పాలంభన విరహవర్ణనలు, షడృతువుల వర్ణనలు, జలక్రీడలు, మధుపాన దండయాత్ర రణక్రీడ దిగ్విజయంబులు నివియాదిగా గలుగు నష్టాదశవర్ణ నలు అలంకారములు, రీతులు, శయ్యలు, వృత్తులు, పాకంబు లుత్ప్రేక్షల శ్లేషోల్లేఖలు, ధ్వనులు, వ్యంగ్యంబులు నివియాదిగాగలుగు కావ్యలక్షణంబుల గలిగి పంచలక్షణ దశలక్షణంబుల నొప్పి, కథాసరణి వర్తిల్లుటంజేసి యది విస్తర కవిత్వంబన్నది మహాప్రబంధంబు.

ఇట్టి కవిత్వంబు కావ్యలక్షణంబునం జెప్పిన వాక్యపదదోషంబుల, చతుర్వింశతి దోషంబులు పరిహరింపవలయు. దోషంబులు వర్జించి, కవి సమయ సిద్ధప్రయోగంబు లరసి, అభినవకావ్యంబు ప్రక్రమించునతడు భారత భాగవత రామాణానేక పురాణ ప్రసిద్ధంబులైన యితిహాసంబునం గల కథ విస్తరించుట యిహపరసాధనంబని మహాకవిశ్రేష్ఠుల కభిమతమది కవిత్వరచన సన్మార్గంబు...(ప్రథమాశ్వాసము)".

ఇక నీవిభాగమెందుండి గ్రహింపఁబడినదో తెలిసికొనుట యావశ్య కము. సంస్కృతమున నీ విభాగములేకుండుటచే తెలుఁగువారం దుండి గ్రహింపలేదనుట నిర్వివాదాంశము. కావున నిది సుసంస్కృతమైన దేశి పద్ధతిపైననే భాగింపఁబడి యున్న ట్లూహింపనగును. కన్నడభాషలో నిట్టి విభాగము లేదు-తమిళమున క్రీ. శ. 12 వ శతాబ్దమునుండి ప్రసిద్ధిగాంచిన "పాట్టియల్"అను గ్రంథములో "ఆశు, మధుర, చిత్ర, విస్తర" అని యీ విభాగము తెలుపఁ బడియున్నది. మఱియు నంతకుఁ బూర్వము, అనగా దశమ శతాబ్దికి పూర్వమే విలసిల్లిన యాళ్వారులలో నొకనికి మధురకవినామ ముండుటచేతను నిది ద్రవిడ లేక తమిళ సాహిత్యమున చిరకాలమునుండి సంప్రదాయసిద్ధముగానున్నది. కన్నడమున 'భిక్షాటన' కావ్యములో క్రీ. శ. (1550 లో) నొక కవి వీనిని పేర్కొనినాఁడు. తెలుఁగున 10 వ శతాబ్దికి ప్రచారములోనుండుటచేతను, నంతకుముందు తమిళమున ప్రచారమునుండుట చేతను, నీ విభాగము, కేవలము తమిళమునుండి, తెలుఁగువారు గ్రహించి

రనుట కాధారములు లేక పోవుటచే నిది, దాక్షిణాత్య సాహిత్యమునకుఁ బూర్తిగ సంబంధించినదనియు, నిది దేశికవితలలోనే తొలుత వర్ధిల్లినదనియు చెప్పనగును.

పైని యుదాహరించిన భాగము ననుసరించి, ఉదాహరణములు మధుర కవితాశాఖకుఁ జెందిన వనుట స్పష్టము గదా!

మార్గదేశి భేదములచే రెండు విధములుగా నేర్పడిన సంప్రదాయము నుదాహరణములు పై విభజనమునుబట్టి దేశిసంప్రదాయమునకు సంబంధించి నవిగా నెన్ననగును. మధుర కవితలోఁ జెప్పఁబడిన యక్షగానములకు నీ యుదాహరణములే మూలమని చెప్పనొప్పును. ఉదాహరణములలో నియతముగాఁ బ్రయుక్తములగు రగడలు యక్షగానమున కొలది మార్పులతో నుపయుక్తములగును. అప్పకవి యీ విధానము నిట్లు తెలిపినాఁడు.

## యక్షగాన లక్షణము

సీ॥ తుదనేడు లఘువులు తొలఁగించి చదివిన
త్రిపుటకు వృషభ గతి పదయుగము
లలిగడపల నొక్కలఘువు మానిన జంపె
మను ద్విపదగతిసమ పదయుగము
గురుతగు రచ్చ రేకుఁ దురగ వల్గనా
హ్వాయ మేకతాళి యా మధురగతికి
నంఘ్రి కిర్వదినాలుగట తాళమున మాత్ర
లోలి విశ్రాంతి పద్నాలుగింటఁ

గీ॥ దెలియనర్థంబు నర్ధ చంద్రికలు వీన
యక్షగాన ప్రబంధంబు లతుకవచ్చు
రగడ భేదంబు లివి యంఘ్రులు రసఁగవీంద్రు
లవిత నిజసేవకస్తోమ! యబ్ధిధామ! (4—ఆ—490)

పైని రగడలు తాళమున కెట్లు సరిపోవునో 'ఛందస్సు—రగడలు' అను శీర్షిక క్రిందఁ జూడనగును.

---

## వ్యాకరణము - విభక్తిప్రత్యయములు

ప్రథమాది సప్తవిధవిభక్తుల నుదాహరించుచు నియతములగు నక్షర గణములతో కూడిన యొక వృత్తమును, లేక పద్యమును ననియతములగు మాత్రగణములతో కూడిన యొక పదభేదమును గూర్చి చెప్పఁబడినవి కావు ననే వీనికి యుదాహరణములని పేరు వచ్చినది. ఈ యుదాహరణస్వరూపము మనకుపలబ్ధములైన కావ్యవాఙ్మయమునకంతకు మూలమని నేఁటికి మనకుప లబ్ధములైన కావ్యములలోని లక్షణములు తెలుపుచున్నవి. కావున తెలుఁగున సాహితీపరిణామమును దెలిసికొనుటకు నీ యుదాహరణగ్రంథము లత్యంతోపయుక్తములు.

విభక్తులు కేవలము వ్యాకరణశాస్త్రమునకు సంబంధించినవేయైనను, విభక్తిప్రత్యయముల పరస్పరసంబంధ మాశాస్త్రము వలననే తెలియదగినదే యైనను, తెలుఁగున మాత్రము వ్యాకరణశాస్త్రమునకు సాహిత్యమునకు నవినా భావసంబంధముగలుగఁజేసినవి యుదాహరణములు. తెలుఁగు భాషలోని కావ్యరచనాప్రణాళికను గమనించిన మన కీ విషయము స్పష్టముకాఁగలదు. తెలుఁగుకృతులలో ప్రాచీనమున ప్రాయికముగా గద్యపద్యమిశ్రితములగు చంపువులు వెలసినవి. సాహితీపథకమున నుత్తమ శ్రేణికిఁ జేరఁదగిన గ్రంథము లన్నియు నీ చంపూపద్ధతినే రచితమగుటచేత, సారస్వతమున విలసిల్లిన శతక యక్షగాన ద్విప దోదాహరణాది రూపముల రచితములైన గ్రంథములను లక్ష్యలక్షణవివేచనము గావించినపుడు లాక్షిణికు లంతగా పాటింపరైరి. కావున కావ్యరచనాపద్ధతినుండియే యుదాహరణములెట్లు విభక్తి ప్రత్యయ విషయమున విశిష్టతఁజూపినవియు వివరించెదను.

ఉదాహరణములు సాధారణముగ దైవపరములుగను క్వాచిత్కముగ మానవపరముగను నుండును. కావ్యములును నంతియే. తెలుఁగున, సాధారణముగ, దైవమునకుఁగాని, రాజునకుఁగాని, గురువునకుఁగాని యంకితము గాని కృతి యుండనేరదు. కావున యంకితమున కంగములుగ తెనుఁగు కావ్యములలో కృత్యవతరణికయం దీక్రింది లక్షణములు గలవు.

1 ఇష్టదైవస్తుతి. 2 కవితాప్రశంస. 3 సుకవిస్తుతి. 4 కుకవినింద. 5 కృతిపతికీర్తనము. 6 కవిస్వవిషయము. 7 కృతిపతివర్ణన. 8 కవివంశవర్ణన. 9 షష్ఠ్యంతములు, 10 కథాభాగమంతయునాశ్వాసములుగా విభాగింపఁబడి ప్రతియాశ్వాసము చివర కృతిపతిప్రస్తావన (సంబోధన) లేక విభక్తి భేదము. 11 కవిగద్య స్వవిషయము. 12 ప్రథమాశ్వాసముగాక, తక్కిన యాశ్వాసప్రారంభములలో నొక సంబోధనము.

పై కృత్యవతరణికలోను, ఆశ్వాసాద్యంతములలోను, ఇష్టదేవతాస్తుతి, షష్ఠ్యంతములు, కృతిపతివర్ణన, ఆశ్వాసాంత పద్యరచనయన నవి వ్యాకరణమునకును నందు ముఖ్యముగ విభక్తులకు సంబంధించినవి. ఏలయనఁగా మన తెలుఁగుకృతులలో నంకితములు రెండువిధములు. 1 సంబోధనాంతములు 2 విభక్త్యంతములు. వీనిలో విభక్త్యంతములు చాల తక్కువ. ప్రాయికముగ సంబోధనాంతములే యెక్కువ. కాని విభక్త్యంతములు మనప్రాచీన సంప్రదాయమును తెలిసికొనుటకు నుపయుక్తమగును. మన కుపలబ్ధములైన ప్రాచీనములైన తెలుఁగుకృతులలో నన్నయరచితమహాభారతము మొదటిది. దాని తరువాతి కొలఁది కాలముననే వెలసిన నన్నెచోడకవి కుమారసంభవము రెండవది. తరువాత నెన్నియో కావ్యములు వెలసినవి. వీనిలోఁ గొన్ని విశేషలక్షణములు కన్పట్టుచున్నవి. 1 కావ్యము 'శ్రీ'తో ప్రారంభమగుట. 2 కావ్యాదియందు సంస్కృతశ్లోకము. 3 కావ్యాంతమున మంగళమహాశ్రీ వృత్తము.

కావ్యములలోని పైలక్షణములు కొన్ని యుదాహరణములలో వెలసియున్నను, ఉదాహరణములలోని కొన్ని లక్షణములు కావ్యములకు ముందుగా

వెలసిన పద్యమయశాసనములయందు వెలయుటచే నుదాహరణముల వెనుకనే కావ్యములలో నీలక్షణములు పాటింపఁబడెనని నిరూపింపవచ్చును.

కృతినిచ్చిన యభీష్టదైవత వాచక పదమునకో, మహాపురుష వాచక పదమునకో, విశేషములు చేర్చినపుడు, విశేష్యమునకున్న విభక్తియే, విశేషణములకుఁ జేర్చుట తెలుఁగు భాషాసంప్రదాయము. ఈ సంప్రదాయము సంస్కృతము ననుసరించినదియే. సంస్కృతమున విశేష్యమునకు, విశేషణమునకును తత్సమానవిభక్తి ప్రత్యయము చేర్చుట సంప్రదాయము. కాఁబట్టియే యాశ్వాసాద్యంతములలో సంబోధనలున్న సంబోధనలును, విభక్త్యంతములుగానున్న విభక్త్యంతములతోడను రెండు పద్ధతు లేర్పడినవి. మరియు, కృతిపతికిని, కథానాయకునికి యభేదవ్యవసాయము చేసినప్పు డీపద్ధతి తప్పక పాటింపఁబడవలెను. అట్లుకానిచో కథావస్తువునందలి ఘట్టములకుఁ బరస్పరాన్వయముకుదురదు. పైవిషయమును స్పష్టపఱచుటకు నన్నయ నన్నెచోడ మహాకవుల కావ్యములనుండి లక్ష్యములను చూపుచున్నాఁడను.

నన్నయ తొలుత సంస్కృతశ్లోకముతో నారంభించి, శ్రవ్యకావ్యమునకు దృశ్యకావ్యమువలె మంగళాశాసనము గావించినాఁడు. ఆవెనుక "రాజకులైకభూషణుఁడు......సర్వలోకాశ్రయుఁ డాదిరాజనిభుఁడు......విష్ణువర్ధనుండు" అని ప్రథమా విభక్తి విశేషణములతో ప్రారంభించి, "అయినను దేవా ! నీ యనుమతంబున......నా నేర్చు విధంబున నిక్కావ్యము రచియించెద"నని భారతము ప్రారంభించినాఁడు.

కావ్యకథా ప్రారంభమున సంబోధనకలదు కావున ప్రథమాశ్వాసము సంబోధనలతో ముగించినాఁడు.

ఉ॥ రాజకులాగ్రగణ్య ! మృగరాజపరాక్రమ ! రాజరాజ ! వి
భ్రాజితశుభ్రకీర్తి పరిపాండురసర్వదిగంతరాళ ! ఘో
రాజిముఖోపలబ్ధ విజయప్రమదాశ్రిత బాహుదండ ! ని
స్తేజితవైరివీర ! కులదీప ! మృడప్రియ ! విష్ణువర్ధనా !

క॥ ఆదిక్షత్త్రచరిత్ర ! ధ
రాదేవాశీః పరంపరావర్ధిత ని
త్యోదయ ! సత్యోదిత ! విమ
లాదిత్యతనూజ ! విక్రమాదిత్యనిభా !

తోటకము—నిరవద్యనరేశ్వర నిత్యనిరం
తరధర్మమతీ ! గుణధామ ! జగ
త్పరిపూరిత కీర్తివిభాసి ! విభా
కరతేజ ! నృపోత్తమ ! కాంతినిధీ !

ద్వితీయాశ్వాసము
శ్రీవనితావల్లభ ! వేఁ
గీవిషయాధీశ ! కావ్యగీతిప్రియ ! నా
నావనినాథకిరీటత
టీవిలసద్రత్న సంఘటిత పదకమలా !

అని సంబోధనతో ప్రారంభించినాఁడు. ఇట్లే నన్నయరచిత భాగమందంతటను గలదు.

భారతావతరణికలో, రాజరాజు, తనకు పాండవోత్తముల చరిత్ర వినవలయు నను కుతూహలముగావున తెనుఁగున రచియింపుమని యానతిచ్చినాఁడు. ఇచ్చట 'నాకు వినవలయునని' రాజరాజు చెప్పియున్నాఁడేకాని, తరువాతి రాజులవలె, నాకుఁ గృతినొసంగుమని యనఁగా నంకితము సేయుమని కోరకుండుటచే, నిచట తరువాతి తెలుఁగు కావ్యములలోనున్న షష్ఠ్యంతము లుండవలసిన యవకాశములేదు*. ఇచ్చట నన్నయ 'లోకజ్ఞత' యెంత యుఁ బ్రస్ఫుటమగుచున్నది. 'నాకు విన నభీష్టము' అని రాజరాజుచేఁ బలికించినను, నచ్చట 'నాయొక్కనికే' అను నహంభావద్యోతకమగు నభిప్రాయ

* షష్ఠ్యంతములు కేవల వ్యక్తిపరములు.

మెంత మాత్రమును లేక, 'నాయొక్క ప్రజల కందఱకును' ననఁగా తెనుఁగు వారందఱకును, ననుమహోదారాశయము రాజరాజునందు వ్యక్తమగునట్లుగా నన్నయ రచించియున్నాఁడు. ఇచ్చట సభలో రాజరాజుకూడ నొక శ్రోతయే. ముఖ్యశ్రోతకాని నిశ్చయముగా కృతిపతికాఁడు. శ్రోతయే ప్రధాన పురుషుఁడు కాఁబట్టి, కావ్యముతోపాటు కవి యొక్కయు, కథాశ్రోత యొక్కయు కీర్తులు శాశ్వతముగ నుండును గావునను, శ్రోతయొక్క వ్యక్తివిశేషమును వర్ణించుట సమంజసమేకాక యావశ్యకముగూడ నగుచున్నది. నన్నయ కావ్యమునందలి యీలక్షణమే శివకవులయందు పాల్కురికి సోమనాథుఁడు తన ద్విపదకావ్య ములయందు పాటించి వానికి చంపూకావ్యపద్ధతినుండు భారతాదులతో సమాన ప్రతిపత్తి గడించినాఁడు. నన్నయ రాజరాజు కుల, వీర్య, శౌర్య, గుణాదికము వర్ణించినట్లు, పాల్కురికి సోమనాథుఁడు తనకావ్యములకు శ్రోతలగు గొబ్బూరి సంగనామాత్యుని, గోడగి త్రిపురారిని, పాల్కురికి సూరనా మాత్యుని వారివ్యక్తివిశేషాదులను వర్ణించినాఁడు. కాఁబట్టి నన్నయ రాజరాజు నకు, తరువాతి వాఁడనుకొనినట్లు, తనకృతి నాతని కంకితము చేయలేదనియు, 'నీకు భారతముఁ జెప్పెదనని' షష్ఠీవిభక్తిలోఁజెప్పక, "దేవా! నీ యను గ్రహంబున" నని సంబోధనతోఁ జెప్పుటచేత, శ్రోతగానే యెన్నుకొనె ననియు స్పష్టమగుచున్నది. 'నీకు' అని చెప్పినప్పుడది కేవలము వ్యక్తిపర మగుచున్నది. 'నీ యనుగ్రహమున తెలుఁగులో రచియించెద' నని చెప్పి నపుడు, తెనుఁగు భాషను మాటలాడు ప్రజలందఱి కొఱకును రచియించితి ననియు, నీవు రాజువుగావున, దైవస్వరూపుఁడవుగావున, నీవు దీనిని విని ప్రజానీకములో వ్యాప్తినొందింపు మనియు నన్నయభట్టారకుని యభిప్రాయ మైనట్లు స్పష్టము. కావున నేఁడు కొందఱు, తెలుఁగు కావ్యములన్నియు, రాజాంకితములనియు, కేవలవ్యక్తిపరములనియు, ప్రజాసామాన్యముకొఱ కుద్దేశించి వ్రాయఁబడినవి కావనియు, రాజుల యుత్కర్షకొఱకే కవులు వ్రాసి రనియు తలంచి, విమర్శించుట యెంతమాత్రమును సరికాదని యెన్నవగును. కాఁబట్టి నన్నయ భారతమున షష్ఠ్యంతములుండ నవకాశములేదని సారాంశము.

ఇఁక నన్నిచోడుని కుమారసంభవకావ్యము నందలి యాశ్వాసాంత విషయములను జూడుఁడు. కుమారసంభవము నన్నిచోడుని గురువగు జంగమ మల్లికార్జునున కంకితము. ఇచ్చట కవి, కృతిపతియగు జంగమ మల్లికార్జునునకు, శ్రీశైలమల్లికార్జునకు ననగా శివునకు నభేదవ్యవసాయము చేసినాఁడు. నన్నిచోడమహాకవి, యిష్టదేవతాస్తుతినొనరించి, యావెనుక గురుప్రశంస కావించి, "సద్గురుండైన జంగమ మల్లికార్జున దేవునకున్, క. శ్రీకంఠ మూర్తి కమలశ్లోకునకు...మల్లికార్జునమునికిన్. పరమభక్తి యుక్తినావర్జితహృదయుండనై ...... నాచెప్పంబూనిన దివ్యకథాసూత్రం బెట్టిదనిన" అని షష్ఠ్యంతముగాఁ బేర్కొనుటచేత షష్ఠ్యంతములు చెప్పినాఁడు. ఇచట షష్ఠ్యంతములు వేఱుగా నేలచెప్పవలయుననిన, నన్నిచోడునికావ్యమున షష్ఠ్యంతములతో నుండు విశేషణములు లేక నామావళులు, నన్నిచోడుని కాలమున పద్యమయశాసనములలో గూడ కానవచ్చుటచేత, నాతఁడాసంప్రదాయమును నొక ప్రత్యేకవిషయముగ తనకావ్యమున నెలకొల్పెనని యూహింపఁదగును. ఈ నామావళిసంప్రదాయము ననుసరించి నన్నెచోడుఁడు షష్ఠ్యంతములు వ్రాయుట యావశ్యకమే యగుచున్నది.

పద్యమయశాసనములలో నీవిభక్తి ప్రత్యయములు పాటింపఁబడినట్లుగా ననేక యుదాహరణము లీయవచ్చును. ఒక్కొక్క విభక్తితో తాను స్తుతించు మహాపురుషుని గుణములను,విశేషణములుగఁజెప్పు వానినే నామావళు లందురు.

*ప్రథమావిభక్తికి:—* క్రీ. శ. 1108 కొమ్మసాని శాసనము.

ఉ॥ శ్రీరమణీయుఁ డర్థిజనసేవ్యుఁడు భవ్యుఁడు దివ్యమూర్తి శౌ
ర్యారభటీధుతాతినిశితాసి విదారిత శత్రువర్గుఁ డా
ధారిత బంధు మిత్ర జనతామణి గొంకనరేంద్రు మంత్రిప్రో
త్సారిత లోభమోహావృతసత్త్వుఁడు ప్రోలఁడు ధన్యుఁ డున్నతిన్.

క॥ శ్రీరాజప్రోలిశాసనుఁ
డారాధిత నీలకంఠుఁ డభినవమదనా

కొరుఁడు ప్రోలఁడు విబుధా
ధారుండన పొన్నరాంబతనయుఁడు నెగడన్.

ద్వితీయావిభక్తికి:—క్రీ. శ. 1132. మారపండని శాసనము

సీ॥ లాటవిలాసినీ లాలాట తిలకునిఁ
గేరల కరలగ్న కేళిపద్మఁ
గర్ణాట సుందరీ కర్ణావతంసుని
కుంతలీ కుంతల కుసుమదాము
గౌడ సతీనేత్ర కాలాంజనుని నంగ
భామా కపోలా ప్తపత్రరచను
నేపాల కామినీ నీరంధ్రకుచహారు
నంధ్రీ తనూకుంకుమాంగరాగు
రమణతో నాదిదానుల రాశికెక్కి
దీనజనముల యడలెల్ల దీర్చుచున్న
అనఘు చారిత్రు మారపండనిన తగిలి
పొగడవిందుము నెల్ల భూభుజుల సభల.

తృతీయావిభక్తికి:—క్రీ. శ. 1161, శరణయ తిమ్మాపుర శాసనము.

శ్లో॥ శ్రీజయలక్ష్మి...పరమండలి కాన్వయాబ్జరే...హిమధామః
వైభవజితమహేంద్రో జయతి కులోత్తుంగ చోడగొంకనరేంద్రః॥

ఇట్టి గొంకరాజుల కిష్ట భృత్యుండైన సరణయనామావళి యిట్టిదె.

ఉ॥ శ్రీవిలసద్విలాస జితజిష్ణునిచే నహి (హరి?) సీమకృష్ణుచే
దేవసమానుచేత నరదేవశిఖామణిచేత ధాన్యవా
టీవరవృత్తిశాసన పటీయసినాంటగి మేలునాయక
శ్రీవిభుఁడొప్పె బోతయవశీకృతసజ్జనలోకుఁడై భువిన్.

వెల్లకి గంగాధర మంత్రి కరీంనగర శాసనము.

—తెలింగానాశాసనములు.

స్ర॥ శ్రీకాంతాకాంతుచే నాశ్రితవిబుధజనాశీః స్థిరప్రాజ్యరాజ్య
శ్రీకాంతాకాంతుచే విస్తృతనిజభుజ నిస్త్రింశనీతాన్యరాజ
శ్రీకాంతాకాంతుచే దిక్షితి గగన సమాశ్లిష్ట విస్పష్టకీర్తి
శ్రీకాంతాకాంతుచే నూర్జితరిపుమృగరాజీమృగారాతిచేతన్.

చ॥ పరనరపాలమౌళిమణి భాస్వరదీప్తిలతానితాంతవి
స్ఫురితపదాబ్జుచే, నహితభూతలనాథవరూధినీసరో
వరమథనప్రభూతమదపద్విరదాధిపుచే, విరోధిభూ
ధరశిరప్రభిన్నవిదితత్రిదశేంద్ర నిశాతహేతిచేన్.

క॥ సురకరిపతి, మృగపతి, హరి
సురసతిధవళసరసిరుహ–శుక్తిరుహసదృక్
సురుచిరవిశద యశోభా
సురనిధిచే సుకవితరణి సురనిధిచేతన్.

క॥ శరనిధిపరీతధాత్రీ
పరిపాలితదక్షిణప్రభాసితభుజవి
స్తరుచేత నన్మకొండా
పురనాథుండైన రుద్రభూపతిచేతన్.

చ॥ వెలయ నమాత్యసంపదలు......దగువృత్తులంబడసి.

*పంచమీవిభక్తికి:*—క్రీ. శ. 1132. భీమరాజు శాసనము

ఉ॥ అందు గిరీశుకంటె సుభటాగ్రణి, యర్కజుకంటె దాని శ్రీ
నందనుకంటె రూపి, సురనాథునికంటె విలాసుఁ డాపగా
నందనుకంటె శౌచి, నలినప్రియుకంటె ప్రతాపి, దండభృ
న్నందనుకంటె సూనృతుఁడనందగు భంగి ధరాతలంబునన్.

*సంబోధన:*—క్రీ. శ. 1161. శరణయశాసనము.

వసంతతిలకము —శ్రీరామ రామ నృపశేఖర విష్ణుమూర్తీ !
వీరాగ్రగణ్య భుజవిక్రమ పార్థివేంద్రా !
మారారి యంఘ్రియుగమానసరాజహంసా !
కారుణ్యదాన సహకార మహీజరాజా !

తెలుఁగు కావ్యములలో నీ విభక్తులు పద్యరచనయం దుపయోగించి ప్రాచీనులైన తెలుఁగుకవులు నొక విశిష్టమగు సంప్రదాయముగా పాటించిరి. పద్యము మొదలుగా నొక విభక్తితో ప్రారంభించి దానితో పద్యమును చివరవఱకు నడిపించిన, నది శ్రుతిమనోహరమై, సహజముగా చెవుల కింపగు తెలుఁగు భాషాకవిత్వమున కొక వన్నె తెచ్చుచున్నది. దీనికెన్నియేని యుదాహరణములు చూపఁదగును. సాధారణముగా చంపూకావ్యములన్నియు సంబోధనాంతములు. ద్విపదలలోఁ గొన్నింటి యందును యక్షగానములలోను ద్వితీయాంతములు. శతకములు- సంబోధనాంతములు. చంపూకావ్యములలో సంబోధనాంతములుకాక విభక్త్యంతములుగా నుండుట తెలుఁగు భాషలో నీక్రింది కావ్యములలో గలదు:—

1. నన్నెచోడుని-కుమారసంభవము,
2. భాస్కరుని-అరణ్యకాండము.
(భాస్కర రామాయణమున)[1]
3. కేతన-దశకుమారచరిత్ర
4. తిక్కన-నిర్వచనోత్తర రామాయణము
5. మంచన-కేయూరబాహుచరిత్ర
6. కొరవి గోపరాజు-సింహాసనద్వాత్రింశిక
7. విన్నకోటపెద్దన- కావ్యాలంకార చూడామణి

1. ఆంధ్రపత్రిక-విక్రమసంవత్సరాదిసంచికలో 'భాస్కర రామాయణ నమస్య' అను వ్యాసమున డాక్టరు శ్రీనేలటూరి వేంకటరమణయ్యగారు, "ఆంధ్ర గ్రంథములలో విభక్త్యంతముల నాశ్వాసాద్యంతంబులఁ బ్రయోగించినకవులు ముగ్గురు, నన్నెచోడుఁడు-తిక్కన-కేతన" అని వ్రాసియున్నారు. పుటలు (57-69).

8. పింగళిసూరన:— ప్రభావతీ ప్రద్యుమ్నము-ప్రథమ ద్వితీయా విభక్తు లుపయుక్తములైనవి.

9. అనంతుడు-రసాభరణమున నాశ్వాసాద్యంతములు విభక్తులతో ప్రయుక్తములైనవి.

10. పరవస్తు చిన్నయసూరి-శబ్దలక్షణ సంగ్రహము[1]

ఈ సంప్రదాయము నవీనుఁడగు చిన్నయసూరి పాటించినను, పదునాల్గవ శతాబ్దము తరువాత పాటింపఁబడలేదని పై పట్టికయే తెలుపఁగలదు.

ఏదేని యొక్కొక విభక్తితో పద్యము ప్రారంభించిన నా పద్యము కడవఱకు నావిభక్తి ప్రత్యయముతోడనే పూర్తిచేయుట యను పద్ధతి శాసనములయందు ముందు మనము చూచియున్నారము. ఈ పద్ధతియే క్రమముగా కావ్యములలో నొక విశిష్టసంప్రదాయముగా పరిణమించి, నిసర్గమనోహరమగు తెలుఁగు భాషారీతికి నిరుపమాన శ్రుతిసౌఖ్యము నొడగూర్చినది.

ఇఁక మనకావ్యములనుండి యుదాహరణములఁ జూపెదను.

ప్రథమావిభక్తి[2]:— నన్నయ భారతము-తొలి తెలుఁగు పద్యము-

ఉ॥ రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే
జోజయశాలి, శౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజితసర్వలోకుఁ డపరాజిత భూరి భుజాకృపాణధా
రాజలశాంతశాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్.

ద్వితీయావిభక్తి:—పోతన భాగవతము సప్తమస్కంధము ప్రహ్లాదచరిత్ర-

---

1. ముద్రణము. 1853

2. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు, కృపారసంబు పై
జల్లెడువాఁడు మౌళిపరిసర్పితపింఛమువాఁడు నవ్వురా
జిల్లెడు మోమువాఁడొకఁడు...... —భాగవతము_దశమస్కంధము.

చ॥ వెఱచినవాని, దైన్యమున వేదుఱు నొందినవాని, నిద్రమై
మఱచినవాని, సౌఖ్యమున మద్యముద్రావినవాని, మగ్నుఁడై
పఱచినవాని, సాధుజనభావము వానినిఁ గావు మంచు వా
చఱచినవానిఁ గామినుల జంపుట ధర్మము గాదు ఫల్గునా!

తృతీయావిభక్తి:—శ్రీనాథుఁడు-శృంగారనైషధము—

చే ప్రత్యయము

ఉ॥ హాటకగర్భుచేత కమలాసనుచే
చతురాస్యకంఠశృం
గాటకవీథికాకృతి విగాహ
చతుశ్ర్శుతిచేత. దేవతా
కోటికిరీట సంఘటిత
కోమలపాదసరోజుచే జగ
న్నాటకసూత్రుచేత కృతి
నాథుఁడు గాంచు చిరాయురున్నతుల్.

తో[1] ప్రత్యయము

మ. భటసంఘంబులతో, రథావళులతో,
భద్రేభయూథంబుతో
పటువేగాన్విత ఘోటక వ్రజముతో
బంధు ప్రియశ్రేణితో
గటుసరంభముతో విదర్భతనయన్
గైకొందు నంచున్ విశం
కటవృత్తిన్ జనుదెంచె చైద్యుఁడు
గడున్ గర్వించి యవ్వీటికిన్.

—పోతన భాగవతము - దశమస్కంధము - రుక్మిణీ కల్యాణము,

చతుర్థీ విభక్తి:—కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన్న.

చ॥ విరహిత వైరికై, భువన విశ్రుత సద్గుణ రత్నహారికై
నిరుపమకీర్తికై యువతి నిర్మథనక్షమచారుమూర్తికై

1. చూ. పారిజాతాపహరణము - 5-45.

విరచితవృద్ధికై సమర వీర విరాజిత జైత్రసిద్ధికై
పరిచితశక్తికై గిరిశపాదపయోజనిషక్త భక్తికై.

క॥ పరగండభైరవునకై
అరి మానస చండడిండిమారావునకై
కరవాలభైరవోర్జిత
బిరుదునకై నతవిమతనిభృతవరదునకై.

తరల- సుజనపోషణశాలికై రణశూరతావనమాలికై
రజనినాథకులాగ్రగణ్యవిరాజికై జయవాజికై
గజభుజంగమభారవారణ కారికై యవికారికై
విజయవిక్రమధర్తకై మనవిశ్వభూవరభర్తకై.
(షష్ఠోల్లాసము 144, 145, 146.)

క॥ శ్రీవిశ్వేశ్వరునకునై, భావితవిశ్వేశ్వరాంఘ్రిపద్మునకై సం
భావితపదవాక్యకళా, కోవిదుకై నయవిశేషగుణ విదునకునై.
సప్తమోల్లాసము - ౧ వ పద్యము.

పంచమీవిభక్తి:— కేతన - దశకుమార చరిత్ర. 1 ఆ.

ఉ॥ కర్ణునికంటె దాత, రతికాంతునికంటెను సౌమ్యమూర్తి దృ
క్కర్ణకులాధినాయకున కంటెను ...

షష్ఠ్యంతములు - కావ్యములలో నియతములు.

షష్ఠీవిభక్తి:—పోతన భాగవతము - కృత్యాది -

సప్తమీవిభక్తి:— నన్నయ - ఆదిపర్వము 5 - 139.

---

సీ॥ అణిముత్యాలతో, అలవేల్పుతేనెతో,
మంచుతో మేటిరాయంచతోడ. - మించుపల్లె 47 పుట.

లయగ్రాహి—చందనతమాలలతలందు నగరుద్రుమము
లందు కదళీవనము లందు లవలీ మా
కంద తరుషండముల యందు ననిమీలదర
విందసరసీరుహము లందు వనరాజీ
సందళితపుష్పమకరందరసముందగులు
చుందనపు సౌరభము...

స్థాలీపులాకన్యాయమున గొన్ని చూపితిని గాని యిట్టి యుదాహరణములు లెక్కకు మిక్కిలిగాఁగలవు.

*సంబోధన :* ఆశ్వాసాద్యంతములు

చంపువులయందును శతకములయందు సంబోధనాంతములే యున్నను, దేశిరచనములగు ద్విపదలయందును, యక్షగానములయందును ద్వితీయాంతములు వెలసిన వనుట కుదాహరణములు చూపుచున్నాఁడను. ఇదియును దేశి వాఙ్మయముపై కావ్యవాఙ్మయ ప్రభావమెంతవఱకుఁ బ్రసరించినదో తెలిసికొనుట కుపయుక్తమగును. తొలుత ద్విపద కావ్యముల యంతములఁ గూర్చి వివరించెదను.

మన కుపలబ్ధములైన ద్విపదలలో పాల్కుఱికి సోమనాథుని బసవపురాణము మొదటిది - దీనియందును, సోమనాథుని యద్వితీయ ద్విపదకృతి పండితారాధ్య చరిత్రముననను నాశ్వాసప్రకరణాంతముల సంబోధనాంతములు కలవు. కాని తరువాత వెలసిన ద్విపదకృతులలో ప్రాయికముగా ద్వితీయాంతములే గానవచ్చుచున్నవి. రంగనాథ రామాయణము వీని తరువాత ద్విపద కృతులలో మొదటిది. అందులో కాండాంతములలో-

ద్వి॥ "అని యాంధ్రభాష భాషాధీశవిభుఁడు
... .... ...
భూలోకనిధి కోనబుద్ధ భూవిభుఁడు
తమ తండ్రి విఠ్ఠలధరణీశు పేర

కమనీయగుణధైర్య కనకాద్రిపేర
పనిబూని పరగండభైరవుపేర
... ... ...
కరమర్థి.........కాండంబు సెప్పె.''

అని ద్వితీయాంతములే గలవు. తరువాతికృతి మడికిసింగన భాగవత దశమస్కంధము ద్విపద - ఇది వాణసవంశీయుఁడును, పద్మపురాణ కృతి పతియగు కందన మంత్రికి కృతి-

ద్వి॥ అని యిట్లు నిత్యధర్మారంభుపేర
జనలోక నవపారిజాతంబుపేర
చతురకళాపూర్ణచంద్రుని పేర
అతులవైభవనిర్జరాధీశు పేర
శోభితనవరూపసూనాస్త్రు పేర
ఔబళమంత్రి కందామాత్యుపేర
... ... ...
సింగనామాత్యుఁడు చెలువగ్గలింప
...... ఆకల్ప మగుభంగి చెప్పె.

కట్టావరదరాజకృతి రామాయణద్విపద (సంఖ్య 351) క్రీ. శ. 1600[1].

ద్వి॥ విలసిల్లె నన వేదవేద్యుని పేర
అలమేలుమంగాంగ నాధీశు పేర
అంచిత కరుణాకటాక్షుని పేర
కాంచనమణి మయాకల్పుని పేర
ఆదిత్యకోటి ప్రభాంకుని పేర
వేదవేదాంతార్థవినుతుని పేర

1. ఈ ద్విపద వాల్మీకిరామాయణము నాచేఁ బరిష్కృతమై మద్రాసు రాష్ట్రీయ ప్రభుత్వము వారివలన తంజావూరి సరస్వతీ పుస్తక భాండాగారపక్షమున ప్రకటింపబడినది.

కంకణాంగద రత్న కటకాఢ్యు పేర
వేంకటేశుని పేర విశ్వాత్ము పేర
... ...వరదరాజు
రచియించు వాల్మీకి రామాయణంబు
విపులార్థ రచనల విలసిల్లుగాత.

మహాప్రసిద్ధుఁడు తంజావూరి రఘునాథరాయని (ముద్రితము. 1921) నలచరిత్ర ద్విపద

అని జానకీహృదయానందు పేర
భానుమద్వంశవైభవకరు పేర
నానాజగద్భవనాస్థిరు పేర
పరమదయాది శోభనగుణంబులను
పరగెడు శ్రీరామభద్రుని పేర.
... ... ...
రఘునాథభూపాల...సుఘటిత శబ్దపటిమఁ
దనరెడు నలచరిత్రంబు........

19 వ శతాబ్దమువఱకు నీ సంప్రదాయమే కలదనుటకు క్రీ. శ. 1810 ప్రాంతములనున్న పోచిరాజువీరన కృతి విభూతిరుద్రాక్ష మాహాత్మ్యమునుండి గద్య నుదాహరించుచున్నాఁడను-

ద్వి॥ "అనుదిన శివసపర్యాసక్తు పేర
అభియుక్తి వీరశైవాచారు పేర
శుభకరోద్యద్గుణ శోభితు పేర
విజయవాటీపుర విభుకృపాలబ్ధ
నిజమహత్త్వౌదార్యనిర్ణయు పేర
పటుశమీశాఖానిబద్ధ వస్త్రాంత
ఘటితవైశ్వానరకల్పను పేర-

అని ముగించినాఁడు.

పైని చూపినట్లు పాల్కురికి సోమనాథుని నుండి యధునాతన కాలము వఱకు ద్విపదలలో నీద్వితీయాంతములున్నను నడిమి కాలమున ననఁగా 15, 16 శతాబ్దములలో వెలసిన తాళ్ళపాకవారి కృతులలో నీ నియమము గానరాదు. అందు షష్ఠ్యంతములే కలవు.

తాళ్ళపాకచిన్నన్న-అష్టమహిషీకల్యాణము. (క్రీ. శ. 1560 ప్రాంతము)

ద్వి॥ అని సుధాపాణికి నబ్జపాణికిని
వనజాస్యమాతకు వనధిజాతకును
నను గన్నతల్లి కనత్రమల్లికిని
కనకగాత్రికినిఁ బ్రకామధాత్రికిని
... ... ...
మృగమదాంగకు నలమేలుమంగకును
అంకితంబుగను ...తిరువేంగళనాథ
విరచితంబు......

ఇట్లే యీతని ఉషాకల్యాణమున గూడ పాటింపఁబడినది. దీనికి కారణము చిన్నన్న ద్విపదరచనమున కొన్ని సంస్కారములు గావించినాఁడు. ద్విపద సాహిత్యమున చిన్నన్నకృతులొక ఘట్టము. ద్విపదలయందు ప్రాసయతు లుపయోగింపకూడదను సంస్కరణమీతనిదే. కావున నాశ్వాసాంతమున కూడ సంస్కారముచేసి షష్ఠ్యంతము లుపయోగించినాఁడు. సోమనాథుని కృతులలో సంబోధనల నిందు చూపుచున్నాఁడను.

బసవపురాణము —

మొదలు- శ్రీగురుదేవ సంచితగుణోత్తంసు
యోగీంద్రహృదయ పయోజాతహంసు
... ... ...
భక్తజనత్రాణు భక్తధురీణు
భక్తజనప్రాణు కరమకల్యాణు





మన్మనోరమ్యు నిర్మలభావగమ్యు
జిన్మయు సౌమ్యు భజించి కీర్తించి

అని ద్వితీయాంతములుగా బ్రారంభించి, కథారంభమున సంబోధనతో నిట్లు ప్రారంభించినాఁడు.

శ్రీకీర్తిసంచితాంచితవరభక్తి
సాకార ! వినమితామాత్యసంగాఖ్య !

ఆశ్వాసాంతమున.

బసవపురాణార్థ పరిచయస్ఫీత !
బసవపురాణార్థ పరిమళాఘ్రాత !
బసవనామావళి పరమానురక్త
బసవనామావళి పాఠకాసక్త !
....　　....　　....
బసవసన్నిహిత సద్భక్తాత్మ సఖ్య !
బసవసన్నిహిత సద్భావసంగాఖ్య !

ఇట్లే యాశ్వాసాద్యంతము లేడింటియందునుగలవు. పండితారాధ్య చరిత్ర.

మొదలు- శ్రీగురుమూర్తి నూర్జిత పుణ్యకీర్తి
నాగమాంతస్ఫూర్తి నానందవర్తి
...　　...　　...
మల్లికార్జున దేవు మహితరూపంబు
దానయౌబసవన దండనాయకుని
జానొంద మత్కృతిస్వామి గావించి.

అని ప్రారంభించి, కథారంభమున

దీవించి నిన్ను సంభావించి శ్రోత
గావింతు సచివాగ్రగణ్య సూరార్య !

అని సంబోధించి - ప్రకరణాంతమున

పండితారాధ్య ప్రబంధ నిస్తార
పండితారాధ్యప్రబంధవిస్తార
... ... ...
సూరకవీంద్ర మందార ! శుభప్ర
కార విన్మిదియు దీక్షా ప్రకరణము

పాల్కురికి సోమనాథుఁడు తనకృతులకు కథాశ్రోతలఁదానే యెన్ను కొనినవాఁడుగావున, శ్రోతలను సంబోధించి, కథాభాగము నుపక్రమించుట సమంజసమేకదా ! మఱియు నీ పద్ధతి సోమనాథుని, కంటె పూర్వుఁడగు నన్నయభట్టారకుఁడే, భారతమున రాజనరేంద్రుని శ్రోతగాఁ జెప్పి, "అయిన దేవా ! నీయనుగ్రహంబునం జేసి''అని సంబోధించినాఁడనియు, నీ మహా కావ్యలక్షణమునే సోమనాథుఁడు తనద్విపదకృతులలో వెలయింపఁజేసినాఁడని మున్ను తెలిపితిని. కావుననే నన్నయ భట్టారకునివలె సోమనాథునకు షష్ఠ్యంతములు వ్రాయవలసిన యగత్యములేదు.

అత్యంత ప్రాచీనుఁడగు కాళిదాస మహాకవి రఘువంశము వ్రాయుటకుఁబూని అందు రఘువంశ రాజుల గుణములను "సోహమాజన్మశుద్ధానాం''అని ప్రారంభించి, నాలుగు శ్లోకములు షష్ఠ్యంతములుగా వర్ణించి, "రఘూణామన్వయవక్ష్యే'' అనెడి విశేష్యముతో అన్వయము కలిపెను.

రఘువంశ ప్రథమస్సర్గః

సోహమాజన్మ శుద్ధానామాఫలోదయ కర్మణామ్
ఆ సముద్రక్షితీశా నామానాకరథవర్త్మనామ్ ... 5
యథావిధి హుతాగ్నీనామ్ యథాకామార్చితార్థినామ్
యథాపరాధ దండానామ్ యథాకాల ప్రబోధితామ్ ... 6
త్యాగాయ సంభృతార్థానామ్ సత్యాయమిత భాషిణామ్
యశసే విజిగీషూణామ్ ప్రజాయై గృహమేధినామ్ ... 7

శైశవేభ్యస్త విద్యానామ్ యౌవనే విషయైషిణామ్
వార్ధకేముని వృత్తీనామ్ యోగేనాంతే తనుత్యజామ్ ... 8

రఘూణా మన్వయం వక్ష్యేతను వాగ్విభవోఽపిసన్
తద్గుణైః కర్ణమాగత్య చాపలాయప్రచోదితః ... 9

తం సంతః శ్రోతుమర్హంతి సదస్వద్వ్యక్తి హేతవః
హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిశ్శ్యామికాపివా ... 10

అనగా ఇత్యాదిగుణములు గల రఘు రాజుల యొక్క చరిత్రమును వ్రాయుచున్నాను అని వ్రాసెను-ఈ షష్ఠ్యంతములు రఘువంశ రాజుల వ్యక్తి వర్ణన పరములే. ఈ షష్ఠ్యంతములను చూచి అట్టి వర్ణన పద్ధతి యందముగానున్నదని తలంచి నన్నెచోడుఁడు కృతిపతిని షష్ఠ్యంతములతో స్తుతించి యున్నాఁడు.

పాల్కురికి సోమనాథుఁడు నన్నెచోడ మహాకవి కుమారసంభవ కావ్యమునుండి సాహిత్యరీతులు, పదజాలము నెంతయేని గ్రహించినవాఁడు గదా ! నన్నె చోడునికృతియందుగల షష్ఠ్యంతములెట్లు విడచినాఁడని ప్రశ్న రాకమానదు. దీనికి సమాధానము సోమనాథుని గ్రంథములయందే యున్నది. సోమన కథాశ్రోతలు మానవులు. నన్నెచోడుని కృతికధినాథుఁడు జంగమ మల్లికార్జునుఁడు. ఇతఁడు నన్నెచోడుని గురువు. ఈతడుఁ మానవుఁడయ్యును నన్నెచోడుడీతనికి పరమేశ్వరుఁడగు జంగమ మల్లికార్జునుని కభేదవ్యవసాయము చేసినవాఁడగుటచే నాతనికావర్జిత హృదయుఁడై షష్ఠ్యంతములు చెప్పినాఁడు. కేవలమానవ స్వరూపులుగాన యెదుటనేయున్న వారుగావున, నన్నయ, సోమనలకు వారిని సంబోధించుట లోకస్వభావము ననుసరించియే యున్నది. కాని నన్నెచోడుఁడు గురువును నమూర్తమును, అలౌకికమునగు దైవముగానే భావించుటచే నాతనికి షష్ఠ్యంతములు చెప్పవలసివచ్చినది. ఇఁక తిక్కన హరిహరనాథుని కేవల దైవస్వరూపునిగా నర్చించి యారాధించుట చేత, నాతనికి షష్ఠ్యంతము లావశ్యకములే యగుచున్నవి. అయిన నిందొక్క విశేషము గలదు. నన్నెచోడునివలె తిక్కన భారతమున ఆశ్వా

సాద్యంతములలో విభక్త్యంతములు లేవు. సంబోధనాంతములే కలవు. దీనికి తిక్కన సోమయాజి షష్ఠ్యంతములు చెప్పిన వెనుక తిరిగి హరిహరనాథుని సంబోధించి కథాప్రారంభము గావించియుండుటచేత గ్రంథాంతమువఱకు సంబోధనలే కలవు. తరువాతి వారందఱును నీ తిక్కనపథకమునే యవలంబించిరి. తిక్కన నిర్వచనోత్తర రామాయణమున, మనుమన్నృపతి కేవల మనుష్యమాత్రుఁడగుటచే షష్ఠ్యంతము లుపయోగింపలేదు. "మనుమజన విభునకు నమ్మనుజపతి కభ్యుదయమ్ముగనేఁ జెప్పఁబూనునట్టి కథకు" అని ప్రారంభించినాఁడు. షష్ఠ్యంతములు చెప్పిన తరువాతి వారికందఱకు నిదియే మార్గమైనది. కాబట్టి దీనివలన మనకెఱుకపడిన దేమనగా షష్ఠ్యంతములు దైవపరములే యనియు, క్రమముగా నివి మానవులకు గృతినిచ్చుటకుఁగూడ నుపయుక్తములనియు, నివి సంస్కృతమునందునుగాని, కన్నడభాషయందు గాని లేకుండుటచే, తెలుఁగు సాహిత్యమున నొక ప్రత్యేక లక్షణముగా వెలసినదనియు, దానిని తరువాతి కవులు నియతముగా పాటించిరనియు, నిశ్చిత విషయములని తెలియనగును.

పాల్కురికి సోమనాథుని ద్విపదకృతులలో సంబోధనము లుండుట చంపూకావ్య లక్షణమే. ద్విపదలయందు ప్రత్యేకముగ నది పట్టింపఁబడిన దనియు నంతకు ముందుగాని వెనుకగాని యట్టి సంప్రదాయము లేదనియు, నాతని కృతులవలనను, తరువాతి కృతులనుండి నేనుదాహరించిన వానివలనను తెలియుచున్నది. కేవల దేశికవితలో నున్నద్విపదకు మహాకావ్యముతో సమానప్రతిపత్తి గడించుటకే సోమనాథుఁడీ కావ్యలక్షణము నందు నెలకొల్పినాఁడు. తరువాతి కృతులలో నియతముగ నీసంప్రదాయ ముండుటచే, సోమనకు ముందును నిట్టిసంప్రదాయమే కలదనియు, సోమనప్రత్యేకత ద్విపదలో పాటించినది కావ్యప్రభావమే యనియు చెప్పనొప్పును.

ద్విపదలలో కావ్యాంతములు ద్వితీయాంతములే యను సామాన్య సూత్రమున కపవాదముగా సోమనాథుని వెనుక, తాళ్ళపాకవారి కృతులలో నున్నట్లు చూపితిని. కాని యిదియును కావ్యప్రభావమే. కావ్యములలోనున్న

షష్ఠ్యంతములను, లక్షణమును, ద్విపదలలో తాళ్లపాక చిన్నన్న పట్టించె ననియు, నాతని వెనుకఁగూడ ప్రాచీన సంప్రదాయమునే తరువాతికవు లనుసరించిరనియు తేలుచున్నది. దీనినిబట్టి దేశికృతులలో ద్వితీయాంతములే సర్వసామాన్యములని నిశ్చయింపనగును.

ద్విపదలలోనేగాక యక్షగానములయందు ద్వితీయాంతములే సామాన్య ముగ గన్పట్టుచున్నవి. దేశివాఙ్మయములో ద్విపదలవలె నివియును ప్రాచీన కాలమునుండి ప్రచారమున నున్నను నుత్తమ సాహిత్య శ్రేణిలోనికివి నేటి వఱకుఁ బరిగణితములుకాలేదు. ఈ యక్షగానరచనలు గ్రంథరూపము దాల్చు నాటికి, కావ్యపథకమే ప్రచారములోనున్నను, వీనియందు దేశిలక్షణములే చాలవఱకు కన్పించుచున్నవి. దీనికి కారణము, యక్షగానము లెంతసంస్కార దృష్టితో రచితము లైనను నవి ప్రజాసామాన్యముకొఱకే గాని, సహృదయు లగు ప్రౌఢవిద్వాంసులకుఁగాదను నభిప్రాయము ప్రబలముగానుండుటయే యని చెప్ప నొప్పును. పద కవిత్వప్రధానము లగు యక్షగానములలో పద్య రచన లుండుటయే దేశివాఙ్మయముపై కావ్యప్రబంధరీతుల ప్రభావము నెఱుక పఱచుచున్నది. అయినను, దేశిరచనా సంప్రదాయములనే యక్షగానరచయితలు పాటించిరి.

ఉ॥ శ్రీవిభుఁగొల్చి, శంకరుఁభజించి, చతుర్ముఖునెంచి, భార్గవీ
గ్రావసుతా సరస్వతులఁ బ్రార్థనసేసి, గణేశపాదపూ
జావిధిసల్పి, దేశికులసంస్తవనం బొనరించి, కావ్యవి
ద్యావిదుల న్నుతించి, కవితాజడుల న్నిరసించి వేడుకన్.

సుగ్రీవ విజయము (యక్షగానము) కందుకూరి రుద్రకవి

అని ద్వితీయాంతములతో ప్రారంభించి, చివఱ ద్వితీయాంతముగానే పూర్తి చేసినాఁడు.

ద్వి॥ అని సమస్తాసురా రాతికదంబ
వినమిత నిజభుజా విక్రము పేర

ఆతతార్చన లాలనాతిశయాళు
భీతరక్షణు పేర స్పృహయాళు పేర
నిగమగోచరు పేర నిఖిలలోకేశుఁ
డగు కందుకూరి జనార్దను పేర
నంకితంబుగ.........రుద్రధీర
విరచిత సుగ్రీవవిజయాభిదాన

... ... ...

యక్షగాన ప్రబంధ మొప్పుఁగాత.

శాహజీ మహారాజ (1648 - 1710) కృత పంచరత్నప్రబంధము (యక్షగానము) - తంజావూరి పుస్తకభాండారము. సంఖ్య. 540.

మొదలు—

సంబోధన :—ద్విపద. జయ రమాపురవాస, జయ చంద్రికాహాస
జయ సుమేరుశరాస, జయ కృత్తివాస.

చివఱ—

ద్వితీయాంతములు. శ్రీకంధరుని పేర సితదేహు పేర
లోకనాయకు పేర రుద్రుని పేర
పురుహూతనుతు పేర పురహరు పేర
కరుణాంబునిధి పేర గౌరీశు పేర

... ... ...

సాహితీపుంభావ శారదయైన
శాహ భూపాకశాసనుడు రచించె.

కంకంటి పాపరాజు విష్ణుమాయా విలాసము యక్షగానము.

మొదలు—ప్రథమావిభక్తి.

ఉ॥ శ్రీలలితాంగి నిత్యము ధరించియురంబున వోకరూఢిగా
నేలిన నన్నొకప్పు డిది యేటి ప్రియంబని నన్ను నాత్మ నే
వేళ వహించుటీవెఱుఁగవే యని రాధను గారవించు గో
పాలక శేఖరుండురు కృపావిభవంబున మమ్ము బ్రోచుత౯,

చివఱ—ద్వితీయాంతములు

ద్విపద॥ అని దయాధిక గుణోదారుని పేర

... ... ...

అతులకౌస్తుభ రత్నహారుని పేర
యతిమనః కమలవిహారుని పేర

... ... ...

కృతి పాలు పేర భక్తకృపాళు పేర
ప్రతిలేని మదనగోపాలుని పేర
అంకితంబుగ............
...పాపరా జొనరించె.

పాపరాజురచిత మగు నుత్తరరామాయణమునకు నత్యధిక వ్యాప్తి యున్నను నాతనిరచనమే యగు నీయక్షగానమునకంత వ్యాప్తిలేదు. యక్షగానశాఖయందు గల యాదరణమెంతయో దీనినిబట్టి గ్రహింప నగును.

యక్షగానములలో ద్వితీయాంతములు నియతములే యైనను, వీనిని సంస్కరించి, నాటకపద్ధతి నుత్తమ సాహిత్యశ్రేణికి దీసికొని వచ్చిన తంజాపూరి నాయకరాజులును మహారాష్ట్రరాజులును, వారి యాస్థానకవులును చివర షష్ఠ్యంతములను గూర్చినవారు. విజయ రాఘవనాయకుఁడు శాహజీ, గిరిరాజకవి మున్నగు వారీనియమము పాటించినారు. నాదబ్రహ్మత్యాగయ్య మాతామహుఁడు గిరిరాజకవి రాజకన్యాపరిణయములో (సంఖ్య 569) మంగళము చివఱను చెప్పినాఁడు.

మహారాజ శాహేంద్రునికి మంగళం - మిగుల
మహనీయశీలునికి మంగళం
వాసవవిభునికి, వరసాహిత్య భోజునికి
మంగళం.

ఇట్లు మంగళము, శోభనములు, చెప్పునపుడు షష్ఠీవిభక్తి యుప యుక్తము కావలెను. కాని యీసంస్కారము, పై ద్విపదలలోని సంస్కారమువలె తాత్కాలికమేగాని, సార్వత్రికము కాదు. కావ్యలక్షణ ప్రభావమును సూచించునని తెలియఁజెప్పుట సారాంశము.

## గ్రంథాదిని 'శ్రీ'తో నుండుట

సర్వసాధారణముగ తెలుఁగుభాషలో నే గ్రంథమైనను మొన్న మొన్నటి వఱకును 'శ్రీ'తో ప్రారంభ మగుచుండెడిది. ప్రాచీనమునం దిది నియతముగ పాటింపఁ బడెనని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. గ్రంథము 'శ్రీ'తో ప్రారంభింపవలయు నన్ననియమము సంస్కృతభాషలో లేదు. ప్రాచీన సంస్కృతకావ్యముల యందిది కానరాదు. కన్నడభాషలో నీనియమము కానవచ్చుచున్నది. కవిరాజమార్గము (క్రీ. శ. 840) నుండి యీనియమము కలదు. పంప, పొన్న, రన్న కవిత్రయము వారితోపాటు కన్నడకవులును నీ నియమము పాటించినారు. తెలుఁగున నన్నయ, నన్నెచోడాది మహాకవు లందఱును 'శ్రీ'తో ప్రారంభించినారు. తెలుఁగు భాషలో కావ్యముల యందు 'శ్రీ' మొదలుగా నుండుటచే లక్షణ గ్రంథములలో శ్రీకార ప్రభావము చెప్పఁబడినది*.

నన్నయకు ముందు నొకశాసనములోను, నన్నయకు వెనుక శాసనములలోను 'శ్రీ'తో ప్రారంభమైనవి కలవు. గుణకవిజయాదిత్యుని కాలమున

---

*శ్రీకారము ఋగ్యజుస్సామాధర్వములలో కనీసము నాలుగైదు నూరులు మారులు వివిధ విభక్తులలో ప్రయుక్తమైనది. ద్విజులలో శ్రీసూక్తము ఆబాలగోపాల పరిచితమైన విషయము.

కేవలము శ్రీ అను పదముకూడ - ఋగ్వేదమున 5-57-6 లో ప్రయుక్తమైనది.

(848-892) వెలసిన శాసనములో "శ్రీనిరవద్యుండుచిత్త (జాత) సముండు" అని కలదు. అద్దంకి శాసనము మొదలు మనకు లభ్యము కాలేదు. అందు 'శ్రీ' యుండుననియే నాయభిప్రాయము. యుద్ధమల్లుని శాసనము "స్వస్తి" తో ప్రారంభమైనది. నన్నయకు వెనుక శాసనము లన్నింటిలో నీ నియమము కానవచ్చుచున్నది. శ్రీవిష్ణువర్ధను ... (సోమలదేవి శాసనము 1065), శ్రీశకునేండులు (1075) వనపతి శాసనము. శ్రీరమణీయుఁడు - కొమ్మాసాని శాసనము (1106) ఇత్యాదిగా కానవచ్చుచున్నవి. కావున తెలుఁగులో గల ప్రాచీన సంప్రదాయమునుబట్టి చూచినచో, తొలుత శాసనములు వ్రాయుట 'శ్రీ'తో ప్రారంభమైనవి యనియు, నదియే కావ్యములందు అనగా మార్గకవిత యందుత్తమములుగా పరిగణింపఁబడిన గ్రంథములయందు నియతమై యుండెననియు, వానినుండి దేశికవితలో గ్రంథములయందు గూడ నుప యుక్తమయ్యె ననియు మనము గ్రహింపనగును. కావుననే, దేశిరచనలని చెప్పదగిన ద్విపదలు, యక్షగానములు నుదాహరణములు మొదలగునవి 'శ్రీ'తో ప్రారంభమైనవి.

దేశిరచనలలో తొలుత పదరచనమే ప్రవర్తిల్లినపుడు 'శ్రీ' తో ప్రారంభమగుట కవకాశములేదు. తత్సమేతర భాషయందు శవర్ణమును, పదాదిసంయుక్తములు నుండనేరవుగదా ! కాబట్టియే అచ్చ తెలుఁగున కావ్యములు వ్రాసినవారు శ్రీవర్ణమునకు 'సిరి' యను తెలుఁగుపదము నుపయోగించిరి. ఇది తత్సమకావ్య ప్రారంభాను కరణమే యైనను దీనివలన తత్సమేతరములగు దేశిరచనలలో 'శ్రీ'తోగాని 'సిరి'తో గాని ప్రారంభింపవలసిన యగత్యము ప్రాచీన కాలములో లేదని తెలియుచున్నది. మఱియు 'శ్రీ' తో శుద్ధముగా దేశీయములగు సీసములు, తరువోజలును, ప్రాచీన కాలమున ప్రారంభమగుటచేతను 'శ్రీ' అక్షరగణ మగుటచేతను, మాత్రాగణ ప్రధానములగు నీ వృత్తములకు ముందుండుటచే, సంస్కృత వృత్తముల ననుసరించి,

జాతీయము లగు వృత్తములను సంస్కరించిన తరువాత "శ్రీ" ప్రచారము నకు వచ్చెననియు, నదియే, శాసనముల లోనికి బద్యరచనకు నెంతయో పూర్వము నుండియు మన భాషలో వెలసి యున్నదనియు గ్రహింపవచ్చును.

మఱియు ఛందస్సులో, వృత్తములలో తొలిది 'శ్రీ' వృత్తము గలదు. ఇది వృత్తముగాఁబేర్కొన్నను నేకాక్షరమే. ఇది హ్రస్వము లేని దీర్ఘము. సంస్కృతచ్ఛందస్సున యక్షరములు ప్రధానము కావున 'శ్రీ' యక్షరమైనది. ఇది దీర్ఘమగుటచే గురువును నిందు రెండు లఘువులు లేక రెండు మాత్ర లును గలవు. కాని సంస్కృతచ్ఛందస్సు గురువు నాదియందుంచి ప్రస్తరింతురు. దేశీయచ్ఛందస్సును రెండు లఘువులతో ప్రస్తరింతురు. దీనివలననే యక్షర గణములేర్పడి తత్ప్రధానములగు వృత్తములు తెలుఁగున వాడుక లోనికి వచ్చినవి. ఇట్లు మూడును దీర్ఘాక్షరములగు 'మగణము' నాదియందుగలది యగుటచే శార్దూలవృత్తము శుద్ధసంస్కృత వృత్తమైనది. ప్రాచీన సంస్కృ తమునందు లేకపోయినను దాక్షిణాత్య సంస్కృత సంప్రదాయము ననుసరించి, తెలుఁగుకవులు కృత్యాదిని 'శ్రీ'తో ప్రారంభించి, సంస్కృత వృత్తమగు శార్దూలముతోడనే ప్రారంభించిరి. కావున 'శ్రీ'తో కావ్యము ప్రారంభమగుట, కేవలము మంగళవాచకముగా ప్రారంభమునకు మాత్రమే కాక, కృతిముఖ మున నుపయోగించు వృత్తము కూడ నియమించుటకు, హేతువైనది. కాబట్టి సంస్కృత శ్లోకమును శార్దూలవృత్తమునే నన్నయ యుపయోగించినాఁడు. నన్నయ ననుసరించి కావ్యాదిని సంస్కృత శ్లోకములు వ్రాసినవారందఱును, శార్దూలమునే యుపయోగించిరి.

పావులూరి మల్లన గణితమున 'శ్రీకంఠం సగుణమ్' అనియు, తిక్కన నిర్వచనోత్తర రామాయణమున 'శ్రీరాస్తాం మనుమక్షితీశ్వర' అనియు, విన్నకోటపెద్దన కావ్యాలంకార చూడామణిలో 'శ్రీవాగాస్పదయో' అనియు శార్దూలవృత్తముతో ప్రారంభించి యున్నారు. తరువాతి కవులలో కృతి ముఖమున సంస్కృత శ్లోకములు చెప్పునాచారము లేదనియే చెప్పవచ్చును.

అధునాతన కాలమున మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులవారు, తమ బిల్వేశ్వరీయ మహాకావ్యములో "శంనోమామ్" అని శార్దూల వృత్తమును రచించి యున్నారు. శ్రీకారముతో కూడిన మగణ ప్రధానమగు శార్దూలవృత్తమునే తెలుఁగునవ్రాసి, నన్నయతరువాతి కవులీ నియమమును పాటించినారు. కేతన 'శ్రీవాణీగిరిజేశ' అని విజ్ఞానేశ్వరము, నాంధ్రభాషాభూషణము ప్రారంభించినాఁడు. శ్రీనాథుఁ డీ నియమమును తక్కిన వారందఱకన్న చక్కఁగా పాటించినాఁడు. 'శ్రీరామాస్తనమండలీ'-నైషధము, శ్రీకాశీనగరాధి రాజ్యపదవి - కాశీఖండము - "శ్రీగౌరస్తన" శివరాత్రి మహాత్మ్యము, శ్రీకైవల్యపదంబు - పోతన - శ్రీగౌరీకుచకుంభ-జక్కన - తరువాతి ప్రబంధకవులు నల్లసాని పెద్దనాదులును విరివిగా శార్దూల వృత్తమునే కృతిముఖమున వాడినారు.

ప్రాచీనకవులలో నన్నెచోడుఁడు శార్దూలవృత్తమునకు మగణ మాదియందుగల స్రగ్ధరావృత్తమును వాడియున్నాఁడు. ఇట్లే మల్లియరేచన కవిజనాశ్రయమున 'శ్రీకాంతాతిప్రియవాక్ శ్రీకాంత జగత్త్రయైక సేవిత' అని కందపద్యము నుపయోగించి యున్నాఁడు. ఇచ్చట వీరు మగణమునకు ప్రాధాన్యమిచ్చియున్నారు. కాని కవిజనాశ్రయమున గల కందమును నాశ్వాసాదులయందు తప్ప కావ్యాది నెవ్వరును వాడియుండలేదు. మఱియు కందము కేవల సంస్కృత వృత్తము కాదు. జాతులలో జేరినది. స్రగ్ధర సంస్కృత వృత్తమే యైనను, నాఱింట'త' యుండుటచేతను నది యశుభప్రద మగుట చేతను నెవ్వరును దానిని వాడియుండరైరి. కాబట్టి నన్నయ సంస్కృత శ్లోకము శార్దూలవృత్తమును వాడినరీతిని గమనించి నన్నెచోడుఁడు దేశి మార్గములను దేశీయములుగాఁ జేయఁదలఁచినవాఁడు గావున మగణప్రధాన మగు స్రగ్ధరను తెలుఁగు కావ్యముఖమున నలరించి నన్నయకన్న భిన్నమగు మార్గము త్రొక్కినాఁడు. కాని తరువాతి కవులు నన్నయవలె సంస్కృత శ్లోకమునే కావ్యముఖమున పాటించుటయు, తెలుఁగు పద్యము కావ్యముఖమున రచించుటకు నన్నెచోడుఁడే ప్రాథమికుడైనను, నాతని మార్గమునుమాత్ర

మనుసరించి, తెనుఁగు పద్యమును శ్రద్ధతో చెప్పక నన్నయననుసరించి శార్దూలవృత్తములతోఁ జెప్పువారనియుఁ జెప్పనగును.

తిక్కనసోమయాజి నన్నయ నమసరించి నిర్వచనోత్తర రామాయణమున సంస్కృత శార్దూలవృత్త ముపయోగించినను, భారతమున మాత్రము, ఉత్పలమాలను 'శ్రీయన గౌరినాఁబరగు' అని ప్రారంభించినాఁడు.

ఉత్పలమాల కేవలము సంస్కృతవృత్తము కాదు. మఱియు మగణముతో ప్రారంభముకాదు. భగణముతో మొదలిడును. అయిన నందలి యాదిగురువు (దీర్ఘము) శ్రీకారమునిడి, తిక్కన కృతిముఖమున ఉత్పలమాలను రచియించుటకు ప్రారంభకుఁడైనాఁడు. శ్రీకారప్రాధాన్యమువలన నగణముతో గాని, మఱి యేలఘ్వాది గణములతోగాని మొదలిడు ఛందస్సులెంత మాత్రము నుపయోగింప గూడదనియు నీ కారణముచేత లఘ్వాదిగణములలో రెండు లఘువు లొకగురువుగా, జేసి దాని నాదియందునిలిపి, సీస, గీత, తరువోజఁ అక్కర, రగడాది ఛందస్సులేవియు కావ్యముఖమున నిలుపరాదనియు తిక్కనరచనమువలన సంప్రదాయసిద్ధమైనది. కందమున నాదిని శ్రీకారమిడుటకు నవకాశమున్నను, కావ్యాదిని కందము సమవృత్తముకాకపోవుటచే ననఁగా నాల్గుపాదము లొకేరీతిని యుండకపోవుట చేతను కృతిముఖమున కవిజనాశ్రయములోను, శివతత్త్వసారములోను తప్ప తక్కినచోట్ల కానరాదు. కాబట్టి తిక్కనకాలమునను, నావెనుకను, కృత్యాదిపద్యములు రెండు విధములుగా రచింపఁబడుట యేర్పడినది. ఇదియే సంప్రదాయమైనది.

తిక్కనసోమయాజి, నన్నయ్యకన్న భిన్నముగ శుద్ధసంస్కృత వృత్తమువీడి, సంస్కృతచ్ఛందస్సువలె నక్షరగణప్రధానమయ్యు సంస్కృతమున ప్రచురప్రచారములేని ఉత్పలమాలిక నుపయోగించుట, యాతఁడు దేశిసంప్రదాయమును, మార్గసంప్రదాయముతో మేళగించి యాపథమునకు నాచార్యపురుషుఁడైనవాఁడు. తిక్కనకు ముందుగ వెలసిన మల్లికార్జునపండితుఁడు వ్రాసిన శ్రీగిరిమల్లికార్జున శతకములో 'లోకములన్ని నీతనువులోనివ'

అని ఉత్పలములున్నట్లు కన్పట్టుచున్నవి. పాల్కురికి సోమనాథుఁడు గ్రంథ ములనన్నింటను శ్రీకార ముపయోగించినాఁడు. వృషాధిపశతకమును, ననుభవ సారమును నుత్పలమాలలతో ప్రారంభించినాఁడు. ఉత్పలమాల యంతకు ముందు మూఁడు శతాబ్దముల క్రిందటనే కావ్యములఁ బ్రయుక్తమై యున్నది. నన్నయ కన్నడమున పోకడలెఱింగియు, సంస్కృతపద్ధతి నవలంబింపవలసిన వాఁడగుటచే కావ్యాదిని సంస్కృత శ్లోకము వాడినాఁడు. నన్నయ పలుమారు పారాయణముచేసి జీర్ణించుకొన్న పంపభారతమున నాది యుత్పలమాలయే కర్ణాటభాషలోఁగలదు. కావున శివకవు లుపయోగించిన యీ యుత్పలమాలను గ్రహించి తిక్కన దేశిమార్గరచనల సమ్మేళనమును దేశీయపద్ధతిని చేసినాఁడు.

కేతన దశకుమారచరిత్రమున, మంచన కేయూర బాహుచరిత్రమున, మారన మార్కండేయ పురాణమున, శ్రీనాథుఁడు భీమఖండ, హరవిలాస ములలోను, ఎఱ్ఱాప్రెగడ నృసింహపురాణమునను, ప్రౌఢకవిమల్లన రుక్మాం గద చరిత్రమునను, అయ్యలార్యుఁడు, యుద్ధ కాండ శేషమునను నుత్పల మాలల రచియించి యున్నారు.

పైదాని ననుసరించి తిక్కన భారతరచనముగావించి, మార్గ కవితా పథకమున నున్న దేశి సాహితీరీతులను, దేశీయములుగా చేసిన వెనుక, ముందు భాగమును రచియించిన నన్నయ పథకమును, తరువాత విరాటాది పదునేను పర్వములు రచించిన తిక్కన పథకమును, నావెనుక వెలసిన వాఙ్మయమున కంతకును బ్రమాణమైనది. కావుననే కావ్యముఖమున శ్రీకారము నిలిపినపు డీరెండు మార్గములును బాటింపఁబడినవి.

ఉదాహరణములలో నొక్కసంబోధన విభక్తియందుతప్ప తక్కిన చోట్ల ఉత్పలమాలయు చంపకమాలయు మాత్రమే యుపయుక్తమగును. తెలుఁగున మొదటి యుదాహరణమగు బసవోదాహరణమునుండి యిట్లే పాటింపఁబడినది. కాని బసవోదాహరణమున సంబోధనమునకూడ యుత్పల

మాలిక కలదు. తక్కినవానిలో శార్దూలవృత్తములు కలవు. వృత్తములలో విభక్తులయందు తరువాతికవులు మత్తేభమునుకూడ వాడిరి. ఉదాహరణ ప్రారంభము 'శ్రీ'తో నుత్పలమాలతో ప్రారంభముగాన నిది దేశిరచనమే యని చెప్పనగును.

## మంగళ మహాశ్రీవృత్తము

శ్రీకారము కృత్యాదినే గాక కృత్యంతమునఁగూడ నొకనియమముగా తెలుఁగు కవులు పాటించిరి. నన్నెచోడుఁడు, శ్రీతో ప్రారంభించి 'శ్రీ'తో ముగించిన వారిలో తొలివాఁడు. ఈతఁడు మంగళమహాశ్రీ వృత్తమును గ్రంథాంతమున నుపయోగించినాఁడు. దీని ననుసరించి పాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్యచరిత్రమున ననుభవసారమున మంగళమహాశ్రీలతో సంపూర్తిగావించినాఁడు. తరువాతి కవులలో నన్నెచోడుని నియమము పాటించినవారు జక్కన (విక్రమార్కచరిత్ర) ముక్కుతిమ్మన (పారిజాతాపహరణము) వెన్నెలకంటిసూరన (విష్ణుపురాణము) కాణాదము పెద్దన సోమయాజి (అధ్యాత్మరామాయణము) మొదలగువారు కలరు.

తెలుఁగు ఛందస్సులలో మంగళమహాశ్రీ వృత్తముకలదు. కన్నడ ఛందస్సులో కన్పట్టదు. మాలావృత్తములలోని లయగ్రాహి, లయహారి, కన్నడమున లలితవృత్తముతో సరిపోవును. ఈవృత్తము తెలుఁగున ప్రాథమికచ్ఛందో గ్రంథమని చెప్పఁబడిన కవిజనాశ్రయమునగలదు. తరువాతి ఛందో గ్రంథములయందు గలదు. గ్రంథాంతమున కాకపోయిన తిక్కన గ్రంథమధ్య భాగమునందు దీని నుపయోగించియున్నాఁడు[1]. వృత్తములపేరు, వృత్తముల యందిముడ్చు స్వభావముగల[2] నన్నెచోడుఁ డిట్లొకమాలా వృత్తమును మంగళమహాశ్రీతో వ్రాయగా తరువాత దీనికిని ప్రత్యేకముగ ఛందస్సున లక్షణము చెప్పిరాయని యూహపొడమక మానదు. లక్ష్యమున్నగదా

1. స్త్రీపర్వము. 2-29.

లక్షణము బయలుదేరుట : కావున నీయూహసరియైనదే యనియు, యిట్టి వింకను నున్నవేమో యని పరిశీలించుట కర్తవ్య మనియు మనము గ్రహింపవచ్చును.

ఉదాహరణములలో మొదటిదియగు బసవోదాహరణమున చంప కోత్పలములే యున్నవి. కాని త్రిపురాంతకోదాహరణములో సంబోధన యందు శార్దూలము ప్రయుక్తమైనది. ఇదియే తరువాతి కవులకు నొరవడి యైనది. సంబోధనలయందు నందఱును శార్దూలవృత్తములనే వాడిరి. శార్దూలవృత్తోపయోగమును హనుమోదాహరణము నుండి వాడుచుండిరి.

ఇట్లు కేవల సంస్కృతవృత్తములుగాని, సంస్కృతముగా చేయబడిన దేశివృత్తములుగాని నియతముగా వాడుటయు, నుదాహరణములో రెండవ

---

2. ఇదియే ముద్రాలంకారము. దీని లక్షణము – ఉదాహరణము.

ముద్రాలంకారః

సూచ్యార్థసూచనం ముద్రా ప్రకృతార్థపరైః పదైః ।
నితంబగుర్వీ తరుణీ దృగ్యుగ్మవిపులా చ సా ॥ (కువలయానందః)

అత్ర నాయికావర్ణనపరేణ 'యుగ్మవిపులా' పదేనాస్యానుష్టుభో యుగ్మవిపులానామత్వ రూప సూచ్యార్థ సూచనం ముద్రా ।

యద్యపి ప్రకృతే వృత్తనామ్నో నాస్తి సూచనీయత్వం. తథాప్యస్యోత్తరార్థస్య లక్ష్య లక్షణ యుక్త శ్లోకాత్ర మధ్య పాతిత్వేన తస్య సూచనీయత్వ మస్తీతి తదభి ప్రాయేణ లక్షణం యోజ్యమ్ । ఏవం నవరత్నమాలాయాం, తత్తద్రత్న నామనివేశేన తత్తన్నామకజాతి సూచనమ్ నక్షత్ర మాలాయామశ్విన్యాది దేవతానామభిర్నక్షత్ర సూచనమిత్యాదా వయమే వాలంకారః । ఏవం నాటకేషు వక్ష్యమాణార్థ సూచనేష్వపి ॥

ముద్రాలంకారము – మొదటి యుదాహరణము

పూర్వం పాటలిపుత్ర మధ్యనగరీ భేరీమయా తాడితా
పశ్చాన్ మాళవ సింధుఠక్కవిషయే కాంచీపురీ వేదిశే
ప్రాప్తోహం కరహాటకం బహుభటం విద్యోత్కటం సంకటం
వాదార్థీ విచరామ్యహం నరపతే శార్దూల విక్రీడితమ్.

సమంతభద్రుఁడు క్రి. శ. 400.

కర్ణాటక కవి చరిత్ర 1 వ భాగము. పుట 2.

భాగమున ప్రయుక్తమగు పదకవితలో మార్పు లేక రగడలే ప్రధానముగ వాడుటయుఁ జూడ, తెలుఁగు కవితలో సంస్కృతవృత్తములు వాడుకొనుటకు ప్రయత్నములు జరుగుచున్న ప్రాథమికావస్థనుండియు నుదాహరణ రచనము సాగుచున్నదని గ్రహించుట కవకాశము కలదు. కావున శతక, యక్షగాన, కావ్యాదులకన్న గ్రంథరూపమున తెలుఁగున తొలుత వెలువడినవి యుదాహరణములే యని చెప్పనగును.

## విభక్తి ప్రత్యయ విశేషములు

ఉదాహరణకావ్యములు విభక్తిప్రత్యయములనే నియతముగా నిరూపించుటకుఁ బుట్టినవని వ్యాకరణశాస్త్రీయ దృష్టిని చెప్పవచ్చును. ఏలయన విభక్తిప్రత్యయములు భాషలో ప్రాథమికరూపముల నేరూపమున నుండునో, ఆ రూపముననే తరువాత నొక్క యుదాహరణముల మాత్రమే ప్రయుక్తమగును. కావ్యాదులలో విభక్తిప్రత్యయముల నాయాకాలముల నేర్పడినవి యన్నియు నొకే కాలమున ప్రయుక్తమగుటకు వీలున్నది-ఉదాహరణముల నట్లుకాదు. ఇది మన తెలుఁగు విభక్తిపరిణామమును తెలిసికొనుట కెంతయు నుపయోగపడుచున్నది. ముఖ్యముగా తెలుఁగుననున్న విచిత్రపద్ధతి-భిన్నార్థకములగు రెండు ప్రత్యయములొకేవిభక్తినుండుట - యనునది తెలుఁగుః భాషాతత్త్వమునుబట్టి సరియైనదే యని నిశ్చయించుట కిది తోడ్పడును.

## తృతీయా విభక్తి, తో, తోడ

ఇందుల కుదాహరణముగా, తృతీయావిభక్తి ప్రత్యయములగు చే, చేత, తో, తోడ, అనువానిలో-తో, తోడ అను ప్రత్యయములే యుదాహరణ మందునను మచ్చునకైన కానరావు. చే, చేత, మాత్రమే ప్రయుక్తమగును. నన్నయ భారతమున, తృతీయావిభక్తి యందు రెండును ప్రయుక్తములై యున్నవి. కనుక నంతకుముందు తో, తోడ అనునవి ప్రత్యయములక్రింద పరిగణితములు కాలేదనియు వానికి ముందు చే, చేత మాత్రమే ప్రత్యయము లనియు, క్రమముగా తో, తోడలు తృతీయావిభక్తిగా పరిగణితము లయ్యె

ననియు నూహింపవచ్చును. ఆంధ్రభాషాభూషణమున 'తోడ' తృతీయా విభక్తిలో నీయబడియుండలేదు. కావున క్రమముగా లక్ష్యగ్రంథముగ భారతమునుండి యీప్రత్యయము వ్యాకరణములలో తరువాత పరిగణితమ కాదగును. కావ్యాలంకారచూడామణిలో (14వ శతాబ్దమున) చేతకు, 'తోడ నామాంతరముగా నిచ్చియున్నాఁడు. కాని 14వ శతాబ్దము తరువాత నేటివఱక రచితములైన యేయుదాహరణములలో, తో, తోడ ప్రత్యయము ఉ యుక్తము కాలేదు. కావున "తోడ" 14వ శతాబ్దమువఱకు తృతీయావిభ ప్రత్యయముగా పరిగణితము కాలేదనియు, నిది యుదాహరణములుగావున నా నియమము ననుసరించి, ప్రాచీన సంప్రదాయము ననుసరించి, తో వెలసిన ప్రత్యయమే రచయిత లుపయోగించి, యీప్రత్యయ చరిత్రమునక తోడ్పడినారని తెలియఁగలదు.

ఇట్లు తెలుఁగులో తృతీయావిభక్తి ప్రత్యయములలో 15వ శతా వఱకు, తో, తోడలు పరిగణితములగుటకు నవకాశమే లేకపోగా, నాంధ్రశ చింతామణిలో "తోడ సహార్థేలూసః"-అని (కారకపరిచ్ఛేద) సూత్రింపఁబడ టయు, దానిని రచించినవాఁడు నన్నయ భట్టనియు వాదించుట యెంత య మంజసమో, విచక్షణులగు విద్వాంసు లూహింపగలరు. శాసనపద్యములల గూడ తో, తోడలు లేవని ముందుదహరించిన దానిని బట్టి గ్రహింపనగున

## చతుర్థీ విభక్తి, కై, కొఱకు

ఇట్టిదే చతుర్థీవిభక్తిప్రత్యయము. కై-కొఱకు-అనునవి. ఇందుల 'కొఱకు' అనునది-కావ్యాలంకార చూడామణిలో నామాంతరముగా చతుర్థి జెప్పఁబడుటచేతను, నంతకుమున్ను ప్రయోగములు కానరాకుండుటచేతన నాంధ్రభాషా భూషణమున చెప్పబడి యుండకపోవుట చేతను, వ్యుత్పత్తినను రించి "కొఱకు" అని యొక స్వతంత్రపదమును నొకప్రత్యయము గలిగిన సమస్తపదమగుట చేతను, నిది విభక్తికాకపోయినను, తరువా కావ్యములలో ప్రయోగములు కానవచ్చుటచేతను, నవీనవ్యాకరణముల

నిదియును విభక్తిగా నంగీకరింపఁబడినది. ఇది యుదాహరణములయందెంత మాత్రమును ప్రయుక్తము కాలేదు. నన్నయ భారతమున లేదు - శాసనములలో లేనేలేదు. అయినను, కై-కొఱకు "కొఱకు కయి చతుర్థ్యాస్తః" అని ఆంధ్రశబ్ద చింతామణియందు సూత్రింపఁబడినదనియు, నది ప్రాథమిక వ్యాకరణమనియు, నది నన్నయకృతమనియు, వాదించువారింకను గలరు!

బసవోదాహరణములోఁ జతుర్థీవిభక్తికి "కునై" "కినై" అను ప్రత్యయము లుపయుక్తములైనవి. ఇది వాస్తవముగా కున్ + ఐ కిన్ + ఐ = (కునయి) (కినయి) అనునవి-కాగా 'ఐ' లేక 'అయి' అనునదియే చతుర్థీవిభక్తి ప్రయుక్తము. ఈ ప్రత్యయము తక్కిన యుదాహరణములలో ప్రయుక్తముకాలేదు. నీకునై-చేరుటకునై అను ప్రాచీన ప్రయోగములు గలవు. కావున సోమనాథుఁడు దీని నుపయోగించియున్నాఁడు. కాని తెలుఁగునకు సంబంధించిన వ్యాకరణములలో తక్కిన వానివలె లాక్షణికులు దీనిని నిరూపించ లేదు. దీనికి కారణము 'కొఱకు' అను విభక్తిప్రత్యయముపై నొక్కొక్కప్పుడు, సిద్ధించుకొఱకునై-మర్దించుకొఱకునై అని వచ్చుచుండుట చేత దీనిని ప్రత్యేకింప లేకపోవుటయే యని యూహింపవచ్చును. మొదట 'కొఱకు' విభక్తి కానప్పుడు దానిపై వచ్చిన ప్రత్యయమును మాత్రము విభక్తిగా నెట్లు పరిగణింతురు? కాని ప్రాచీన కాలమున నిట్టి చతుర్థీవిభక్తిరూపమున్నట్లును, నది యుదాహరణముల మూలముననే తెలియవచ్చుచున్నదని మనము గ్రహింపవచ్చును. ఇట్టి వానివలన వీని ప్రత్యేకత తేటపడును.

త్రిపురాంతకోదాహరణమున "కై" అనునది నియతముగా ప్రయుక్తమై, ఆవెనుక "కై" ప్రత్యయమే తక్కిన వానిలో గ్రహింపబడినది. ఒక్క కృష్ణోదాహరణమున నప్పకవి దీని సంప్రదాయమును విస్మరించి పప్పులో యడుగువైచినాఁడు. అది ముందు తెలుపుదును. ఉదాహరణములలో విభక్తిప్రత్యయములు పద్యములయందు పాదాంతముల భాసిల్లనేరవు. కళికోత్కళికయందు మాత్రమే భాసిల్లును. అందును కళికలో ప్రతి పాదాం

తమునను, ఉత్కళికలో చివరి రెండు పాదముల యందును భాసిల్లవలెను.
దీని కుదాహరణముగా నీ క్రింది విభక్తి నిచ్చుచున్నాఁడను.

చ॥ వసిగొని యెవ్వఁడేని బసవా యను నీ సుకృతాక్షరత్రయం
బెసగఁబఠించెనేని గిరిజేశుని కాతని వక్త్రగహ్వరం
బసదృశగేహమన్న యవి-యార్యులవాక్యము లట్లుకావునన్
బసవనఁ బుణ్యమూర్తిఁదలపంగదె చిత్తమ! పాయకెప్పుడున్

కళిక

వెండియును భక్తాభివృద్ధిఁ జెంచినవాని
బండమాయావాదపథము ద్రుంచినవాని
అద్వైత వాక్యసంహారుఁడై చనువాని
విద్వత్తములగెల్చి వీరుడయి మనువాని
మీమాంసకుల ముక్కు మిగుల గోసినవాని
తామసధ్వాంతంబు తగులు బాసినవాని
పెక్కుదైవంబులని పేరు మాపినవాని
ఒక్కడేరుద్రుఁడని యుక్తిఁ జూపినవాని

ఉత్కళిక

ప్రకృతివాదముఁ దుడిచి
వికృతవేషము లుడిచి
సకలవాదుల నోర్చి
సుకృతవాదము దీర్చి
భూమిభారము మాన్ప
గామించుగతిఁ జూప
నెమ్మి జాలినవాని
మమ్ము నేలినవాని

పై యుత్కళికలో చివర రెండు పాదంబులలో ద్వితీయావిభక్తి భాసించినది. తక్కిన వానిలో పాదాంతమున విభక్తిప్రత్యయము లేనేలేదు. పై పద్యమును ద్వితీయావిభక్తిప్రత్యయము చివర కది గురువు అంతమునందు గల పద్య మగుటచే నిలుచుట కవకాశమేలేదు. ఇట్లే ప్రథమావిభక్తికూడ వృత్తము లలో నిలువదు. ప్రథమ ద్వితీయా విభక్తుల ప్రత్యయములు రెండింటియందు యక్షరములు లఘువులు. కాని తృతీయావిభక్తి ప్రత్యయము చే, చేతలలో మొదటి అక్షరములు గురువులు. కాని 'నే' అనునది గురువైనను, స్వత్వ మగుట చేతను, ద్రుతాంతముగ నుండినగాని శ్రవణసుఖదముగ నుండక పోవుట చేతను, శ్రుతిమనోహరమగు తెలుఁగు భాషకు నిట్టిపద్ధతి యస్వా భావికమగుటచే, దీనిని ఉదాహరణ పద్యములలోకవు లుపయోగింపలేదు. దీనివలన 'చే' ప్రత్యయము మొదల ద్రుతాంతము కాదనియు, (ఒరుచేపడవు), మొదలగు తిక్కనాది మహాకవుల ప్రయోగములచే నదికళగానే యుండె ననియు, నన్నయ ప్రయోగములలోగల 'చేన్' అను దాని ననుసరించి తరు వాత నిది ద్రుతాంతముగా నెన్నబడియెననియు నూహింపవచ్చును. ఇక 'కై' ప్రత్యయము.

బసవోదాహరణమున చతుర్థి 'కునై, కినై'అను ప్రత్యయములతో నున్నట్లుముందు తెలిపితిని. త్రిపురాంతకుఁడు తనయుదాహరణములోఁజూపిన విశేషమేమనఁగా తక్కిన తృతీయాదిప్రత్యయముల యందువలె నుత్కళిక యందు చివర రెండు పాదములయందే గాక, తక్కిన పాదములారింటియం దును దీనిని చూపియున్నాఁడు.

పద్యమున - "త్రిపురాంతకదేవునకై నమస్కృతుల్" అని చూపి కళికయందు - శృంగారికినై.

హారికినై
బావకునై
త్రోవకునై
జోగికినై

త్యాగికినై
దేవునకై
భావునకై

అని సోమనాథుని కునై, కినై, ప్రత్యయముల నుపయోగించి చివఱ రెండు పాదములలో మనకు నేటివఱకు నిలిచియున్న 'కై' ప్రత్యయముతో ముగించి నాఁడు.

మరియు నుత్కళికయందు –

కడు దీనతతో ముదితాపసికై
వడి నింటికిఁ జని వెడకప్పెరగై
కొని యాలుమగల పెనురచ్చలకై
చనుదెండని నిక్కము సేయుటకై
వెనుద్రిప్పిన గుండములోపలఁ గై
కొని చను యెప్పటి రూపముఁగై
కొని గుండయ మెచ్చిన వేల్పునకై
వినతపితా మహాఫణితల్పునకై"

అని యన్నిపాదముల యందును నీ ప్రత్యయము పాటించినట్లుగా రచియించి యున్నాఁడు.

విభక్త్యాభాస సంప్రదాయము

కాని వాస్తవముగా తాపసికై, రచ్చలకై, సేయుటకై, వేల్పునకై, తల్పునకై, అను చోట 'కై' విభక్తి ప్రత్యయముగాని, తక్కిన చోట్ల, కప్పెర కై కొని · లోపలఁగై కొని రూపముఁ గై కొని మున్నగువానిలోని "కై" విభక్తి ప్రత్యయ మెంతమాత్రమును కాదుకదా! ఇది కేవల శబ్దగత మే యైనను, దీనిని ప్రతిపాదాంతమున నుపయోగించి, యాపాదాంతము చతుర్థ్యం తముగాఁ దోపింపఁజేయుట యనునది యొక సంప్రదాయముగా తరువాతి యుదాహరణములందెల్ల పాటింపబడినది. ఈ సంప్రదాయమును గూర్చి కావ్యాలంకార చూడామణిలో విన్న కోట పెద్దన –

అంత్య చాతుర్థికళికోత్కళి కాఖ్యఁజూడఁ
బడి చతుర్థియుఁబోలె చూపట్టవలయు

—4 - ఉ. 18 పద్యము

అని చెప్పియున్నాఁడు. ఇది పై త్రిపురాంతకోదాహరణమునుఁ గూర్చిన చతుర్థీవిభక్తి పద్ధతినుండియే పెద్దన గ్రహించినాఁడనియు నంతకు ముందీ పద్ధతి యనఁగా సోమనాథుని కాలమున లేదనియు మనము గ్రహింప వచ్చును. ఇచ్చట విభక్తి ప్రత్యయము చివరభాసించి, తక్కినచోట్ల, ప్రత్యయరూపముగనే భాసించి, విభక్తి కాకపోయి, విభక్తి యనుక్రమ కలుగఁ జేయుటయే "విభక్త్యాభాస మనియు"నది చతుర్థీ విభక్తియందు మాత్రము తప్పక చూపవలయుననియు, కావ్యాలంకార సంగ్రహమున (నరసభూపాలీయమున) నిట్లు చెప్పఁబడియున్నది.

కం॥ కలికోత్కలికలు పద్యము
లలరారు విభక్తులం దదాభాసయుతో
త్కలికలు సజయతిపదమౌ
నల మానిని మొదలుగా నుదాహరణంబుల్.

కం॥ అందు విభక్త్యాభాసము
లందుఁ జతుర్థికిని; తెనుఁగు దాహరణము పెం
పొందు గలికోత్కలికల
సందీప్త విభక్తి తాళసప్రాసంబై.

ఇందు స్పష్టముగా చతుర్థీ విభక్తియందు మాత్రమే విభక్త్యాభాసము గలుగుననియు, నందు నుత్కలికయందే యొక దానియందు విభక్త్యాభాసముండుటచే "నాభాసయుతోత్కలికలు" అనియు చెప్పఁబడియున్నది. పై నరసభూపాలీయపద్యము విన్నకోట పెద్దన సంప్రదాయమునను సరించి సరిగా నున్నది. అయినను నీ నడుమ కావ్యాలంకార సంగ్రహమునకు (నరసభూపాలీయమునకు) బృహద్ వ్యాఖ్యరచించిన శిరోమణి సన్నిధానము సూర్యనారా

యణశాస్త్రిల వారు, వారి వ్యాఖ్యానములో పై 'అందువిభక్త్యాభాసము' అ
పద్యముదాహరించుచు, యిట్లు వ్రాసియున్నారు. (పుట 247)

"ఈ పద్యము యొక్క యర్థమస్పష్టము....ఆంధ్రమున....మరియు
విభక్త్యాభాసాంకితములైన వాక్యములుగల యుత్కళికలును లేవు".

పై వ్రాఁతవలన విమర్శకశిరోమణులకు నుదాహరణ సంప్రదాయమే
తెలియలేదని చెప్పనగును. వారిట్టి విభక్త్యాభాసాంకితములైన యుదాహర
ణములను చూచినట్లు 254 పుటలో వారిచ్చిన యుదాహరణపట్టికలోని
"త్రిపురాంతకోదాహరణమే" సాక్ష్యము. మఱియు పరిశీలన లేకుండ వారిట్లు
వ్రాయుటయేగాక యుదాహరణ లక్షణమును గూర్చి చర్చించినపుఁ డప్పకవి
యుదాహరణము ప్రమాణముగా గ్రహించుటచేత, వారిభిప్రాయములు మఱి
యును తల క్రిందులైనవి. పై పద్యము యొక్క యర్థమస్పష్టముగాదు.
వారికే యస్పష్టమగు నభిప్రాయముగలుగుటచే నర్థముచేసికొనలేక
పోయినారు.

అప్పకవి తనకుముందుఁ మూఁడు దాహరణములలో త్రిపురాంతక,
వేంకటేశ్వర, హనుమోదాహరణములలో నీవిభక్త్యాభాసములు కనుపట్టు
చుండఁగా. నరసభూపాలీయమున నది లక్షణముగా జెప్పబడగా అప్పకవి,
తనయుదాహరణమున దీనిని పాటింపకపోవుట యతని పరిశీలనలోపమేగాని
వేఱొండుగాదు. అప్పకవి వెనుకఁ బుట్టిన శేషార్యోదాహరణమున నిది
పాటింపఁబడుటచే నట్టిలక్షణము విస్మరించుట అప్పకవితప్పుగా నెన్ననగును.
అట్టి తప్పులక్షణము నిచ్చినగ్రంథమును ప్రమాణీకరించుట యంతకన్న
గొప్పతప్పిదము. అప్పకవి చతుర్థీవిభక్తి యుత్కళికలో –

"తొలిపుట్టువు నోముఫలంబున వే
బలువిడి నగుపేదఱికంబున వే
సరికొందలమందుచు పయనంబై "

... ... ...

అని యిట్లు వ్రాసి, చివర పాదములలో
"కలిమిచ్చిన బాలస్నేహునకై
కలుములచే నేలినకృష్ణునకై "
అని యీ సంప్రదాయము మఱుఁగు పఱచినాఁడు.

NILKANTH

ఒక్క చతుర్థీవిభక్తికే యిట్టి ప్రాధాన్యమేందులకని మనకు సందేహము గలుగవచ్చును. గాని యిట్లు చెప్పుటచేతనే తెలుఁగు కవు లుదాహరణములలో నొక విశిష్టమైన శాస్త్రీయ సంప్రదాయమును నిలిపినవారని మనమెంచవలసియున్నది.

తిక్కన శాంతిపర్వమున భీష్మధర్మజసంవాదమున విష్ణు మంత్ర ప్రభావముగూర్చి చెప్పుచు (4 ఆ-213) లో

"ప్రణవపూర్వకమగు నమఃపదము పొంత
షడ్గుణైశ్వర్యవాచక సర్వవసన
నిర్వచనశబ్దములు క్రమనిష్ఠమెయి చ
తుర్థి గూర్పంగ మంత్రంబుఁ దోచు బెరసి."

అని చతుర్థినిఁ గూర్చిన సంప్రదాయము వివరించినాఁడు. ఉదాహరణము స్తోత్రరూపమగు గ్రంథమగుటచేతను, నది భగవంతునిఁ గూర్చియే ప్రధానముగ రచితమగుటచేతను, నిందు విభక్తిప్రత్యయములే నియతములగుటచేతను, చతుర్థిని నీ నియమము ప్రాచీన కవులు పాటించిరని తెలియుచున్నది.

## చ తు ర్థి

తెలుఁగునగల నీ విభక్త్యాభాస సంప్రదాయము చిక్కదేవరాయోదాహరణమున సంస్కృతమునఁగూడ పాటింపఁబడినది. విద్యానాధుని ప్రతాపరుద్రీయమునఁగూడ దీనికి లక్షణము వివరింపబడినది.

## క లి క

అపిచ నూత్నరత్నఖచిత హర్మ్యరచిత తోషణాయ
విపులతర సమస్తదాన విహితవిబుధ పోషణాయ

సర్వచంద్ర చంద్రికావిభాసి కీర్తిమండనాయ
సర్వదేవతా వితాన సన్నుతారి ఖండనాయ

ఉత్కలికా

సమరసమయ విహితమాయ
విమతకుమత రాడపాయ
కరణపటుత రోగ్రసాయ
కరణ కరణ చణ దుపాయ
ఫలితమహిత జయనికాయ
విలసదతి మనోజ్ఞకాయ
కలిత వివిధ భూషణాయ
లలిత సరస భాషణాయ

పై వానిలో మొదటి యాఉపంక్తులలోను విభక్తి ప్రత్యయములేదు గదా! ఇది తెలుఁగు ననుసరించి విభక్త్యాభాసమేయని చెప్పనొప్పును.

మఱియు నీసందర్భమున తెలుఁగునకు తక్కినద్రావిడ భాషలలోవలె చతుర్థీవిభక్తియం దొక్కటే ప్రత్యయమను విషయమును మనము మఱువరాదు.

"తక్కిన విభక్తులలో వివిధ ప్రత్యయములనొకటే యర్థమున ద్రావిడ భాషలో వాడవచ్చునుగాని, చతుర్థీ ప్రత్యయము మాత్ర మొక్కటే యున్నది."

"ఆయా ద్రావిడభాషలయందు ద్వితీయా, తృతీయా, పంచమీ సప్తమీ విభక్తులందు వివిధార్థములతో వివిధ ప్రత్యయము లున్నవి; కాని చతుర్థికి ప్రత్యయ మొక్కటి మాత్రమున్నది." అని కాల్డువెల్లు ద్రావిడ భాషా సామయిక వ్యాకరణము.

దీనినిబట్టి తెలుఁగున చతుర్థీ విభక్తికి రెండు ప్రత్యయములు లేవనియు 'కొఱకు' అనునది విభక్తికాదనియు, నదివిభక్తిగా పరిగణింపక,

తెలుఁగు వ్యాకరణమగు నాంధ్రభాషా భూషణమున నిచ్చుట శాస్త్రీయమై యున్నదని గ్రహింపనగును. కావ్యాలంకార చూడామణిలో నది విభక్తికి నామాంతరముగా గ్రహింపబడుటయు పై యభిప్రాయమును బలపఱచు చున్నది.

చిన్నయసూరి బాలవ్యాకరణమున "కయి - కొఱకు" అని 'కై' ప్రత్యయమును రెండు లఘువులుగా నిరూపించినాఁడు. ఇది "కొఱకు కయి చతుర్థ్యాస్తః" యాంధ్ర శబ్దచింతామణి సూత్రము ననుసరించినది. కాని యిచ్చట 'కయి' అని గ్రహించిన మాత్రాగణ ప్రధానములగు సీసగీతాది పద్యములలో నెట్లయిన సరిపోవునుగాని యక్షరగణ ప్రధానములగు శార్దూలాది వృత్తముల నెట్లు సరిపోవును ? "నీకై వాక్పూజలొనర్తు." అని పాదమాదియందు, "హరికై" యని పాదముచివఱను రెండు లఘువులుగా నెట్లు వీనిని సమర్థించుటయో దురూహ్యము. ప్రాచీన ప్రయోగములు చూడక చిన్నయసూరి ఆంధ్రశబ్ద చింతామణినే యాధారముగ గ్రహించినందువలన యిట్టి యవ్యవస్థ యేర్పడెనని చెప్పనగును. బాలవ్యాకరణ వ్యాఖ్యాత లెవరును దీని నీవఱకు తాఁకలేదు. కై ప్రత్యయమునకు నన్నయ కాలములో కు + ఐ = కై అని స్వరయతియే కలదు. తరువాతి కవులు స్వరయతితోఁబాటు 'కై' అను నేకాక్షర మేర్పడిన వెనుక దీనికి వ్యంజనయతి కూడఁ బాటించిరి. 41 రకముల యతులను బేర్కొనిన గొప్పకవియగు నప్పకవి దీనిని జాఱవిడచినాఁడు. చూడుడు :

(1) తే, అనఘ ! మామామ శకుని నాకయి గడంగి.

—(సభా. 2-174 ఆనందప్రతి)

(2) " గాన యెంతవారికైన "

—భాగ. 7-3 పద్యము.

పంచమీవిభక్తియందు 'వలన' అను ప్రత్యయము తప్ప తక్కినవి, "కంటె", "పట్టి" యుదాహరణములలో ప్రయుక్తము కాలేదు. షష్ఠీవిభక్తి

యందు 'కు' ప్రత్యయమేగాని, యొక్క, లో, లోపల, వాడఁబడలేదు. సంబోధనలయందు 'ఓ' యనునది ప్రయుక్తము కాదు.

ఉదాహరణములలో పై వాడుకలనుబట్టి చారిత్రకముగ విభక్తి ప్రత్యయముల చరిత్రమును భాషాతత్త్వ సంప్రదాయానుసారముగ తెలిసికొనుటకు మనకెంతయేని యవకాశము కలదు. తెలుఁగు వ్యాకరణముల క్రమపరిణామముగూడ తెలిసికొనుటకుఁ దోడ్పడును.

---

## సంస్కృతోదాహరణములు వాని లక్షణములు

సంస్కృతమున మనకు లభ్యములైన నాలుగుదాహరణములలో నన్నియు తెలుఁగునగల నుదాహరణ లక్షణములే ప్రాయికముగా గలిగి యున్నవి. దీనికి కారణము తెలుఁగులో నుదాహరణములు పుట్టినతరువాత సంస్కృతమున దానికి లక్షణ మేర్పడుటయే యని చెప్పనొప్పును. 12 వ శతాబ్దమున పాల్కురికి సోమనాథుఁడు బసవోదాహరణములను, తెలుఁగు సంస్కృతములలో వ్రాసిన వెనుక క్రీ. 1320 ప్రాంతమున సుప్రసిద్ధాంధ్ర దేశీయాలంకారికుఁడు విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయమున నుదాహరణలక్షణ మిట్లు చెప్పి యున్నాఁడు.

అథ క్షుద్ర ప్రబంధా నిరూప్యంతే—
యేన కేనాపి తాళేన గద్యపద్యసమన్వితమ్।
జయత్యుపక్రమమ్ మాలిన్యాదిప్రాసవిచిత్రితమ్॥
తదుదాహరణం నామ విభక్త్యష్టక సంయుతమ్।

యత్రాదౌ జయత్యుపక్రమం మాలిన్యాదివృత్తం రమ్యం పద్యం నిబధ్యతే అనంతరమపి చేత్యుపక్రమమాణ అష్టవాక్యాని సప్రాసాని సతాళాని ప్రతివిభక్తి నిబధ్యంతే అనంతరం విభక్త్యా భాసాఃతదుదాహరణమ్.

వ్యాఖ్యానములో - అథ *క్షుద్రప్రబంధేషూదాహరణస్య లక్షణమాహ యేనకేనేతి తాళేన చంచత్పుటాదినా గద్యైః క్రమేణ కలికోత్కలికా పర పర్యాయై ర్విభక్త్యాభాసాంకితై ర్వాక్యైః పద్యం ప్రతివాక్యమాదౌ తత్త ద్వాక్య సమానవిభక్తి నాయకనామాంకిత శ్లోకైశ్చ సమన్వితమ్.

మాలినీనామ వృత్తవిశేషః 'ననమయయయుతేయం మాలినీ భోగి లోకైః' రితిలక్షణాత్ - అత్ర లక్షణస్య న్యూనత్వాత్ వర్తమాన పదానాంచ సంకీర్ణత్వా దుభయం వారన్ వ్యాచష్టే."

పై యుద్ధృతాంశమువలన నుదాహరణములు మాలినీ వృత్తము తోడను, జయతి యను నుపక్రమముతోడను నుండవలెననియు, నెనిమిది వాక్యములు లేక పాదములు తాళానుగుణములు కలిగినవి యుండవలెననియు, అవి కళికలనియు నందులో సగ ముత్కళికలనియు, నివి గద్య పద్యము లలో నుండుననియు నివి విభక్తులు తొలుత నేది చెప్పబడునో, అది యే పద్యము, కళిక యుత్కళికల యందుండుననియు, నొకచో విభక్త్యాభాసము వెలయవలయు ననియు తెలియుచున్నది.

సంస్కృతోదాహరణములు పై దాని ననుసరించి మాలినీ వృత్తము తోడను, జయతిపదముతోడను ప్రారంభమగుచున్నవి. తక్కిన కళికోత్కలి కలయందు విభక్తులు సక్రమముగా పాటింపబడినవి. ఇంతవఱకు నిట్లు తెలుఁగుదాహరణలక్షణము ననుసరించినను నా వెనుక రెండింటికి కొంత భేద మగపడుచున్నది.

## సార్వ విభక్తికము

తెలుఁగునందున్న ఉదాహరణములలో అష్టమీవిభక్తి చివఱ సార్వ విభక్తి స్వరూపమున నొక పద్యమున్నది-ఇది విద్యానాథుఁడిచ్చిన యుదా

* ఇచట క్షుద్రమనగా అల్పకావ్యమని యర్థము-మహాకావ్యముకన్న భిన్నమైనది చిన్న యైనది అని అభిప్రాయము. క్షుద్రశబ్దమునకు తేనెపట్టు-తేనెటీగ అని అర్థమున్నది. క్షుద్రము నుండి వచ్చిన క్షౌద్రము మధురత్వమునకు నాదమగు తేనె కర్థము. అప్పుడు క్షుద్రప్రబంధ మనగా మధుర ప్రబంధము అని అర్థము చేసికొనుట యొప్పునుగదా

హరణలక్షణమున లేదు. కావుననే వ్యాఖ్యాత కుమారస్వామిసోమయాజి పై లక్షణ వ్యాఖ్యానములో యింతకు ముందిచ్చిన దాని వెనుక –

"యత్వేత్యాదినా అత్ర సంబోధన విభక్తి రష్టమీ ప్రబంధాంతే సర్వ విభక్త్యంకితో నవమశ్లోకశ్చేత్యాది విశేషాణామేసాక్షి శ్లోకా సాహిత్య చింతా మణౌ ద్రష్టవ్యాః" అని ప్రత్యేకముగ చెప్పినాఁడు.

ఈ సార్వవిభక్తిస్తవపద్యము పాల్కురికి సోమనాథుని సంస్కృత బసవోదాహరణమునం దున్నది – తెలుఁగు బసవోదాహరణమున కూడ నున్నది. విద్యానాథు డీలక్షణము నెట్లు విస్మరించెనో తెలియదు. ఈసార్వ విభక్తిస్తవము తెనుఁగులో నుదాహరణమునకు ప్రత్యేకలక్షణముగా నున్నను, సంస్కృతమున కులశేఖ రాళ్వారు ముకుందమాలలో నిట్లు సార్వవిభక్తిక ముగా నొక శ్లోకమున్నది.

కృష్ణో రక్షతు నో జగత్త్రియగురుః కృష్ణం నమస్యామ్యహం
కృష్ణే నామరశత్రవో వినిహతాః కృష్ణాయ తస్మైనమః
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోస్మ్యహం
కృష్ణే తిష్ఠతి సర్వమేతదఖిలం హేకృష్ణ ! రక్షస్వ మామ్॥

కులశేఖరుఁడు సోమనాథునికిఁ బూర్వుఁడు. *ఉదాహరణములలో సోమనాథుడే యీసార్వవిభక్తికస్తవమును నెలకొల్పెనని యూహింపనగును.

మఱియు నీ సార్వవిభక్తిక పద్యవిశేషమును సాహిత్యచింతా మణి యను నలంకారశాస్త్రమునఁ జెప్పఁబడిన దని వ్యాఖ్యాత తెలిపినాడు. సాహిత్య చింతామణి తెలుఁగుదేశపు రెడ్డిరాజును, సర్వజ్ఞబిరుదాంకితుఁడును శ్రీనాథుని కాశ్రయుఁడును నగు పెదకోమటి వేమభూపాలుఁడు రచించినది. ఇది సంస్కృతమైనను, దేశీయములగు రచనలఁగూర్చి, కృతికర్త తెలుఁగురాజ గుటచే, విశేషముగఁ దెలిపినాఁడు.

---

* కులశేఖరుని తరువాతి వాఁడును క్రీ. శ. 6 వ శతాబ్దమున నున్నవాఁడును యగు భట్ట బాణకవి తన కాదమ్బరి యందు యీ విభక్తి నియమము నొకచో పాటించియున్నాఁడు.

## అంకితాఁకిత పద్యము

ఈ సార్వవిభక్తిక స్తవమే గాక - అంకితాంక పద్యము కూడ పై వ్యాఖ్యయందు చెప్పఁబడియుండలేదు. ఇదియును సోమనాథుని సంస్కృతో దాహరణమునఁ జెప్పఁబడియున్నది - తెలుఁగునఁ జెప్పఁబడియుండలేదు. సంస్కృతో దాహరణము చివర—

ఆర్యా :— శ్రీ బసవరాజగుణమణి
ఖచితమ్ జయతాత్ సువర్ణమేతత్
సోమసుకవినా రచితమ్
హృదయాభరణమ్ సదాముదాహరణమ్

అని అంకితాంకపద్యము చెప్పఁబడినది.

తెలుఁగున నుదాహరణములో బసవోదాహరణములో నిది లేక పోవుటచే త్రిపురాంతకోదాహరణమున నంకితాంకపద్యము లేదు. కాని తరువాతిదేయగు వేంకటేశ్వరోదాహరణమున -

ఉ॥ ఆరవితారకంబుగ నుదాహరణంబు రచించె భక్తి వి
స్తారతఁ దాళ్ళపాకపుర శాసనుఁ డన్నయ తిమ్మయార్యు డిం
పారఁగఁ జక్రనందక గదాంబుజుధారికి శ్రీవధూమనో
హారికి, వేంకటా చల విహారికి శౌరికి నంకితంబుగన్.

అని కవిపేరు కృతి పతిపేరు, ఉదాహరణములోఁ జెప్పఁబడినవి. దీనిని తరువాత కవులందఱు ననుసరించిరి.

ప్రతాపరుద్రీయ వ్యాఖ్యానములో నీ యంకితాంకపద్యమును గూర్చి యిట్లు చెప్పియున్నాఁడు.

అంతే కవి ప్రబంధనామాంకితాంక పద్యవిశేషం కుర్యాత్తదుక్తమ్ 'అంతేఽనుష్టుభ మార్యాం వా కవికృత్యాఖ్యయాన్వితాం । కుర్యాచ్చాటు ప్రబంధానామయం సాధారణో విధిః.

[ప్రతాపరుద్రీయము-కావ్యప్రకరణము. పుట 83 వావిళ్ళ ముద్రణాలయము 1927].

సాహిత్యచింతామణి యందిదియును చెప్పఁబడియుండుటచేత, పెద కోమటి వేమభూపాలుఁడు విద్యానాథుని లక్షణమును దేశీయపద్ధతులను గమనించి సంస్కరించి విశేషము చూపించినవాఁడని చెప్పఁదగును. ఈతనికి సోమనాథుని యుదాహరణమే లక్ష్యము. ఈ యంకితాంక పద్యమును సోమనాథుని కృతిలోని విశేషమే. కావున సోమనాథుఁడు, దేశీయవాఙ్మయమగు ద్విపదలోనే కాక, ఉదాహరణ వాఙ్మయములోకూడ ప్రత్యేకతను నిరూపించి, తరువాతివారికి మార్గదర్శకుఁ డయ్యెను.

సంస్కృతమున, యతిప్రాసలు నిర్బంధములు కాకపోవుటచేత సోమనాథుఁడాభాషాలక్షణము ననుసరించి వానిని పాటింపలేదు. తరువాతి సంస్కృతోదాహరణమగు, చికదేవరాయోదాహరణమున, మాలినీ, కలికోత్కలికలలోను, శివోదాహరణమున నన్నింటి యందును యతిప్రాసలు పాటింపఁబడినవి.

పాల్కురికి సోమనాథునికి ముందు సంస్కృత భాషలో నతిప్రాచీన కాలమునుండి యుదాహరణములున్నట్లు నీవఱకే సూచించితిని. కానియట్టి యుదాహరణ మొకటియేని, యుదాహరణమున లభ్యముకాలేదు. మొత్తమీద తెలుఁగున నున్నన్ని యుదాహరణములు సంస్కృత భాషలో లేవనియే చెప్పనగును.

1. భరత నాట్యశాస్త్రమున—

శ్లో॥ గుర్వాదిరథ లఘ్వాదిర్యుగ్మస్సర్వలఘుస్మృతః ।
చతుర్మాత్రాగణా జ్ఞేయాః పూర్వచ్ఛందోవికల్పనాః ॥
పాతోర్ధ కలికాన్ పాతాన్ కుర్యాల్లఘ్వక్షరేషు చ ।
గుర్వక్షరే తాలగీతపాతాస్తు కలికా స్మృతాః ॥

—31 అధ్యాయము 317–18 శ్లోకములు.

ఇందర్ధ కలికయన నుత్కలిక.

2. కావ్యాలంకారసూత్రవృత్తిలో వామనుఁడు—
గద్యం వృత్తగంధి చూర్ణముత్కలికాప్రాయం చ
పద్యభాగ వద్వృత్తగంధి
అనావిద్ధలలితపదం చూర్ణమ్
విపరీత ముత్కలికాప్రాయమ్.

దీనిపై గోపేంద్రతిప్పభూపాలుని కామధేనువ్యాఖ్య—

ఉత్కలికాప్రాయమితి - ఉత్కలికా ఉత్కంఠా. 'ఉత్కంఠోత్కలికే సమే' ఇత్యమరః. ఉత్కలికాయాః ప్రాయః ప్రయోగ బాహుల్యమ్ యస్మిం స్తత్ ఉత్కలికాప్రాయం గద్యమ్ యస్మిన్ శ్రూయమాణే శ్రోతౄణా ముత్కంఠా బహుళా భవతీత్యర్థః. యద్వా కలికాశబ్దోఽత్ర లక్షణయా రుహిరుహికాయాం వర్తతే ఉల్లసంతీ కలికాం రుహికాం ప్రైతి ప్రాప్నో తీత్యుత్కలికా ప్రాయమ్. యత్ర పదసందర్భపరిపాటీ కాండోపకాండ సందోహశాలినీ. కలికే వోల్లసతి దదుత్కలికా ప్రాయమిత్యర్థః.

3. కేదారభట్టు వృత్తరత్నాకరమున—ఉక్తిచ్ఛందోభేదము.
ప్రథమమపరచరణ సముత్థం శ్రయతి యదిసలక్ష్మ
ఇతరదితరగదితమపి, యది చ తుర్యమ్
చరణయుగళమవికృతమపరమితి కలికాసా.

పైవానిలోఁ గొన్నింటిని వివరించుచున్నాఁడను.

1. వృత్తగంధి - పద్యభాగము గలది-దీర్ఘసమాసములు గలది.

2. చూర్ణము - అల్పసమాసములు గలది - ఇదియే చూర్ణిక.

3. ఉత్కలికా - దీర్ఘసమాసరచనము గలది. వృత్తగంధికిని దీనికిని భేద మేమనిన, రెండును దీర్ఘసమాసరచనములే యైనను, నొక దానియందు వృత్తభాగము స్పష్టముగా కానవచ్చును. ఉత్కలిక యందు కానరాదు.

ఉత్కలికలు దీర్ఘసమాసరచనము లగుటచేతను, ద్రవిడభాషలోని దగు తెలుఁగున దీర్ఘసమాసరచనము భాషాతత్త్వమువలన కుదురుపడక పోవుట

చేతను, నుత్కళిక యేకసమాసముగా నుండవలయునను నియమ ముదాహరణములలో పేర్కొనఁబడినది. తెలుఁగున నేకసమాసము. క్త్వార్థక్రియలతో నడిపి, చివఱ సమాపక క్రియతో నంతము నొందించి విభక్త్యంతముగాఁ జేయుటవలన నేర్పడును.

ఉదాహరణములలో నిట్లే యేకసమాసరచనము గావింపఁబడినది. పంచమీ విభక్తియుత్కళిక. (త్రిపురాంతకోదాహరణము).

తన కినుకలోఁ బుట్టి
కనలి దక్షునిఁ గొట్టి
యడరి వేల్పులఁ బఱచి
తొడరి జన్నము చెఱచి
వీరభద్రుఁడు వచ్చి
జేరి మ్రొక్కిన మెచ్చి
యలరు నిత్యునివలన
దళితదైత్యునివలన.

ఇచట సమాపకక్రియతోనున్న వాక్యము నేకసమాసముగా నుదాహరణముల కవులు వాడియున్నారు.

గద్యములనఁగా నిట్టిరచనలే కాని నేటి వచనము లెంతమాత్రమును గావు. ఈ గద్యలే ప్రాచీనకాలమున వచనములుగాఁ బరిగణితములు. చూడుఁడు:—తాళ్ళపాక వారివచనములు-ఇవి వేంకటేశ్వరవచనము లనుపే బరగుచున్నవి. ఇవి యన్నియు రాగములతో, తాళములతోఁ బాడఁదగినవి. స్పష్టతకొఱకు నొక యుదాహరణము చూపుచున్నాను.

"శ్రీ వేంకటగిరిదేవా! నాదేహంబు నీవుండెడి నిత్యనివాసంబు: నాజ్ఞానవిజ్ఞానంబులు నీ యుభయపార్శ్వముల దీపంబులు. నా ముకుఁ జెఱమ యూర్పులు నీ యిరుదెసలం బట్టెడి యాలవట్టంబులు. నా మనోరాగంబు నీకు జంద్రకావివలువ; నీకు మొక్క నెత్తిన చేతులు రెండును మరకతతోరణ

బులు; నాభక్తియే నీకు సింహాసనంబు; నామేనం బొడమిన పులకలు నీకు గుదులు గ్రుచ్చి యర్పించిన పూదండలు; నేమిమ్మునుతించిన నుతులయక్షర రవంబులు భేరీఝాంకార ఘంటికా నినాదంబులు నాపుణ్యపరిపాక ఫలంబులు నీకు నైవేద్య తాంబూలాదులు; మదీయ నిత్య నివాసమయ నీరీక్షణంబులు నీసర్వాంగంబుల నలందిన తట్టుపునుంగు; నా సాత్త్వికగణంబు నీకు ధూపపరిమళంబు; నీవు దేవదేవుఁడవు నేనర్చకుండను; ఈరీతి నిత్యోత్సవంబు నాయందు నవధరింప శ్రీ వేంకటేశ్వరా! మఱియు

ఇదియే గుజ్జరి - యేకతాళిగా పాడఁదగిన కీర్తన—

శ్రీ వేంకటగిరిదేవా! నాదేహంబు నీవుండెడి నిత్యవాసంబు

నాజ్ఞాన విజ్ఞానంబులు నీయుభయపార్శ్వంబుల దీపంబులు

నాముకుఁ జెఱమల యూర్పులు నీయిరుదెసలం బట్టెడి యాల వట్టంబులు

నామనోరాగంబు నీకు చంద్రకావి వలువ

... ... ... ...

ఈ రీతి నిత్యోత్సవంబు నాయందునవధరింప 'శ్రీవేంకటేశ్వరా![1]' ఇట్లే 'ఏగంటివారి' వచనములని, చిలుకపాటివారి వచనములని యున్న రచనములన్నియు సంకీర్తనలుగా రాగతాళములతో పాడఁదగినవియే కాని, నేడు మనము వ్యవహరించు 'వచనము' అనునది యెంత మాత్రమును కాదు. వచనము లిట్టి వృత్తగంధులగుటచేతనే కొందఱు ప్రాచీనకవులు తాము పద్యకావ్యములు వ్రాసినను వానిని వచనములని పేర్కొనినారు. హరిభట్టు ఉత్తరనారసింహపురాణమున నిట్లే చెప్పినాడు. లోకేరావు సోమన శివరాత్రిమహాత్మ్యమును వచనకావ్యముగా రచియించితినని తన

1. (The Minor works of Tallapakam Poets - Annamacharya & his sons - వైరాగ్యవచన మాలికాగీతలు. పుట 93.

బలభద్ర విజయమునఁ జెప్పుకొన్నాఁడు. అది పద్యకావ్యము – [1]"అఁ శివరాత్రిమహత్త్వము తెలుఁగు వలనుగా వచనకావ్యము చేసినాఁడ" అని యాతనివాక్యము.

మఱియు తిక్కన నిర్వచనోత్తరరామాయణమున—

వచనము లేకయు, వర్ణన
రచియింపఁగ గొంతవచ్చుఁ బ్రౌఢులకుఁ గథా
ప్రచయము పద్యములన పొం
దుచితంబుగఁ జెప్పు టార్యులొప్పిద మనరే. (1–15)

అని చెప్పిన పద్యములో వచనమనగా నిట్టి సమాసభూయిష్ఠమై వృత్తగంధితో గూడిన గద్యరచన యని మనము తెలుసుకొనఁదగును.

తిక్కనకుముందు గద్యపద్యమయములగు చంపూకావ్యములు వెలసినవి. అందును వస్తువిస్తరములగు ప్రబంధరీతిగల విశేషవర్ణనాత్మకములునై, దీర్ఘసమాసభూయిష్ఠములునునగు కావ్యములు గలవు. తిక్కనతాత మంత్రి భాస్కరుఁడు రచియించిన రామాయణమున వచనములు దీర్ఘసమాస సంపూర్ణములై యున్నవి. దానికి కారణము అటవీవర్ణనము మున్నగువాని యందు గద్యము శోభించినట్లు పద్యము శోభింపదను నాలంకారికోక్తిని బట్టి (యదాహి అటవీవర్ణనాదౌ గద్యం ప్రగల్భతే – సరస్వతీ కంఠాభరణము). ప్రాచీనులైన తెలుఁగుకవు లిట్లు వ్రాసియుందురనియు, తరువాతనది శిష్టాచారమయ్యెననియు నూహింపఁదగును. [2]సమాస రచనము తెలుఁగునకు స్వాభావసిద్ధము కాదనియే తిక్కన 'అలతియలతిఁ పదములకాహల సంధించిన, విధమున నా పథకమును వీడి జాతీయమగు తెలుఁగు కవితరచనను సృష్టించినాఁడు.

1. తంజావూరి పుస్తకభాండాగారము – గ్రంథసూచి సంఖ్య 306 పుట 95.

2. బమ్మెర పోతన భాగవతమున గజేంద్రమోక్షణమున 'అది మఱియు మాతులుంగలవంగ చూతకేతకీ భల్లాతకామ్రాతక పనస' ఇత్యాది గద్యతో కూడి యుండుటపై సంప్రదాయము ననుసరించినది.

తిక్కనకుముందు వెలసిన తెలుఁగు మహాకావ్యములలో నన్నయ భారతభాగము, నన్నెచోడని కుమారసంభవము ముఖ్యమైనవి.

వీనిలో నన్నయ భారతభాగమున వచనము వ్రాసినను నది వృత్తగంధిగానే రచియించియున్నాఁడు. దానికి నొకటి రెండుదాహరణముల నిచ్చుచున్నాను.

"వ. ఇట్టి మహోత్పాతంబులు పుట్టిన *.........

కం. ఇట్టి మహోత్పాతంబులు
పుట్టిన.........

వ. అని కుంతియును మాద్రియును...సీ. అని కుంతియును మాద్రియును ..." అని సీసపద్యము ఇక నన్నెచోడుఁడు, వచనమును శబ్దాలంకారములతో సమాసభూయిష్ఠముగా రచియించినాఁడు. కాఁబట్టి తిక్కన యా పథకమును వీడి దేశీయపద్ధతిని కృతిని నిర్వచనముగ రచియించినాఁడు. కావున తిక్కన "వచనము లేకయ వర్ణన రచియింపఁగ" అనుచో నచ్చట వచనమన ప్రాచీన సంస్కృత సంప్రదాయ రచనానుసారులగు గద్యలేయని గ్రహించవలెను. తిక్కన కవితను నామూలముగ జీర్ణించుకొన్న విద్వత్కవి మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నకవి తన బిల్వేశ్వరీయమును నిర్వచనోత్తర రామాయణమువలెనే రచియించి తన్మార్గదర్శియగు తిక్కన నిట్లు ప్రశంసించినారు.

ఉ. పేరిడి పద్యకావ్యమని పెద్దఁగ గద్దెను బెంచి నించి యా
పేరు నిరర్థకంబుగను వెంపఱఁ జేయుటకన్న మున్నె యా
దారిని గాదటంచు దగ ధన్యుఁడు మాన్యుఁడు తిక్కయజ్వ దా
నేరిమిఁజేసె నిర్వచన నిష్ఠను నుత్తరరామ సత్కథన్.

ఇంతియేకాక మనము దేశిరచనలనుకొనుచున్న ద్విపదలు, శతకములు, రగడలు మున్నగువానిలో వచనము లుండుటకే యవకాశము లేదుగదా!

---

* చూడుఁడు. ఆంధ్రవచన వాఙ్మయము పుట. 5.

ఇక చంపూపద్ధతి (గద్యపద్యమయము) సంస్కృత సంస్కారము పొందిన దేశిరచనయగుటచే తిక్కన యా పథకము వీడి ప్రాచీన సంస్కృతకావ్య సాంప్రదాయము ననుసరించి, రఘువంశాది కావ్యములవలె, నిర్గద్యము గను తెలుఁగున కావ్యరచనకు మార్గదర్శకుఁడయ్యెను. మఱియు నీ పద్ధతి జాతీయమగుటచే తిక్కన, తాను నిర్వచనోత్తర రామాయణములో తెలుఁగున విశేష ప్రచారములోనున్న కందము, తేఁటగీతి, ఆటవెలఁది, సీసము, చంపకము, ఉత్పలము, మత్తేభము, శార్దూలము, ఆశ్వాసాంతమున మాలిని తప్ప తక్కిన వృత్తములుగాని జాతులుగాని వాడనే లేదు. ఇచట తిక్కన తక్కిన వృత్తరచన చేయకుండుటకు కావ్యరచనా పథకమునిట్టి నూతన మార్గమునకు ద్రిప్పుటకేగాని, యతనికి తక్కిన వృత్తరచనముచేయుట యసాధ్యమని కాదు. భారతమున నట్టిరచన తనకు సాధ్యమని తిక్కన చూపియే యున్నాఁడు.

పైనుదాహరించిన విషయమునుబట్టి గద్యపద్యమయములగు చంపువులు మన భాషలో మార్గకవితలో దొలుత వెలసెననియు, నుదాహరణములో గద్యపద్య కవిత లంతకుముందు చాలకాలము క్రిందటనే వెలసియుండవలెనని తెలియుచున్నదికదా. దేశి కవితకు సంబంధించినదొకటియు మార్గకవితకు సంబంధించిన దొకటియు గలిసి తొలుత గ్రంథరూపమున కానవచ్చుచున్నవి. కాన తెలుఁగులో తొలి గ్రంథరూపము లుదాహరణములేయని చెప్పనొప్పును.

---

## ఛందస్సు - రగడలు

ఉదాహరణమున నుపయుక్తములగు రగడలు మాత్రాచ్ఛందస్సునకు సంబంధించినవి. ఈ రగడలు తెలుఁగులోఁ బ్రాచీనకాలమునుండి యున్నట్లు తెలియుచున్నను వీనికి తెలుఁగులో ప్రథమచ్ఛందో గ్రంథమని చెప్పఁ దగిన కవిజనాశ్రయమున లక్షణము లేదు. తరువాత విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో నిట్లు చెప్పినాఁడు.—

కం ॥ సరియౌ పదిరేకులచేఁ
బరువడి నుత్సాహవృత్త పదయుగళముచే
నిరవుగ వడి ప్రాసంబుల
నరుదుగ రచియింప రగడ యగు తగు వృత్తిన్.

—చతుర్థోల్లాసము. 40 పద్యము.

కాని పై లక్షణ మసమగ్రము - రగడలనుగూర్చి విపులముగాఁ జెప్పిన వాఁడు అనంతుఁడు. ఆతఁ డీక్రింది విధములను పేర్కొనినాఁడు.

రగడలక్షణము :—

కం ॥ ఆద్యంత ప్రాసంబులు
హృద్యంబుగ రెంటరెంట నిడి పాదము లు
ద్యద్యతులఁ గూర్పఁదగు నన
వద్యంబగు రగడలందు వారిజనాభా !

1. హయప్రచార రగడ లేక తురగవల్గన రగడ—

హనచతుష్టయంబు ఋతుల
జనతయతులఁ జరగుఁ గృతుల
జను హయప్రచార రగడ
వినుతశాస్త్రవిదులు బొగడ.

శ్రీసతీశుఁ బరమపురుషుఁ జిత్తమున దలంచువారు
వాసవాది నిఖిలదివిజవంద్యు నాశ్రయించువారు
నిటజనింప రనఁగ నన్వయించుఁ దురగ వల్గనంబు
పటు దినేశ లఘు విరామ భానుమద్గణాష్టకంబు.

పై లక్షణములో హనచతుష్టయమనఁగా 4 హగణములు (గలములు) 4 నగణములు = 3 లఘువులు నొక పాదము నందుండుననియు నది రెండు భాగములనియు నొక్కొక్క భాగమున 4 గలములు = గ = 2 లఘువులు కావున హగణము 3 లఘువులు 4 × 3 = 12 లఘువు లుండుననియు రెండు పాదములు చేర్చినపుడు దినేశలఘువు అనఁగా 12 వ లఘువు దాటినవెనుక యతియనియు

ననంతుఁడు చెప్పినాఁడు. మఱియు నొక్కపాదమున 12 లఘువు లున్నప్పు డాఱవ యక్షరము (ఋతువిరామము) పై యతి యని చెప్పినాఁడు. లక్షణము నందు 'జనితయతులఁ - జరగుఁగృతుల' అనునది దీనిని ధృఢపఱచును. అనంతుఁడు లక్ష్యమున రెండు పాదము లొకటిగాఁజేసి, లక్షణమున నొక పాదమే చూపుటచే నా రగడ ప్రాచీన సంప్రదాయము తెలిసికొనుటకు వీలు కలుగుచున్నది. సంగీత శాస్త్రమున లఘు వనఁగా మాత్రయని నిర్వచనము.

కం॥ మాత్రయన నొక్కలఘువగు
మాత్రాద్వయమైన గురుసమాహ్వాయ మయ్యెన్
మాత్రాత్రయంబు ప్లుతమగు
మాత్రార్ధము ద్రుతము భరత మతమునఁ జెలఁగున్.

—తాళ్ళపాక అన్నమయ్యగారి సంకీర్తన లక్షణము 36 పద్యము.

కాఁబట్టి మూఁడేసి మాత్రలకు విఱుగుచు నడచు నీ రడగ త్రిస్రగతికి సరిపోవును - [1] త్రిస్రమనఁగ మూఁడుమాత్రలు లేక మూఁడక్షరములకాలము. దీనికి నుదాహరణము - మఱియు, మఱ్ఱి, మ్రాని, మొదల - మరగి యున్న గురునిచేత - ఇచట మఱ్ఱి, మ్రాని, ఉన్న, చేత అను వానిలో గురువును రెండు లఘువులుగా నెన్నవలెను. దీనిలో తొలి భాగము - మఱియు మఱ్ఱి మ్రాని మొదల - అనునదియే మొదట హయప్రచార రగడ భాగమని 6 వ యక్షరము యతి తెలుపుచున్నది-మఱియు సాధారణముగ జనపద వ్యవహార మున నున్న పదములే యిట్టి రచనల కాధారము లగుటచేత నీ భాగము 12 అక్షరముల పాదములో 6 అక్షరములు గల పాదమే దీని మూలమని యీ క్రింది వ్యవహారములలోనున్న పాట వరుసవలె నుండు మాటలు వ్యక్తపఱచుచున్నవి.

ఏమి చెట్టు కడిమి చెట్టు
ఏమి కడిమి

1. సంగీతమున దీనికే త్ర్యశ్రమని వ్యవహారము.

పై దానిలో—ఏమి చెట్టు
కడిమి చెట్టు.

అనునపుడు ద్వితీయమగు నను[ప్రాసగూడ పాటింపఁబడినది. ఇందును నాపేసి లఘువులే. కాబట్టి తెలుఁగు భాషకు స్వతస్సిద్ధమగు నిట్టి జనపద గేయముల నుండియే మన సంగీత సాహిత్యములు బయలు వెడలినవని తెలిసికొనఁ దగును. దీని సంగీత సం[ప్రదాయమును తెలిసిన నీ విషయ మింకను స్పష్ట మగును. మాత్ర యనఁగా నొకలఘువని సంగీతశాస్త్ర సం[ప్రదాయమని యీవఱకుఁ జెప్పఁబడినది - లఘువనఁగా మాత్ర. ఈ మాత్ర స్వరసం[ప్ర దాయము ననుసరించి, రెండు [ద్రుతములు గలది. ఈ [ద్రుతమునకు సంగీత శాస్త్రమున తాళమునకు నక్షరమని పేరుండుట చేతను 6 [ద్రుతములు లేక, 6 అక్షరముల కాలముగల రూపకతాళము దీనికి చెప్పఁబడినది. కాఁబట్టి యే రంగరాట్ ఛందస్సులో చెప్పబడిన రూపకతాళము సరిగానున్నది.

2. విజయమంగళము-పై హయ[ప్రచార రగడ లేక తురగ వల్గనము రెండుపాదము లొక దానినిగాఁ జేసి, యట్టి రెండుపాదములకు ప్రాసపాటించుట-

[శ్రీధరాయ శిష్ట జననిషేవితాయ భక్తలోక
జీవితాయ గర్వితోరు సింధురాజ బంధనాయ
గాధిపుత్రయజ్ఞ విఘ్నకర మహాసురీ మహో[గ
కాయ శైల దళననిపుణ ఘనసురాధిపాయుధాయ
కేశవాయ తే నమోస్తు కృష్ణ కృష్ణ పాహి యనుచుఁ
కేలు మొగిచి మౌళి నునిచి కృష్ణు బలికె ననుచు నిట్లు
దేశభాషణములఁ జెప్ప ద్విగుణ తురగవల్గనమునఁ
దేరు విజయమంగళంబు తీయచెఱకు రసము నట్లు.

ఈ రగడ హయ[ప్రచారమునకు రెట్టింపుగావున నిందును మూఁడు మాత్రలకు విఱుగును. కావున దీనికిని రూపకతాళమే చెప్పఁబడినది.

3. ద్విరద గతిరగడ—

శ్రీయువతి నిజయువతిఁ జేసి యెంతయుమించి
కాయజునిఁ దనతనయుఁగా నెలమిఁ బాటించి
సకలదేవతలఁ బరిజనులుగా మన్నించి
ప్రకటగతి శ్రుతులనుతి పాఠకులఁ గావించి
హరియొప్పు ననవొప్పు నవతార లఘువిరతి
శరధితగనలల భలసలతరల ద్విరదగతి.

ఇది 5 మాత్రలు లేక లఘువులకు విఱుగునది. శ్రీయువతి, నిజయువతి జేసియెం, తయుమించి. (2 లఘువులు = 1 గురువు) 5 × 4 = 20 మాత్రలు కావున అవతారవిరతి. అనఁగా 10 అక్షరముపైని 11 వ అక్షరము యతి. దీనికి జంపెతాళము. ఇది ఖండగతిని నడచునది. అనఁగా 5 అక్షరములకు విఱుగుచు నడచునది.

లయగ్రాహివృత్తమునకు మూలము. ద్విరదగతి రగడ - జయభద్ర రగడ. ద్విరదగతి రగడ యందు నొక పాదమునకు పది మాత్రలు లేక పది లఘ్వక్షరము లుండును.

శ్రీయువతి నిజయువతిఁజేసి యెంతయు మించి
కాయజుని తన తనయుఁగా నెలమిఁ బాటించి.

ఇందులో ప్రతి రెండు పాదములకు ప్రాసయునంత్యాను ప్రాసనియమమును పాటింపఁబడును. ఇట్టి పాదము లెనిమిది యుదాహరణములో నుండును. పై రెండు పాదము లొక్కొక్కటిగా చేర్చినచో నీ క్రింది విధముగ నుండును.

శ్రీయువతి నిజయువతిఁజేసి యెంతయుమించి కాయజుని తన తనయుగా నెలమి పాటించి.

'సకల దేవతలఁ బరిజనులుగా మన్నించి ప్రకటగతి శ్రుతులనుతి పాఠకులఁగావించి' ఇది జయభద్ర రగడయైన రెండేసి పాదములకు ప్రాసము పాటింపబడును.

శ్రీకి నొడయం డనఁగఁ జిత్తజుని గురుఁడనఁగ
శేషశయనుం డనఁగఁ జెలువుగఁ జతుర్భుజుఁడు
నాకౌకసులనేలు నముచిసూదనుపూజ
నతఁడు దా గైకొన్న నందగోపాత్మజుఁడు
ఇతనిఁ గొల్చినఁగాని యిహపరంబులు గలుగ
జతురమతు లొనరింప జయభద్ర రగడ
లిటు సద్ద్విరద గతి రెంటఁ జాటింపులుం బెంచు.

ఈ జయభద్ర రగడలో నాలుగింటికి నొకే ప్రాసపాటించిన లయగ్రాహి యగును. అంత్యాను ప్రాసలుండవు. నాలుగు పాదములొకే ప్రాసతో నున్నవి. ఏ పాదమున కాపాదము విడివడకుండ నుండుటచే వృత్తమైనది. మఱియు సర్వమును ప్రాసయే గాని రగడకువలె యతి నియమము లేదు. కాబట్టి లయకు సరిపోవును. లయను గ్రహించునది గావున లయగ్రాహి అయినది.

లయగ్రాహి

తాళగతి గీతిరుతి-మేలి తతవాద్యరుతి
సాలరసవంతముఖ-యోలినులి యంద
త్తాలగతి మెట్టుచును గేలఁజరులిచ్చుచును
జాలి యనురాగమున గ్రాలుచుసుఖాబ్ధిం
దేలుచును మేమఱచి వ్రాలుచును గెత్తుచును
లోలగతి నేత్రభుజ చాలనలతోఁ బ్రే
తాలయము నందుసుఖలీల నెఱసంజ నను
కూలగతినాడు శివుకాలి నుతియింతున్. కు. సం. 2-101

ఇది ఖండగతిని 5 మాత్రలకు విరుగునది. పై లయగ్రాహికిని ద్విరద రగడకు సర్వప్రాసమును, పాదము విడివడకుండ నుండుటయు తప్ప వేఱుభేదము లేదు. కావున కావ్యవాఙ్మయమునకు ముందే రగడ లున్నవని ఉదాహరణము లున్నవని గ్రహింపనగును.

4. జయభద్ర రగడ—

శ్రీకి నొడయండనఁగఁ జిత్తజుని గురుఁడనఁగ
శేషశయనుం డనఁగఁ జెలువుగఁ జతుర్భుజుఁడు
నాకౌకసుల నేలు నముచిసూదనుపూజ
నతఁడు దాఁగైకొన్న నందగోపాత్మజుఁడు
ఇతనిఁగొల్చినఁగాని యిహపరంబులు గలుగ
వితరసేవలననఁగ నెసగు నివ్విభుఁడంచు
జతురమతులొనరింప జయభద్రరగడ
లిటు సద్ద్విరద గతి రెంటఁ జాటింపులుంబెంచు.

ఇది ద్విరదగతిరగడకు రెట్టింపుగాన 21 వ అక్షరము యతి. జంపెతాళము.

5. మధురగతి రగడ —

శ్రీవనితాధిపుఁ జేరి భజింపుఁడు
భావజజనకుని భక్తిఁదలంపుఁడు
అని గగనలభస లను నాల్గిటఁగృతి
జను గజలఘు విశ్రమము మధురగతి.

ఇది 4 మాత్రలు లేక లఘువులతో విఱుగుచు నడచునది. శ్రీవని, తాధిపు, జేరిభ, జింపుఁడు = (2 ల = 1 గ) 4×4 = 16 మాత్రలు గావున గజవిశ్రమము అనఁగా 8 వ అక్షరముపైని విశ్రమము. దీనికి ఏకతాళము. ఇది చతురస్రగతిని నడచును. అనఁగా నాలుగక్షరములకు విఱుగును. ఏకతాళమునకు తాళాంగము 4 అక్షరములకాలము. అనఁగా సంగీతసంప్రదాయమున నొకలఘుకాలమున 2 అనుద్రుతములు+2 ద్రుతములుండును. సంగీతము స్వరప్రధానముగావున, 4×4 = 16 అవి సాహిత్యమున వర్ణములు గావున 4 అక్షరముల కాలమైనది.

6. హరిగతి రగడ—

శ్రీరామాకుచకుంకుమ పంకము
చేఁబొలుపగు విపులోరః ఫలకము
తార తుషార పటీరసమానో
దకవాహిని యొదవిన పదకమలము
అతిశయమై యలవడునే దేవుని
ననవరతోదారత నాహరిగతి
ఇతరులకలవడదని నృపలఘుయతి
నిభననలగ భభసల నగును హరిగతి.

ఇది మధురగతి రగడకు రెట్టింపుగావున - నృపయతి - 16 అక్షరములపైని చెప్పఁబడినది. తాళము-ఏకతాళము.

7. వృషభగతి రగడ—

శ్రీమనోహరు నంబుజోదరు
చిత్తజాతగురుం దలంచెద
కామితార్థవిధాయి నిర్జిత
కాళియాహిని నాశ్రయించెద
ననువుగా భగణములు భానుస
మన్వితద్వితయములు నాలుగు
ననిమిషాధిప లఘుయతి నిడగ
నలరు వృషభ గమనము మేలగు.

ఇది మిశ్రజాతికిఁ జేరినది. అనఁగా నేడుమాత్రలకు లేక లఘువులకు విఱుగునది. శ్రీమనోహరు - నంబుజోదరు - చిత్తజాతగు - రుందలంచెద $7 \times 4 = 28$ కావున అనిమిషాధిప యతి అనఁగా 14 వ అక్షరము పైయతి. ఇది మిశ్రగతి - త్రిపుటతాళము.

8. హరిణగతి రగడ—

శ్రీనివాసుభజింతు నేనని
పూని కుజనుల పొంతఁబోవని
భానుయుత నలభసగగంబుల
లోన విరుదోలును నగంబుల
నిరవుగా నిరుమాఱు లఘువుల
నెల్లవారును నొగి గణింపఁగ
విరతులను గావింప నిమ్మల
హరిణగతి చెలువగు జగమ్ముల.

ఇది వృషభగతిలో నగము—

శ్రీనివాసు భజింతు నేనని
పూని కుజనుల పొంతఁ బోవని.

ఇందు 7 అక్షరముపైన 8 అక్షరము యతిపాటింపఁబడినది.

అనంతుఁడిచ్చిన రగడ లక్షణములలో లఘువులపైని విశ్రమము చెప్పినాడు. ఇది ప్రాచీన సంప్రదాయ పద్ధతి ననుసరించినది. తొలుత చతుర్మాత్రాపద్ధతిని మాత్రాచ్ఛందస్సులు ప్రస్తరింపబడినవి. ఆపైని అక్షర గణములలోని శ్రుతిసౌఖ్యము కొఱకు చతుర్మాత్రా పద్ధతిని విడిచి నలములను విడచి గగములను చేకొనిరి. అనంతుఁ డీరెండు మార్గములనుకూడ పైలక్షణములలోఁ జూపినాఁడు. ఇందలి యతి సంగీతశాస్త్రమున చెప్పఁబడినదియే సాహిత్యమున కెక్కినది. ఇది యొక్కటియే తెలుఁగు భాషకు, సంగీత సాహిత్యములకుగల యవినాభావసంబంధమును తెలుపఁజాలును. యతిస్థానమందు సాజాత్య వర్ణమున్న శ్రుతిహితముగనుండుట యీ కారణమువలననే యని యెన్నఁనగును.

రగడలు, నన్నయభట్టు భారతభాగముననుు, నన్నిచోడుఁడు కుమార సంభవమున నుపయోగింపకపోయినను, తరువాతి కవులు వీనిని చంపూకావ్య

ములనఁదగిన ప్రబంధములలో వాడుకచేసిరి. రగడలు కన్నడమున క్రీ. శ. 840 ప్రాంతముననే వర్ధిల్లుచున్నట్లు కవిరాజమార్గము తెలుపుచున్నది. క్రీ. శ. 940 లో పంపమహాకవి లలిత, మందానిల రగడల వాడియున్నాడు. క్రీ. శ. 990 ప్రాంతమున నాగవర్మ ఛందోంబుధియందు లలిత, మందానిల, ఉత్సవ అను మూఁడు విధములగు రగడల నిచ్చియున్నాఁడు. వీనిలో మందానిలము తెలుఁగున మధురగతికి, లలిత ద్విరదగతికి, ఉత్సవ, తురగవల్గనరగడలకు సరిపోవును. తెలుఁగున ప్రథమచ్ఛందోగ్రంథమని చెప్పఁదగిన కవిజనాశ్రయమున నీరగడ లక్షణములు లేవు. క్రీ.శ. 1402 ప్రాంతమున కావ్యాలంకార చూడామణిలో నలఁతిగను అనఁగా ఉత్సాహ ద్వితీయ రగడ గలదు. క్రీ. శ. 1435 లో అనంతుని ఛందస్సున సంపూర్ణము గను విపులముగను నీ రగడలకు లక్షణము చెప్పఁబడినది. దాని ననుస రించియే తరువాతివారును లక్షణములను రచియించిరి.

సంస్కృతమున రగడ ప్రచారమునలేదు. ఇది దాక్షిణాత్య సంస్కృత కావ్యములయందు మాత్రము కన్పట్టుచున్నది. క్రీ.శ. 9 వ శతాబ్దినాటి సోమదేవసూరి 'యశస్తిలక' చంపువున రగడలుకలవు. అందొక రగడ వచనభేదముగా ముద్రితమైనది. (చూ. యశస్తిలక చంపువు-నిర్ణయ సాగర ముద్రాక్షరశాల 1916 పుటలు 15-16.)

"వికచ కర్ణోత్పలస్పర్ధి తరశేక్షణాః కేళితాళక్వణత్కనకమయ కంకణాః సరసనఖరాజివిస్ఫురిత భుజమండలాః కాంచికోల్లాసవశదర్శితోరుస్థలాః స్వైరసంజల్పసస్మేరబింబాధరాః కర్ణకండూమిషోత్క్షలిత కక్షాంతరాః పృథుని తంబస్థలల్లటహాగతి విక్రమాః సహజ శృంగార రసభరితముఖవిభ్రమాః."

పై వచనమును—

వికచకర్ణోత్పల స్పర్ధి తరశేక్షణాః
కేళితాళక్వణత్కనక మయకంకణాః
సరస నఖరాజివిస్ఫురిత భుజమండలాః
కాంచికోల్లాస వశదర్శితోరుస్థలాః

స్వైరసంజల్పసస్మేర బింబాధరాః
కర్ణకండూమిషోత్కలిత కక్షాంతరాః
పృధునితంబస్థలల్లట హగతివిక్రమాః
సహజశృంగారరసభరిత ముఖవిభ్రమాః

ఇది తెలుఁగున ద్విరదగతిరగడతో సరిపోవుచున్నది. రెండేసి పాదముల కనుప్రాసము పాటింపఁబడినది. మాత్రాగణప్రధానములగునవి యిట్టివి యశస్తిలకచంపువున గలవు. ఇవి దేశీయచ్ఛందోవిశేషములగుటచే కేవల సాంస్కృతికుఁడగు యశస్తిలక వ్యాఖ్యాతకు వీని విశిష్టత గోచరించలేదు.

తెనుఁగున రగడలు ప్రత్యేకముగ వందలకొలఁది చరణములతో నుండును. చక్రపాణి రంగనాథుని నయనగతిరగడ లేక శివభక్తిదీపిక యంతయు రగడయే - ఇట్లే నమశ్శివాయరగడ - కొన్నివందల చరణములు గలది - ఈ రెండును నేడు ప్రత్యేకముగ ముద్రితములైనవి.[1]

రగడలు నవీనప్రబంధములలో పుష్పాపచయము చేసినప్పుడు వర్ణితమగును. కాని ప్రాచీన కాలములో నవి దైవస్తుతిపరములు. శ్రీనాథుఁడు కాశీఖండమున మణికర్ణికాప్రశంస రగడలో చేసియున్నాఁడు. నాగూలూటి శేషనాథుఁడు తన పర్వతపురాణమున రగడలు వ్రాసి యున్నాఁడు. తరువాతి ప్రబంధములలో పుష్పావచయ వర్ణనమున నీరగడ నియతముగాఁ బ్రయుక్తమగుట ప్రాచీనకాలమున లేదు. పుష్పాపచయసమయమున నాడుచు బాడుచు యువతులుందురుగాన నట్టి సందర్భమున గానయోగ్యములగు నీరగడల నుపయోగించిరని తోచుచున్నది.

రగడలు తొలుత శాసనములందు ప్రయుక్తములైనవి. కన్నడదేశమున చాళుక్యశాసనములలో నివి గానవచ్చుచున్నవి. తెలుఁగు దేశమునను తొలుత నిది శాసనములయందు కాననైనట్లు రాజరాజ నరేంద్రుని

1. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు - తిరుమల వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయ సంచిక - 7 సం. 1 పుటలు. (17-40)

కోరిమిల్లి శాసనమున గుర్తించితిని. ఇది సంస్కృతభాషా మయమైనను, దేశిరచన యగుటచేతను మనము ముఖ్యముగా పరిగణింపఁ దగినది. ఇది కావ్యములలో తరువాత ప్రయుక్తమగుట చేతనే, దీనిని దేశిరచనక్రింద పరిగణింపవలెననియు, నవియేప్రత్యేకముగ నుపయుక్తములగుటచే, నుదాహరణరచనము కావ్యరచనకంటె ప్రాచీన మనియు స్పష్టమగుచున్నది.

కన్నడమున నంతకుముందు కావ్యములలో వెలసిన నన్నయ నన్నెచోడులిరువురును దానిని గ్రహింపక పోవుట యాశ్చర్యముగ నున్నది. ఒక భారతమువంటి పురాణమున నన్నయ కవకాశము లేక పోయినను, ప్రబంధ వర్ణనలఁ బాటించిన నన్నెచోడుఁడు తన కుమారసంభవమున దీనిని గ్రహింపలేదు. ఆనాఁటికి తెలుఁగున నుత్తమ కావ్యరచనలోఁ జేర్చదగిన కొన్ని రగడ భేదములైన యుండితీరును. కాని యానాటికవి యింకను గేయప్రధానములై యుండి యుదాహరణములకెక్కి యుత్తమ కావ్య వాఙ్మయమున ప్రయుక్తము కాలేదని యూహింపనై యున్నది. వాఙ్మయ చరిత్రమున, కావ్యప్రబంధములలో నీరగడలెట్లు ప్రయుక్తములైనవి యిక ముందు వివరించుచున్నాను.

## వాఙ్మయము - రగడలు

ఆంధ్ర చ్ఛందస్సంప్రదాయములలో ద్విపదకువలె, రగడలకును నొక ప్రత్యేక విశిష్టస్థానము గడించినవాఁడు పాల్కురికి సోమనాథుఁడు. ఈతఁడీ ఛందస్సును కన్నడమునుండి గ్రహించి కన్నడమున యతి నియతి లేని, యా ఛందస్సునకు యతినియతి గల్పించి సమానవర్ణాద్యంత ప్రాసలను నిర్ణయించి, దీనినొక మనోహర గేయచ్ఛందస్సుగా తీర్చిదిద్దినాఁడు. తాను ప్రత్యేకముగ కన్నడమున తెలుఁగున రగడలు వ్రాసినాఁడు. అతని గద్య కృతులన్నియు రగడలే.

1. అక్షరాంకగద్య : అపిచ శివశృంగార ఆదిపద విస్తార ఓం

ఇది ద్విరదగతిరగడ - ఖండగతి.

2. నమస్కారగద్య: అపిచ శ్రీప్రమథేంద్రాయనమో
వ్యపగత హృద్గత సాంద్రాయనమః ॥
ఇది మధురగతి రగడ చతురస్రగతి.

3. పంచప్రకారగద్య: ఇందైదు రగడ భేదములు గలవు.

4. శరణుబసవగద్య: అఖిల శైవ ధర్మనిర్ణయావతార శరణుబసవ
వికట భవసమిశ్చ మదహ పీతిహోత్ర శరణుబసవ
ఇది హయప్రచార రగడ త్రిస్రగతి.

5. అష్టోత్తరశతనామగద్య: శ్రీమద్గురు బసవేశ నమస్తే
సామయ భవ నిర్నామ నమస్తే
ఇది మధురగతి రగడ చతురస్రగతి.

కన్నడమున చెన్నబసవ రగడ - హయప్రచార రగడ—
— బసవ గురు వచోమృతగతవ్య జనలెంక చెన్నబసవ.

పాల్కురికి సోమనాథుని సమకాలికుఁడగు చక్రపాణి రంగనాథుఁడు రగడ ఛందస్సును ప్రచారములోనికి దీసికొని వచ్చినాఁడు. ఆతని రగడ కృతులు రెండు లభించినవి.

(1) శివభక్తి దీపిక (లేక) నయనరగడ - (2) నమశ్శివాయరగడ-

1. నయన రగడ :—

ఇది రంగనాథుఁడు శ్రీశైలమునగల శివుని దర్శింపక, శ్రీరంగమునకు బోవగా మార్గమున నాదోషముచే దృష్టి తప్పెను. తన కన్నులు పోవుటకు గారణము, శివుని దర్శింపమియే యని శ్రీరంగనాథుని వలన నెఱింగి, యప్పుడీ రగడనుఁ జెప్ప నాతని కనులకు తిరిగి దృష్టివచ్చెను.

శ్రీశైలవల్లభుని శిఖరంబుఁ బొడగంటి
కాశీపురాధీశు గౌరీశుఁ బొడగంటి
సర్వలోకేశ్వరు సర్వేశుఁ బొడగంటి
సర్వసంరక్షుని సర్వంబుఁ బొడగంటి.

ఇట్లు 342 చరణములలో "కంటి, కంటి" అను అంత్యానుప్రాసతో నీరగడ కలదు - అంతమున -

"దవిన శ్రీరంగ కవి దాతయని పొడగంటి
భువిలోపల ప్రసిద్ధ పుణ్యుఁడనఁగాఁ గంటి
శివభక్తి దీపికా శీతాంశు వనికంటి
శ్రీగిరీశునకు నర్పింతునని పొడగంటి
శ్రీగిరీశ్వరుని కృప చెన్నలర నేకంటి"

ఇది ద్విరదగతి రగడ - ఖండగతి.

2. నమశ్శివాయరగడ :—

నమశ్శివాయ అను మకుటము ప్రతిపాదనమున నుండును.

శ్రీగిరీశవశ్య మంత్ర శేఖరము నమశ్శివాయ
ఆగమోపదిష్ట విధి మహోఖరము నమశ్శివాయ.

ఇట్లిందు 108 పాదములు గలవు.

ఇది హయప్రచారము లేక తురగ వల్గన రగడ - త్రిస్రగతి.

శ్రీగి, రీశ, వశ్య, మంత్ర, శేఖ, రమున, మశ్శి, వాయ-3 లఘువులు.

రగడలు ప్రథమమునుండి దైవస్తుతీ పరములే కావున శ్రీనాథ మహాకవి తొలుత నీ ఛందస్సును కాశీఖండమున, "మణికర్ణికా వృత్తాంతము"న ప్రవేశపెట్టినాఁడు. అచ్చట మణికర్ణికాస్తుతి రగడలో వ్రాసి యున్నాఁడు. కేవలము ప్రత్యేక గేయ రూపముగానున్న నీ ఛందస్సును, కావ్యములో ప్రవేశపెట్టుటలో శ్రీనాథుఁడే మొదటివాఁడు. అదియును దైవస్తుతిపరమే. ఇది పైనమశ్శివాయ రగడవలె ప్రతిపాదమును మణికర్ణికయను మకుటముతో నుండును.

శ్రీమత్కాశీ పుటభేదన లక్ష్మీశ్రుతి మణికర్ణిక మణికర్ణిక
యామవతీ వరచూడామణికిని హారకమలదీర్ఘిక మణికర్ణిక.

... ... ... ...

శ్రీమణికర్ణిక యణిమాదిమహాసిద్ధికారణము సేవకకోటికి
శ్రీమణికర్ణిక నగ్నిబిందుముని సేవింపుమి-పుణ్యాత్ముఁడవయ్యెడు

ఇందు నరువదియైదు చరణము లున్నవి. ఇది హరిగతి యను రగడ. నాలుగు మాత్రలు లేక లఘువులతో నడచును.

1 2 3 4 5 6 7
శ్రీమ, త్కాశీ, పుటభే, దనల, క్ష్మిశ్రుతి, మణిక, ర్ణికమణి, కర్ణి
దీనికి 4 మాత్రల చొప్పున నెనిమిది గణము లుండును గావున 32 లఘువు
అందుచే 16 వ యక్షరముపై యతి అనంతుఁడు ఛందోదర్పణమ
"నృపయతి" యని నాఁడు. నృపులు షోడశమహారాజులు 16 గురు కావ
16 వ యక్షరముపై యతి.

ఇక సంగీత శాస్త్రము ననుసరించి యిది చతురస్రగతిని నడచును. అన
నాలుగు మాత్రలకు విఱుగును. దీనికి తాళమేక తాళము.

ఇది మంచి ప్రశస్త రచనతో నున్నది. కాశీఖండమున షష్ఠాశ్వా
మున 124 వ సంఖ్యగా నున్నది.

వరాహపురాణమున 'పుష్పాపచయ వర్ణనము'న రగడ ప్రయుక్తమైనది.

మందగమన చొరకు చొరకు మావిమావి మోకలెల్ల
నిందువదన మనసువిఱిగి నీడనీడ నిలువనొల్ల (3-92)

ఇది తురగ వల్గన రగడ-32 పంక్తు లున్నవి.
అందే శివస్తుతి యందు రగడ కలదు.

రుద్రజగద్రక్షా దాక్షిణ్య శరణ్య సుధారసపూర్ణ దృగంచల
భద్రగుణైకాశ్రయ మధ్యందిన భానుసహస్ర సమానతనుప్రభ (5-122)

ఇది హరిగతిరగడ—16 పంక్తు లున్నవి.

---

చూ. ఛందస్సు - రగడలు. పుట 70.

దీనియందే శ్రీవాగీశ్వరిస్తుతి-రగడ

శ్రీవాగీశ్వరి సృష్టి వ్యాపిని
భావితనిగమ ప్రకరాలాపిని

... ... ... ....

మంత్రాకారనమస్కృతి నీకును
తంత్ర ఫలప్రద దండము నీకును
చిదమృత సారమ జేజేనీకును
మొదలి దైవతమ మ్రొక్కెదనీకును. (11-26)

ఇదిమధురగతి రగడ — 38 పంక్తు లున్నవి.

తెనాలిరామలింగ కవి "ఉద్భటారాధ్య చరిత్రము" తృతీయాశ్వాసము తుదిని యొక రగడ కలదు. అది శివస్తుతి.

శ్రీకంధర గంధేభ ముఖజనక
శీతాంశు కళాశోభి జటాధర

... ... ... ...

భక్తమానస పరతంత్రత చే
పట్టుము నన్ను గుణత్రయ భాస్వర
భుక్తిముక్తి ఫలదాయక శంకర
భూతేశ్వర యైశ్వర్య వికస్వర. (3-287)

ఇది హరిగతియను రగడ — 38 పంక్తులు.

ప్రభావతీ ప్రద్యుమ్నమునందు

ఓహంసి నీచేతనున్న యది నాబ్రదుకు
నాహృదయమింతి డెందమున నేకముగ నదుకు (5-152)

40 పంక్తులు — ద్విరదగతి రగడ కలదు.

ఉకస ప్రతి :—

రత్నాకరుఁడను వర్తకుఁడు తాను తెచ్చిన విలువగల వస్తువుల చూపునపుడు రగడ ప్రయుక్తమైనది.

దేవ యవలోకింపుమిది తెలిదీపిఁ బొడమిన పద్మరాగము
పావనం బొనరించుఁదను వనపాయరుచినల పుష్యరాగము

... ... ... ...

తీపినల ఖర్జూరములఁ బురుడించునల్లవె యాడపోకలు
శ్రీవెలయు గేదంగి తేకుల చెలువుగల వీపండుటాకులు.

ఇట్లు 40 పంక్తులు గలవు. ఇది వృషభగతి రగడ - మిశ్రజాతి - మాత్రలకు విఱుగునది.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి శృంగార శాకుంతలమున నొక రగడను వ్రాయున్నాఁడు (తృతీయాశ్వాసము). ఇది సేనను నాయత్తపఱచునపు చేసిన వర్ణన.

లలితహృదయము దివిరి లంఘించు నరదములు
కులగిరులనైన ఢీకొను మరుద్వీరదములు.

... ... ... ...

అహితులకు గుండెలల్లాడంగ నంతంత
మహితసైన్యమువచ్చె మానినీ నదిపొంత.

ఇది ద్విరదగతి రగడ - 46 పాదములు-

కళాపూర్ణోదయము ద్వితీయాశ్వాసమున 28 పంక్తులు 'శ్రీరామస్తుతి' పముగా తురగవల్గన రగడ కలదు.

దశరథావనీశ విమలతర తపః ఫలావతార
నిశితశర లఘుప్రయోగ నిహతతాటకావిహార

... ... ... ...

అపాతవిదళనాతిరౌద్ర యార్తపాలనా వినిద్ర
మహిత నిఖిలగుణసముద్ర మమ్ముఁబ్రోవు రామభద్ర (2-158)

దీనియందే అష్టమాశ్వాసమున 'నారాయణస్తుతి' పరముగ మధురగతి రగడ గలదు.

కెందమ్మిల నడకించు పదంబులు
నిందు వైభవము నేలు నఖంబులు
... ... ... ...
నిఖిలవేద వర్ణితు నారాయణుఁ
గొలిచి నిత్యముక్తులు ప్రమదంబున
నలదురక్కడ నతి విభవంబున (8-234)

కనుపర్తి అబ్బయామాత్యుని "కవిరాజమనోరంజనము"న -

తరుణితరుణి సుమాళి యబ్రపుఁ దావిఁ దావిలసిల్లె నత్తఱి
సరయ నరయ తమాని చేకొనరమ్మ రమ్మని పిలిచె బిత్తరి (4-81)

ఇది వృషభగతి రగడ - 30 పంక్తులు - ఏడుమాత్రలకు విఱుగును.

పక్కలంక వీరభద్రకవి "వాసవదత్తా పరిణయము"న పుష్పాపచయ వర్ణనమున రగడ - వ్రాసి యున్నాఁడు.

మదనమంజరి కంటివే యీ మదనమంజరి సొగసు పెంపులు
పొదల రొదలొనరింపు మసమది పొదలుచున్నవి తేఁటిగుంపులు (2-81)

22 పంక్తులు - ఇది వృషభగతి రగడ -
దీనియందే పురుషోత్తమ క్షేత్రమున శ్రీజగన్నాథస్వామివర్ణనము -

జయజయ పారావార సమీపాంచన్నీలాచలకృత నిజమందిర
జయజయ ధీరామరముని చేతస్సరసీరుహ సంచరదిందిర

28 పంక్తులు - హరిగతి రగడ - ఇందు జయజయ శబ్దము ప్రతి పంక్తి యందు గలదు.



"హంసవింశతి" యందు నూటయెనిమిది తిరుపతులను వర్ణించునపుడు రగడ ప్రయుక్తమైనది.

శ్రీవైకుంఠక్షేత్రంబు నందగు వాసుదేవునకు వందనమొనరించి
యామోదస్థలి యందలి సంకర్షణునకుఁ గర్ణాచ్ఛాదనములనిడి
... ... ... ...
ధర నూటెనిమిది తిరుపతులందున నవతారంబులనమరగఁ జేయుచుఁ
గృపతో మమురక్షించెడు రామస్వామికి పదివేల్ సాష్టాంగంబులు.
(4-214)

ఇది హరిగతి రగడ :— కాని యిందు రెండు పాదములలో యతి పాటించి యున్నాఁడు. ప్రాసపాటింప లేదు. హరిగతి రగడ యిట్లుండును.

శ్రీరామాకుచకుంకమ పంకము
చేఁ బొలుపగు విప్రవరోరః ఫలకము
తారతుషార.....................

పై రగడలో మొదటి పాదమున యతి లేదు.

"హంస వింశతి"లో యతి గలదు. ముద్రిత గ్రంథములలో 'మంజుల గతి రగడ'అని కలదు. పైరగడలో విశేషమేమన నమస్కారమునకు నూట యెనిమిది పర్యాయపదము లిందు గలవు.

ఆభరణములు వివరించునపుడు రగడ ప్రయుక్తమైనది.

చౌకట్లు నొంట్లు బేసరులునున్ మొలకట్లు
రాకట్లు చుట్టుంగరములునున్ చేకట్లు.

52 పాదములు — కాని ముద్రిత ప్రతిలో 51 పాదము లున్నవి.

"సురత బంధపు వ్రాత సొగసైన చీటీలు".

అను పాదము క్రింద వేరొక పాదము లేదు (5-360). ఇది ద్విరదగతి రగడ - 5 మాత్రలకు విఱుగును.

రగడను కొందఱు కవులేదేని విషయమును వివరించు పట్టున వాడి యున్నారు.

"పద్యబసవ పురాణము"న పిడుపర్తి సోమనాథుఁడు, బసవేశ్వరుని పురాంగనలు సందర్శించు సమయమున రగడ వ్రాసి యున్నాఁడు.

పుణ్యాంగనలును బురమున గలిగిన
పణ్యాంగనలును బసవనిఁ గనుగొన

... ... ... ...

లైంగిక లీలాలాలసు బలసెన్ -
జంగమ భక్తివంశంబున వెలసెన్. (2-ఆ)

ఇట్లు 120 పంక్తులు గలవు. చతురస్రగతి - హరిగతియను రగడ. శివప్రసాదము వడ్డనసేయు సమయమున రగడ యుపయుక్తమైనది.

ధమ్మయచాల్నిక తరమక మనుచును
ఇమ్మాటకు కానిక దే ననుచును

... ... ... ...

ఉల్బణమతి నిట్లుగ్రుని భక్తుల
కిల్బిషమతి విషకేళి సల్పగను
క్షితిభక్తులు విషకేళి రచించిరి
గతి చెడబోయల గర్వమడంచిరి (7-ఆ.)

ఇట్లు 60 పంక్తులు గలవు.

ఇది మధురగతి రగడ. శివభక్తులతో బోయలు శివప్రసాదమగు విషమును నారగించు సందర్భమున మధురగతి రగడ నుపయోగించుట మనోహరముగ నున్నది. ఇచట విషము మధుర పదార్థముగా మారినదిగదా!

పుష్పాపచయవర్ణన - రగడలు

మనుచరిత్ర :—

నేర్పుమైనల్లయది - నెఱులఁ దొలుపూఁదుఱిమె
దర్పకున కర్పింపఁ - దలఁప దెంతటిపెరిమ. 44 పంక్తులు (3-84)

ఇది ద్విరదగతి రగడ. 5 మాత్రలకు విఱుగునది-ఖండగతి.

వసుచరిత్ర :—

బాల బాలరసాలమిది పిక పాలిపాలిటి యమరసాలము
కేలికేలిడి గ్రుచ్చుఁగడు రాగిల్లుగిల్లుము తత్ప్రవాళము.

34 పంక్తులు-(3-149)

ఇది వృషభగతి రగడ - 7 మాత్రలకు విఱుగునది మిశ్రజాతి

పారిజాతాపహరణము :—

కొమ్మవేగిర మేటికేకొనగోర గోరట విరుల గిల్లుము
తమ్మిపువ్వులమీద జలముల తారతారక యుండజల్లుము

26 పంక్తులు. (4-16)

వృషభగతి రగడ - 7 మాత్రలకు విఱుగునది మిశ్రజాతి.

రాజశేఖర చరిత్ర :—

పట్టుపట్టుమని పడఁతుక చెంగున -
నెట్టుదాఁటెనే యిదిపెలుచంగన - 40 పంక్తులు - (2-149)

మధురగతి రగడ నాలుగు మాత్రలకు విఱుగును.

అచలాత్మజాపరిణయము :—

మధురమధుర నైకపాక మహిత ఫలరసాలసాల
పృథివినధి వసించు మించుపికముఁ జూడవేలబాల

16 పంక్తులు (2-82)

ఇది తురగవల్గన రగడ మూఁడు మాత్రలకు విఱుగునది

బహ్లాణాశ్వ చరిత్ర - వసంతవర్ణన -

అవ్వసంతమఖిలాశాంతములన్
క్రొవ్విరులన్మరుగురు కుంతములన్ 42 పంక్తులు - (2-13)

మధురగతి రగడ - నాలుగు మాత్రలకు విఱుగును.

కట్టావరదరాజు శ్రీరంగమాహాత్మ్యమున :

శ్రీవిరజా నంతరకావేరీసితతరళ తరంగము శ్రీరంగము
పావనమగు మణికాంచన సప్తప్రాకార మయాంగము శ్రీరంగము.

49 పంక్తులు - (2 పుట 35)

హరిగతి రగడ - 4 మాత్రలకు విఱుగును.

వాల్మీకి చరిత్ర :

నిచ్చనిచ్చగ నలరు దండలు నిండనిండయనుంగు జెలులకు
విచ్చవిచ్చన విడివిరుక గురువింద విందొనరించె నలులకు.

ఇందు 35 పాదము లున్నవి. కాని రెండేసి పాదములకు ప్రాసయతిగల రగడ లక్షణమునుబట్టి యిది 36 పాదములు గల రగడయై యుండవలయును. పరిశీలించి చూడగా నీ క్రింది పాదము క్రింద నొక పాదము లోపించినట్లగు పడుచున్నది.

చామ చామనమేనియాచెలి...
రామ రామ మరంద......

ఈ పంక్తుల క్రింద :

మాదిమాది ఫలంబు తగదిటు మలయ మలయజగంధి ముందఱ-అ పాదము కలదు - వెనువెంటనే

ననల ననల సగతులఁగోసి జనంగనంగన యిపుడు వచ్చెను - అను పాదము కలదు. కావున 'జ' కార ప్రాసతో నుండవలసిన యొక పాదము లోపించినదని చెప్పవచ్చును. (3-117) ఇది హరిణగతి రగడ.

సుభద్రా పరిణయము-కూచిమంచి జగ్గకవి (ప్రథమాశ్వాసము. 76)

జయరమా కుచకుంభ కుంకుమ సాంకవాంగిత నిజభుజంతర
భయద వక్త్రనిరుద్ధ యాధవ పాలనాతి కృపానిరంతర.

... ... ... ...

ధరణీధరధర విపుల బాహాంతర నిరంతర విలసదిందిర
వరాహిమకరనయన దామోదర మహావైకుంఠ మందిర.

ఇది స్తుతి - ఇది వృషభగతి రగడ.

పైని చూపిన యాంధ్ర ప్రబంధోదాహరణములను బట్టి రగడలను తెలుఁగు కవు లీ క్రింది సందర్భముల నుపయోగించిరని తెలియుచున్నది.

1. భక్తిప్రపత్తులఁ దెలుపుట కుపయుక్తములగుట.
2. పుష్టాపచయము - ఈ సందర్భమున రగడలు పెక్కుమంది కవు లుపయోగించిరి.
3. వస్తువుల పేళ్ళుగాని, క్షేత్రముల పేళ్ళుగాని చెప్పునప్పు డుపయోగించుట.
4. యుద్ధమునకుఁ బోవునపుడు, భోజన సమయమున నుపయోగించుట.
5. వృత్తాంతములు తెలియపఱచుట.

ప్రాయికముగా రగడలు భక్తిప్రపత్తికొఱకు పుష్టాపచయముకొఱకు ప్రయుక్తములైనవి. ఇవి పద్యప్రబంధముల యందే యుండును. ఇచ్చట నొక విశేషమున్నది. రగడలు తాళాంగ ప్రధానములై సంగీతమున కను వైనను నివి యక్షగానములలో కనుపట్టవు. దీనికి కారణము రగడ లుదాహరణములలో నక్షరగణ యుక్తములగు చంపకోత్పలమాలికాది వృత్తములతోపాటు ప్రయుక్తములైనవి. ఉదాహరణము కావ్యమే గావున కావ్యప్రబంధములలోనే రగడలు ప్రయుక్తములైనవి. అనఁగా వానికి సంగీత కృతులలో ప్రాధాన్యము లేక, సాహిత్యకృతులలో నున్నదని యర్థము. ఈ విషయ మొక్కటియే సంగీత సాహిత్యములకు, పదపద్య కవితలకు తెలుఁగు భాషలోగల యవినాభావ సంబంధమును విశదము చేయుచున్నది.

---

* ఇంకను ముద్రితా ముద్రిత ప్రబంధముల నుండి యుదాహరణలను స్థలాభావముచే నిందు పేర్కొనలేదు.

# ఉదాహరణములు - చారిత్రకయుగ పరిణామము

తెలుఁగు వాఙ్మయమున చారిత్రక యుగ విభజన ననుసరించి, ఉదాహరణశాఖా పరిణామమును పరిశీలించినచో నది నన్నయ కాలమునుండి నేటివఱకు నవిచ్ఛిన్నముగ సాగుచునే యున్నట్లు స్పష్టమగును. ఈ శీర్షికలో నీ విషయమును వివరించుచున్నాను.

## నన్నయ యుగము - (క్రీ. శ. 1000-1100).

ఈ యుగమున ప్రత్యేకముగ నుదాహరణ గ్రంథములు వెలువడక పోయినను నన్నయ భారతమున నాలక్షణములు కొన్ని గలవు. నన్నయ, ఆశ్వాసాద్యంతములలో విభక్త్యంతములు పాటింపక, సంబోధనాంతములుగానే రచించియున్నాఁడు. నన్నయ ఆదిపర్వమున, 'ఉదంకస్తుతి' యందు నాల్గు పద్యములను ప్రథమావిభక్త్యంతములుగానే వ్రాసి యున్నాఁడు[1]. అవి సుపరిచితము లగుటచే నిట యుదాహరింప లేదు.

## శివకవియుగము - (క్రీ. శ. 1100-1250).

శివకవియుగమే యుదాహరణలకు నాందీ ప్రస్తావన గావించినది. పాల్కుఱికి సోమనాథుని సంస్కృతాంధ్ర బసవోదాహరణములు రెండును, నా రెండు భాషలలో ప్రాథమికములు. అవి యిందీయబడి యున్నవి. సోమనాథుఁడిట్లుదాహరణ రచనకు మార్గదర్శకుఁ డగుటయేగాక, తన పండితారాధ్య చరిత్రమున నీ సూచన గావించి యున్నాడు[2].

---

1. ఆది-1-103-107 పద్యములు.

2. పాల్కురికి సోమనాథునిగా పండితారాధ్యోదాహరణమను నొక యుదాహరణ మాంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. (సంపుటి 53. సం. 1) లో ప్రకటితమైనది. కాని పరిశీలింపగా నది యెంత మాత్రమును సోమనాథకవి కృతము కాదని చెప్పవచ్చును. కావున నది యిందు చేర్చ లేదు. ఇది డాక్టరు విరుదురాజు రామరాజు గారిచేత సంపాదితమైనది.

# బసవోదాహరణము

## పాల్కురికి సోమనాథమహాకవి రచితము

[ ఆంధ్రదేశ శైవవాఙ్మయమున కేగాక, కన్నడదేశ శైవవాఙ్మయమునకు మూల పురుషుడని చెప్పఁదగిన పాల్కురికిసోమనాథుఁడు క్రీ. శ. 1190-నుండి 1260 వఱకు వెలసిన వాఁడు.

ఈ యుదాహరణమున కన్నడదేశమున వీరశైవమతము ప్రతిపాదించిన బసవేశ్వరుని మహిమవర్ణితమైనది - సోమనాథుఁడు తన బసవపురాణమునను, వృషాధిప శతకమునను, గద్యలయందును పేర్కొనిన విషయములే యిందును పేర్కొనినాఁడు. ]

### ప్రథమా విభక్తి

ఉ॥ శ్రీగురులింగ తత్పరుఁ డ - శేషజగన్నిధి, శుద్ధతత్త్వసం
యోగసుఖప్రపూర్తి, వృషభోత్తమమూర్తి యుదాత్తకీర్తి, ది
వ్యాగమమార్గవర్తి, బస - వయ్యకృపాంబుధి మాకు దివ్యసం
భోగములం బ్రసాదసుఖ - భోగములం గరుణించుఁ గావుతన్.

### కళిక

వెండియుఁ ద్రిభువన - వినుతి సమేతుఁడు
మండిత సద్గుణ - మహిమోపేతుఁడు
సురుచిరశివసమ - సుఖసంధానుఁడు
పరమపరాపర - భరితజ్ఞానుఁడు
విదితానందా - న్వితమనస్కుఁడు
సదమల విపుల వి - శాలయశస్కుఁడు
శ్రీవిలసిత పద - చిరతర భద్రుఁడు.
[1]గావున సాక్షాత్ - కలియుగరుద్రుఁడు

### ఉత్కళిక

భువనోపకార [2]
భవమోద వీర

---

1. గావుర 2. కారా అన్నిపాదములు చివర వ్రాఁతలో దీర్ఘములు - వీరా, యోగా, భోగా.

భక్తిసంయోగ
ముక్తి సంభోగ
సౌఖ్యాబ్ధిలోన
ముఖ్యుఁడై తాన
వెలయు శుభకరుఁడు
[1] ఇల విశ్వగురుఁడు.

ద్వితీయా విభక్తి

చ॥ వసిగొని యెవ్వఁడేని బస - వాయను నీసుకృతాక్షరత్రయం
బెసగఁ బఠించెనేని గిరి - జేశుని కాతనివక్త్ర గహ్వరం
బసదృశగేహమన్న[2] యవి - యార్యులవాక్యము [3]లట్ల కావునన్
బసవనఁ బుణ్యమూర్తిఁదలఁ - పంగదెచిత్తమ! పాయకెప్పుడున్

ద్వితీయా విభక్తి కళిక

వెండియును భక్తాభి - వృద్ధిఁ బెంచినవాని
[4]బండమాయావాద - పథముఁ ద్రుంచినవాని
నద్వైతవాక్యసం - హారుఁడై చనువాని
విద్వత్తముం గెల్చి - వీరుఁడై మనువాని
మీమాంసకులముక్కు - మిగులఁ గోసినవాని
తామసధ్వాంతంబు - తగులు బాసినవాని
పెక్కుదైవంబులను - పేరుమాపినవాని
నొక్కఁడే రుద్రుఁడని - యుక్తిఁ జూపినవాని

ఉత్కళిక

ప్రకృతివాదముఁ దుడిచి
వికృతవేషము లుడిచి

1. నలివిశ్వ 2. యది 3. నట్ల. 4. చండమాయా వారసరణి_ముద్రితము 1944.

సకలవాదుల నోర్చి
సుకృతమార్గముఁ దీర్చి
భూమిభారము మాన్ప
గామించుగతిఁ జూప
నెమ్మిఁ జాలినవాని
మమ్ము నేలినవాని

త్రి తే యా వి భ క్తి

ఉ॥ జంగమపాత్రుచే, సమయ - సమ్మతుచే, భవరోగవైద్యుచే
లింగమూర్తిచే, గరళ - మర్ధనుచే, ననమానశౌర్యుచే
చెంగటమారుచే, బసవ - లింగముచే, బసవయ్యచే, కృపా
సంగతుచేఁ బ్రసాదసుఖ - సౌఖ్యమునొందెద భక్తిఁ జెందెదన్.

క ళి క

వెండియును వేదోక్త - విలసచ్చరిత్రుచే
నిండిభవబంధనల - తాచయ లవిత్రుచే
విధినిషేధాతీత - వినుతైకగణ్యుచే
బుధజనప్రోద్గీత - భువనాగ్రగణ్యుచే
ప్రవిమలశివాచార - భవ్యప్రసారిచే
భవిజనపరి[1]త్యాగి - భక్తి [2]బండారిచే
శివచిన్మయాపరి - చ్ఛిన్నప్రమోదిచే
పరమార్థతత్వాను - భవసుఖాస్వాదిచే.

త్రితేయావిభక్తి - ఉత్కళిక

సన్మతులగరిగట్టి
మన్ననల తుదముట్టి

1. త్యాగి. 2. భండారిచే.

ప్రమథ కవిలియ కెక్కి
విమలసంపద నిక్కి
శివలీలఁ బెంపార
భువి బసవఁడను పేర
మెఱయు సువిధఞ్జూచె
నెఱయుఁ దత్త్వఞ్జూచె

చ తు ర్థీ వి భ క్తి

చ॥ అతని ప్రసాదసౌఖ్యమున - కంగము కీర్తికిఁ గర్ణముల్ గుణ
స్తుతులకు జిహ్వయుం జరణ - తోయజసంగతికి న్మనంబు స
మ్మతగుణదివ్యమూర్తికి న - మస్కృతియుః విధియించి కూడన
ట్లతులితపుణ్యుఁడైన బస - వయ్యకు నై ప్రణమిల్లు చిత్తమా!

క ళి క

వెండియును నిర్మల ప - విత్రగోత్రునకునై
పండిత[1] స్తవనీయ - పాత్ర గాత్రునకునై
దురితభంజనకళా - ధుర్యచరితునకునై
సరవి నిష్టవ్రతా - శ్చర్య భరితునకునై
సవిశేషవిమలగుణ - జాలలోలునకునై
శివయోగ సంధాన - శీలపాలునకునై
2. ............................
..............................

1. స్తవనైక.
2. ఈ రెండు పాదములును శ్రీబండారుతమ్మయ్యగారిచే నిట్లు పూరింపఁబడినవి.
"భక్తిసీమంతినీ ప్రాణనాథునకునై
భక్తగణసేవనవ్రతసనాథునకునై" —1944. ముద్రణము.

## ఉత్కళిక

లింగచిహ్నాలు మోచి
కొంగలుండఁగఁ జూచి
కొంగులను బొదిగొన్న
వంగకాయలు మున్న
లింగములుగాఁ దెల్పి
జంగమేష్ఫలు సల్పి
భవరోగ హరునకై
శివరూపధరునకై.

## పంచమీ విభక్తి

చ॥ పొలుపొందిపోటు మూషకుల – పొంగణగించి వధించి మించి య
ష్టము ప్రసాదితమై యనుభ – వించి జగంబులనెల్ల మించి పెం
పెనుగఁగఁ దేజరిల్లెడు మ – హిష్ఠయశోనిధిగాన యెప్పుడున్
బసవదండనాథువలన – నన్ [1]భజియింతుఁ బ్రసాదసౌఖ్యముల్

## కళిక

వెండియును జగదేక – వీరసత్తమువలన
బందారు బసవ స – త్పండితోత్తమువలన
పరమమాహేశ్వరా – న్వీతవర్తనువలన
ఘోర సంసార సం – క్షోభ కర్తనువలన
సుకృత దుష్కృత శుభా – శుభవిదూరగువలన
సకలనిష్కల తత్త్వ – సౌఖ్యపారగువలన
నాదవిద్యాసుధా – ర్ణవ విహారుని వలన
[2] ఆది వృషభేంద్రాప – రావతారుని వలన

1. [illegible] 2. [illegible]

ఉ త్క లి క

సారజీవన్ముక్తి
కారణంబగు భక్తి
చేకూరు సమ్మత[1]
మ్మేక లింగవ్రతము
త్రోవఁ బొందని పనుప
దైవజ్ఞులను మనుప
నోపు ధీరునివలనఁ
బాపహారునివలన

షష్ఠీ విభక్తి

ఉ॥ దుస్తరకర్మభూసురులు - దూషకులై కులమెత్తిపల్కుచున్
నాస్తికులౌచుఁ జూడ శివ - నాగయగారిగుఱించి వారి శ్రీ
హస్తతలంబునందు విమ - లామృతధారలు వెల్లిగుర్యనా
ర్యస్తుతిఁ [2]బేర్చు నబ్బసవ - రాజునకే నతిభక్తి సేయుదుఁ

కళిక

వెండియు నోంకారసార - విదితముదితమేళనునకు
పండినిండి పొలుపు సలుపు - భక్తియుక్తి పాలనునకు
భవ్యసేవ్యశరణ చరణ - పద్మసద్మ ఖేలనునకు
నవ్యదివ్యలలితగళిత - నాద భేద[3]లోలనునకు
యమ నియమ నిరంతరాంత - రాంగసాంగవర్తనునకు
సమిత శమిత విషమ విషయ - హారి భూరి కీర్తనునకు
సత్యనిత్య భోగయోగ - జంత్ర తంత్ర దూరగునకు
సత్యనిత్య శుద్ధ బుద్ధ - సత్త్వ తత్త్వపారగునకు

1. చేకూరు సమ్మతమ్మేక లింగవ్రతము. ఇది యంతయు నొకేసమాసము—సమాస మధ్యమున 'ఏకలింగ' అని యుండదు. 2. నించు. 3. లాలనునకు.

## ఉ త్క ళి క

మహిఁ బురాతనోక్త భక్తి
మహిత తత్త్వ శక్తి యుక్తి
యిమ్ముఁ గొనగ లింగజంగ
మమ్ము ప్రాణలింగమునకు
సమ్మతముగ భువిని వెలసి
ప్రమథలీలసొలసి యొలసి
యున్న గణవిరాజితునకుఁ
[1] జన్నబసవపూజితునకు

## స ప్త మీ వి భ క్తి

చ॥ అసమగుణాఢ్యునందు, శర - ణాగతవత్సలునందు, జంగమ
వ్యసనమహిష్ఠునందు, భవ - వారణ కారణమందు, భక్తమా
నస పరిపూర్ణునందు, గణ - నాథునియందు దయాపయోధిమా
బసవనియందు మాబసవ - పాత్రునియందు వసింపు చిత్తమా॥

## క ళి క

వెండియు[2] ......... నందు
చండమదన - శౌర్యునందు
దురిత భయ వి - దూరునందు
సరసభక్తి - సారునందు
సుకరశరణ - సూత్రునందు
సకలవిషయ - జైత్రునందు
భువన సత్ప్ర - బుద్ధునందు
శివగణ ప్ర - సిద్ధునందు

1. చెన్నబసవ. 2. శివవీర్య - ముద్రితములు.

## ఉ త్క ళి క

శరణజనుల
వరువుబనుల
తనువుతగవు
ధనము మనము
సమసి సంగ
తముగ లింగ
నిజమునందు
విజయునందు

## స ం బో ధ న

చ॥ ఎగస లలాటవహ్నిఁగుసు - మేషుదహించిన కాలరుద్ర! మున్
గసిమసఁజేసి దక్షుని మ - ఖంబు హరించిన వీరభద్ర! యి
వ్వసుమతిఁబుట్టి భక్తజన - వశ్యుఁడవైన కృపాసముద్ర! యో
బసవ! భవత్ప్రసాద సుఖ - భాజనుఁజేయవె నన్నునర్మిలిన్.

## క ళి క

వెండియును సమస్తలోక - విదిత విమలభక్తిబీజ!
దండితేంద్రియ ప్రచండ - తరళ విషమగుణసమాజ!
జంగమప్రసాదభోగ - సారసౌఖ్యశరధి మగ్న!
లింగసంగతానుభావ - లీల శరధి [1]సంవిలగ్న!
అతులసకల భువనపావ - నావతార పుణ్యమూర్తి!
సతతవితత విమల తత్త్వ - సార సౌఖ్యజనహర్తా [?]ర్తి!
భవభయప్రసారదూర - భవ్య సులభ సుకృతికాయ!
దివిజబృందవందిత ద్వి - తీయ శంభునామధేయ!

1. నోవిలగ్న.

## ఉత్కళిక

పరమగురు మతానుకూల
భరితసుగుణ గతివిలోల
లింగపూజనా విధేయ
జంగమార్చ[1] నానపాయ
శ్రీవృషేంద్ర దివ్యమూర్తి
శైవసమయ చక్రవర్తి
భక్తిసత్క్రియాధురీణ
భక్తముక్తిదప్రవీణ !

## సార్వవిభక్తికము

ఉ॥ నీవు దయాపయోనిధివి - నిన్ను నుతించినఁగల్గు భక్తి నీ
చే వరవీరశైవరతి - చేకురు, నీకయి యిత్తుఁ గబ్బముల్
నీ వలనం గృతార్థత జనించును, నీకు నమస్కరింతు నా
భావము నందు నుండి నను - బాయకుమీ బసవయ్య ! వేఁడెదన్.

## వివరణము

| | |
|---|---|
| నీవు దయాపయోనిధివి | ప్రథమావిభక్తి |
| నిన్ను నుతించినఁగల్గు భక్తి | ద్వితీయా ,, |
| నీచే వరవీరశైవరతి చేకురు | తృతీయా విభక్తి |
| నీకయి యిత్తుఁగబ్బముల్ | చతుర్థీ ,, |
| నీవలనం గృతార్థత జనించును | పంచమీ ,, |
| నీకు నమస్కరింతు | షష్ఠీ ,, |
| నాభావమునందు నుండి నను బాయకుమీ | సప్తమీ ,, |
| బసవయ్య ! వేఁడెదన్ | సంబోధన ,, |

---

1. కానపాయ.

## ఉదాహరణసూచనము - పాల్కుఱికి సోమనాథుఁడు.

పాల్కుఱికి సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రమున యుదాహరణ గ్రంథలక్షణ సూచనము గావించియున్నాఁడు. పురాతన ప్రకరణమున "కళియంబకథ"లో పాదోకమహిమఁ జెప్పు సందర్భమున నిట్లు కలదు.

ద్వి॥ నివ్వటిలఁగ భక్తనిచయపాదాంబు
లెవ్వనియందుఁ బ్రహృష్టతఁ బరగుఁ
బోఁడిగా నిన్నిటఁ బొలుపైన యట్టి

| | | | |
|---|---|---|---|
| వాఁడీశుఁ డీశుండు | - | ప్రథమావిభక్తి | |
| వాని భావించు | - | ద్వితీయా | ,, |
| వాని చేతన వ్రాలు | - | తృతీయా | ,, |
| వానికై క్రాలు | - | చతుర్థీ | ,, |
| వాని వలనఁ జిక్కు | - | పంచమీ | ,, |
| వానికి దక్కు | - | షష్ఠీ | ,, |
| వాని యందవసించు వలపారనదియు | - | సప్తమీ | ,, |

మానిత సద్భక్తిమహిమఁదులాఁడ
వానికి బ్రతివోల్ప వసుధవా గలదె?

(పండితారాధ్య చరిత్ర-పుట. 279)

---

## తిక్కన ఎఱ్ఱనల యుగము

## (క్రీ. శ. 1250-1400)

ఈ యుగమున క్రీ. శ. 1320 ప్రాంతమున వెలసినది రావిపాటి త్రిపురాంతకుని తిప్పన-త్రిపురాంతకోదాహరణము -

---

# త్రిపురాంతకోదాహరణము

## రావిపాటి త్రిపురాంతక కవి (తిప్పన) ప్రణీతము

### ప్రథమా విభక్తి

ఉ॥ శ్రీనగచక్రవర్తి తుది - శృంగము చూచెదమంచు నేఁటికిం
బో సనిశంబు నుండునిదె - పుట్టువుఁజావునులేని మందు నా
చే ననుచుంబతాకయను - చేఁదరుణాచలమెక్కి చీఁకుఁ బం
బానను డిందుమౌళి త్రిపు - రాంతకదేవుఁడు భక్తలోకమున్.

కళిక - వృషభతిరగడ - త్రిపుటతాళము.

మఱియు సజ్జనభక్తగృహముల - మరగి తిరిగెడి కామధేనువు
కఱదలెఱుఁగక వేఁడు దీనులఁ - గదియు జంగమరత్నసానువు
శైలజాముఖ చంద్రరోచుల - చవులఁదవిలెడు నవచకోరము
వేలుపుందపసుల తలంపుల - వెల్లికొల్పెడు నమృతపూరము
దేవతలు మువ్వురకు నవ్వలి - దెసవెలుంగుచు నుండునెక్కటి
భావవీథులఁ గలసి పలుకుల - బట్టి చెప్పఁగరాని చక్కటి
ఆఱురేకుల మంత్రకుసుమము - నందు వెలిఁగెడి చంచరీకము
వేఱుసేయక యోగిజనములు - వెదకిపొందెడు నూర్ధ్వలోకము

ఉత్కళిక

అడుగుఁ దమ్ములఁ జొప్పుపసిగని
యడరి శునకాకృతులు గైకొని
మీఱి చదువులుదవుల ముందట
బాఱు క్రోడమునేసి మందట
లాడి తనుమార్కొనఁగ వచ్చిన
క్రీడికోరినవరము లిచ్చిన
యాటవికకుల సార్వభౌముఁడు
జూటభాస్వత్తుహినధాముఁడు

## ద్వితీయా విభక్తి

ఉ॥ పామును హారమున్ నెలయుఁ - బాపటసేసయు నేఱుమల్లికా
దామము తోలుదువ్వలువు - దట్టపుభూతియు చందనంబుమై
సామునఁజాలనందముగ - సన్నిధిసేసిన చూడగంటినే
నామదిలోఁ గుమారగిరి - నాథుని శైలసుతాసనాథునిన్.

కళిక - జయభద్రరగడ - జంపెతాళము.

మఱియు వేలుపులేటి - మౌళినాఁగినవాని
నెఱయఁ గన్నుపనోటి - నీటఁదోఁగినవానిఁ
బొలఁతితో నొక్కొడలఁ - బొత్తుఁగూడినవానిఁ
దలఁకిసేనమరాజు - దాడి కోడినవాని
శాఖ్యతొండని రాల - జడికి నోర్చినవాని
సౌఖ్యతరసాయుజ్య - సరణిఁగూర్చినవాని
వెన్నెలలఁ బురుణించు - వెలఁదినవ్వులవాని
వెన్నునకు నలువకును - వెదుక దవ్వులవాని

ఉత్కళిక

చిగురుఁగైదువు వెఱికి
మగల సిగ్గులు నఱికి
సతులఁబాటులు పఱిచి
యతులవ్రతములు చెఱిచి
అలులు చిలుకలు పిండు
లెలయఁగొలువఁగ నుండు
మరు జయించినవానిఁ
గరుణమించిన వాని

## తృతీయా విభక్తి

ఉ॥ వాలినటించుముక్తివర - వర్ణిని పయ్యెదకొంగు చాడ్పునన్
గ్రాలు నిజాంకపుంబడగ - కన్నులఁ జూచినఁజాలు నిమ్నగా
స్ఫాలితమౌళిచేత పుర-భంజనుచేత కుమారపర్వతం
బేలెడు రాజుచేత ఫలి - యించు జనావళికోరు కోరుకుల్.

కళిక-హయప్రచారము లేక తురగవల్గనము-రూపకతాళము.

మఱియు మఱ్ఱిమ్రానిమొదల - మరగి యున్న గురునిచేతఁ
గొఱలి తాపసులకు నెఱుకఁ - గొలుపు జటిల వరునిచేత
నంబివనుప కుంతెనలకు - నడచిన యెడకానిచేత
నంబరాది తత్త్వములకు - నవలయైన తేనిచేత
బల్లహుని వధూటికాస - పడిన దుండగీనిచేత
నల్లియలక నేలురాజు - నన్నుఁగు సంగడీనిచేత
భూతిపూయు మానవులకుఁ - బుట్టుమాన్పు వైద్యుచేత
ప్రీతి ధాతవునుకకోర - భిక్ష సేయు నాద్యుచేత

ఉత్కళిక

ఇలరథంబు లీలనొప్ప
నలువ నిగమ హరులరొప్పఁ
బొసగఁ బాఁప నారిఁబట్టి
పసిఁడి కొండ యెక్కువెట్టి
జడధి నిద్రవోవు శరముఁ
దొడఁగి నేలఁగూలఁ బురము
లేసియున్న జోదుచేత
దాసవర కణాదుచేత

## చ తు ర్థీ వి భ క్తి

ఉ॥ ఆఅడియాన నీరస ధ - రాధిపలోకము లిండ్లువాకిళుల్
దూఱుటమాని శ్రీనగము - తూఱుపువాకిలిఁజొచ్చి పాపముల్
నీఱుఁగఁజేసి గంధవతి - నీటనుఁ గ్రుంగి మనంబులోని చి
చ్చాఱఁగఁజేయుటొప్పు త్రిపు-రాంతకదేవునకై నమస్కృతుల్

కళిక - వృషభగతిరగడ - త్రిపుటతాళము.

మఱియును మెఱయఁగ దిశలనియెడు నును
మడుగులు గట్టిన శృంగారికినై
కొఱలినదయ బాణాసురుమోసలఁ
గూరిమిఁగాచిన ఫణిహారికినై
మేలపుఁ జదువులు చదివిన విని మది
మెచ్చిన లక్ష్మీపతి బావకునై
యీలువుగల సద్భక్తులు ముక్తికి
నేఁగెడు చేరువ పెనుత్రోవకునై
కూటికిఁ గూరకు కూరిమిభక్తుల
కొడుకుల నడిగెడి వెడజోకిగినై
ఏటికి బోఁటికి జడలును నొడలును
నిచ్చిన జగదేక త్యాగికినై
ప్రొద్దును రేవెలుఁగును నేత్రములై
పొలయఁ గనుంగొనియెడు దేవునకై
నిద్దములగు పెద్దల పేరెఱుకల
నెలకొనియెడు నిశ్చలభావునకై

ఉ త్క ళి క

కడు దీనతతో ముదితాపసికై
వడి నింటికిఁ జని వెడకప్పెరగై

కాని యాలుమగల పెనురచ్చలకై
చనుదెండని నిక్కము సేయుటకై
వెనుద్రిప్పి నగుండము లోపలఁ గై
కాని చని తనయెప్పటి రూపముకై
కాని గుండయ మెచ్చిన వేల్పునకై
వినత పితామహ ఫణితల్పునకై

పంచమీ విభక్తి

ఉ॥ పోయెడుఁగాల మన్యగతిఁ బొందదు మోక్షము వెండికొండకుం
బోయెడు త్రోవమీకెఱుఁగఁ - బోలదు మానవులార! రండు లేఁ
బ్రాయపుఁగొండ కందు శివ - భక్తుల లోగొను నద్రిరాజక
న్యాయుత పుణ్యమూర్తి వల - నం గడతేఱెడు జన్మఖేదముల్

కళిక - జయభద్రరగడ - జంపెతాళము.

మఱియు సకలాశ్రితుల - మనుచు నర్థమువలన
వఱలు పరమానంద - వనధితీర్థము వలన
కొమరుమిగిలిన మంచుఁ - గొండయల్లుని వలన
విమతపుర దహన కర - విష్ణుభల్లుని వలన
శివభక్తహృదయ సం - చితనిధానము వలన
వివిధరూపములలో - వెలయు జ్ఞానము వలన
అజ్ఞాన ఘనతమం - బడచు దీపము వలన
సుజ్ఞానులకునుఁ బొడ - సూపురూపము వలన

ఉత్కళిక

తన కినుకలోఁ బుట్టి
కనలి దక్షునిఁ గొట్టి
యదరి వేల్పులఁ బఱచి
తొదరి జన్నము చెఱచి

వీరభద్రుఁడు వచ్చి
చేరి మ్రొక్కిన మెచ్చి
యలరుదైత్యునివలన
దళితదైత్యునివలన

## షష్ఠీ విభక్తి

చ॥ కమలజుతోరపుంబునుక - కంచము పాదసరోరుహార్చనా
కమలము వారిజోదరుని - కన్ను కరంబున కాదిభోగి భో
గము రవణంబు చంద్రుఁడు శి - ఖాకుసుమంబటె! యెవ్వరీడు మా
రమణునకుం గుమారగిరి - రాజనివాసున కన్యదైవముల్.

కళిక - హయప్రచారము లేక తురగవల్గనము - రూపకతాళము.

మఱియు మెఱయు వేదవాద - మథన కథనసారమునకు
మెఱయు దట్ట ముట్టి ముట్టు - మేటినీటి తీరమునకు
బత్తులుత్తులొరసి యొరసి - పట్టు గట్టితేజమునకు
సత్తుఁ జిత్తుదానయైన - సత్యనిత్యబీజమునకు
వలచి కొలుచు వారిఁ జేరి - వలపుఁదలపు దయ్యమునకు
నిలిచి నిలిచి చూడఁజూడ - నిండియుండు తియ్యమునకు
మునులు ఘనులు బోధవీథి - ముట్టినట్టి తత్త్వమునకు
పనులుఁ గనులునెఱుఁగనట్టి - పరమపదమహత్త్వమునకు

## ఉత్కళిక

కదలి వదలి జూటకోటి
చదలఁబొదలనేటి నీటి
కడలఁగడలఁ జెంది చెంది
జడల నొడలఁ బొంది పొంది

బాలలీలఁ జూడ జూడ
హేలి లీలఁ గ్రీడలాడ
నాది నాథ జనకమునకు
పాపహారి కనకమునకు

## సప్తమీ విభక్తి

ఉ॥ పాపవిలోపనగా నొదలి - వాకిళులం జవిచూపుతీపులం
ప్రోచి శివార్చనా నియతి - తో వెలిచూడక చూడనేర్చినన్
లోచవిఁ బోలునే చవులు - లోకముఁ జూడనిచూపులం గుమా
రాచలనాథునందు త్రిపు - రాంతకునందు కరంగు చిత్తమా !

## కళిక జయభద్రరగడ - జంపెతాళము.

మఱియునుఁ గటాక్షజిత - మారునందు
తఱిత్రాడు సొమ్మగు ను - దారునందు
ఐరులాను భక్తపళు - పాలునందు
కరుణా సుశీతకరి - కాలునందు
జగములు జనించు తొలి - జాడయందు
నిగమార్థముల్ నిలుచు - నీడయందు
పొడవెల్లి శాంతియగు - పుణ్యునందు
కడలేక యొప్పు నర - గణ్యునందు.

## ఉత్కళిక

ఇలయు సలిలంబు
వెలుఁగు ననిలంబు
దివియు మిత్రుండు
కువల యాప్తుండు

పరగు యజమాన
పరిపూర్ణుఁడైన
యష్టతను నందు
శిష్టనుతునందు.

### సంబోధన

ఉ॥ శ్రీచనుదోయిపై శరముఁ - జేర్చి భుజంగమరాజ సజ్య హే
మాచల మెక్కుడించి నిగ - మావళి యజ్ఞులు వీడ్చి పద్మజుం
జూచి మొగంబులిచ్చి దివి - జుల్ గొనియాడఁగనున్న నీ రణాం
తా చరణంబు విందు చెవు - లారఁ గుమారగిరీంద్రమందిరా !

### కళిక - జయభద్రరగడ - జంపెతాళము.

మఱియు నానామంత్ర - మణిగణసుధాకల్ప !
కొఱలు నేనుఁగుమోము - కొడుకుఁగాంచినవేల్ప !
మూఁడుమోముల పోటు - ముట్టుఁ బట్టెడుశూర !
వేఁడిచూపులఁ దియ్య - విలుతుఁద్రుంచిన ధీర !
తాపసుల యీలువుల - తనరు తపములపంట !
చూపులకు నెల్ల పర - సుఖవార్థి పెన్నింట
తిలకాయమాన దీ - ధితి సుధాసంభూతి !
వెలుఁగులకు నెల్లతొలి - వెలుఁగగు పరంజ్యోతి !

### ఉత్కళిక

వినుతముఖ నలినమును
ఘనజఘన పులినమును
వరవళిత రంగములు
గురుకుచ రథాంగములు

గలిగిన యుమాసరసి
లలితముఖముల బెరసి
క్రాలునొక కలహంస !
బాల చంద్రోత్తంస !

సార్వ విభక్తికము

శా॥ నీవాద్యుండవు నిన్నుఁదెల్పుచదువుల్ – నీచేత మేలొంద నీ
కై వాక్పూజలొనర్తు నీవలన బ్ర – హ్మాండావళుల్ పుట్టు నీ
కేవేల్పుల్సరి అన్యదైవభజనం – బేనొల్ల నీయందు మ
ద్భావంబొందఁ దగున్ గుమారగిరినాథా ! చంద్రచూడామణీ !

ఉదాహరణముల యందిది ద్వితీయమైనను అద్వితీయమైనది. నా పరిశ్రమకు మూలకందమైనది. కావున దీనినిందు ముద్రించితిని. ఉదాహరణము నందు బహుప్రజాదరణము పొందినదిదియే.

---

## శ్రీ నా థ యు గ ము

( క్రీ. శ. 1400–1500 )

ఉదాహరణ లక్షణములు ప్రప్రథమముగా విపులముగా నీయబడినవీ యుగమునందే. మఱియు నిందుదాహరణమున నొక భేదమగు 'విద్దళి' వెలసినది వాని వివరములు :

ఉదాహరణ లక్షణములు

విన్నకోటపెద్దన – కావ్యాలంకార చూడామణి

కం॥ ధరఁ జాటుకృతులలోనం
బరగు నుదాహరణమను ప్రబంధము తద్వి
స్తరలక్షణంబు పరువడిఁ
బరికింపఁగఁ దగు నశేషభాషాకవులున్.

కం॥ చతురశ్రత్ర్యశ్రాది వి
తత యతితాళములు గలుగు దళముల నెల్లన్
కృతగుచ్ఛాను ప్రాసం
బతులితగతి నిలుపఁదగు నుదాహరణలకున్.

కం॥ సురభాషాది ప్రాకృత
పరిభాషలనైన నితరభాషలనైనన్
విరచించుట యుక్త ముదా
హరణ మిలాసురముఖాదులగు పుణ్యులకున్.

విభక్తులకు మాఱుపేరులు——

సీ॥ ప్రథమావిభక్తి చొప్పడు వాణినాఁగ, రెం
డవయది ఝుటనాఁగ నతిశయిల్లు
కీర్తి మూఁడవ విభక్తికిఁబేరు నాలవ
యదిదేవలాభిని యండ్రు గృతులఁ
బంచమి పాణినాఁబరగు షష్ఠివిభక్తి
పాటిల్లు సుకవులు మోటినాఁగ
సప్తమీ ఘోటికా సంజ్ఞత సంబుద్ధి
సరసావళీనామ జగతివీని

విభక్తుల కధిదేవతలు——

కయినవేల్పులు వీరావళియును గీర్తి
మతి సుభగయును మఱి భోగమాలినియును
మహిఁ గళావతియును గాంతిమతియుఁ గమల
యును జయవతియునాఁగ నొప్పు నెపుడు.

కం॥ ఈవిదితాష్ట విభక్త్యధి
దేవత లాత్మీయ నామధేయసమముగా
భావింపఁదగిన శుభములఁ
గావింతురు కర్తృనాముక ద్వయమునకున్.

కం॥ మును శుభగణవర్ణతఁ బ
ర్విన మాలినియొండె చండవృత్తమ యొండెన్
దనరింపవలయుఁ బ్రథమకు
ఘనకలికాష్టక తదర్ధకలికాయుక్తిన్.

కం॥ ఇంబడరఁగఁ బ్రథమాదుల
సంబుద్ధ్యంతములనైన సరళవిభక్త్యా
లంబన పద్యమ్ముల బిరు
దంబులు గలపౌరుషములుదగ నిడవలయున్.

తే॥ కళికయేతాళమునఁ బరిఘటితయయ్యె
నుత్కళికయును దానన యునుపవలయు
నంత్యచాతుర్థి కోత్కళికాఖ్యఁ జూడఁ
బడి చతుర్థినిఁబోలె చూపట్టవలయు.

కం॥ ఓజఃపదబహుళము వి
భ్రాజితపటుగౌడరీతి బంధురమును ని
ర్వ్యాజాతరసవిభావవి
రాజితమునుగా నుదాహరణఁ దగుఁజెప్పన్.

కం॥ నాయకవిభవమునకుఁ గవి
నాయకచతురతకు భాజనంబగు పద్యం
బాయితము సేసి యిడఁదగు
నాయతిగాఁ దుదలయం దుదాహరణలకున్.

సద్దళి

కం॥ సంబుద్ధివిడిచి మునుగల
సంబంధం బెడలకుండ సప్తవిభక్త్యా
డంబరమెడలించిన నొడి
కంబగు సద్దళి యనంగఁ గవులకుఁ జెప్పన్.

## ప ద్ధ ళి

తే॥ సరివిభక్తులు సంబుద్ధిసహితఁగాఁగఁ
జెప్పనొప్పారుఁ బద్ధళి సిద్ధమగుచు

## వి ద్ధ ళి

యుక్త సంబుద్ధి విషమవిభక్తికలిత
మైన కృతిపేరు విద్ధళియండ్రు బుధులు.

## ర గ డ

కం॥ సరియెనిమిది రేకులచేఁ
బరువడి నుత్సాహవృత్త పదయుగళముచే
నిరవుగ వడిప్రాసంబుల
నరుదుగ రచియింప రగడయగు తగురీతిన్.

బిరుదావళి చక్రవాళలక్షణములు సంస్కృత భాగములోఁ జూడనగును.

## ఉదాహరణ భేదము

(శ్రీనాథుని హరవిలాసము)

విద్ధళి, సప్తమాశ్వాసము, కిరాతార్జునీయకథ. 92-99 పద్యములు.

## ప్ర థ మా వి భ క్తి

క॥ నీవ పరబ్రహ్మంబవు
నీవఖిలాజాండపతివి - నీవు ప్రసన్న
శ్రీవిభవారోగ్యాయుః
ప్రావీణ్యప్రాభవైక - ఫలదుఁడవు శివా !

## ద్వితీయావిభక్తి

క॥ నిన్నుఁ ద్రిజగన్నివాసునిఁ
జన్నగ కంకణుని భక్తపర తంత్రుని న
భ్యున్నత కరుణాగుణ సం
పన్నునిఁ గనుగొంటి మంటి బాలేందుధరా !

## తృతీయావిభక్తి

క॥ నీచేతఁ గృపానిధిచే
వాచాగోచర వివేకవై య్యాత్మనిచే
నోచంద్రకలాశేఖర !
యాచించి మనోరథార్థ - మర్థింగందున్

## చతుర్థీవిభక్తి

శా॥ నీకై యేను దపంబుచేసితి మహా - నిష్ఠాగరిష్ఠ స్థితిన్
నీకై సంస్తుతిసేయుదుం గడగినా - నేర్పొప్పఁగానెంతయుః
నీకై పూజయొనర్తుఁ గ్రొత్తవిరుల - న్నిత్యంబుసద్భక్తితో
నీకై సేవయహర్నిశంబొనరుతు - న్వేదండ చర్మాంబరా !

## షష్ఠీవిభక్తి

తే. గీ॥ సాటియెవ్వరు నీకు నిశ్శాటజఘన
కైటభారాతిహాటక గర్భవంద్య
ఘన జటాజూట వాటికాఘటిత వికట
గగనగంగాస్రవంతిక ! కరటివైరి !

## సప్తమీవిభక్తి

కం॥ నీయందు జగములుండన్
బాయక యాజగములందు బాయకనీవుం
దీయనువు దెలియ నజునకు
దోయజనేత్రునకునైనఁ దోఁపదు శర్వా !

## సంబోధన

శా॥ జయ సర్వేశ్వర ! సర్వలోకజనకా ! చంద్రార్ధచూడామణీ !
జయకామాంతక ! కామితార్ధఫలదా ! చక్షుశ్శ్రవఃకుండలా !
జయ సంపూర్ణకృపాగుణైకవసతీ ! శైలేంద్రజావల్లభా !
జయ దక్షాధ్వరమర్దనా ! జయగిరీశా ! యీశ ! రక్షింపవే !

పైవానిలో పంచమీవిభక్తి లేక నందున సంబుద్ధితోఁగూడ నేడు విభక్తులు గావున విషమవిభక్తులైనవి.

భీమఖండమున (1-118) భీమేశ్వరుని కొలువుకూటమున "బేరోల గంబుండి...చంపూ చాటు నాటకోదాహరణ జయఘోష చక్రవాళ చతుర్భద్ర చతురాతిప్రబంధంబులాకర్షించుచు." అని యుదాహరణములను శ్రీనాథుఁడు ప్రత్యేకముగఁ బేర్కొనినాఁడు.

ఛందోదర్పణము :— అనంతుఁడు - ఉదాహరణలక్షణము.

సీ॥ భాసిల్లు సప్త విభక్తులందును మఱి
సంబోధనంబును సరవిఁగాఁగ
ప్రభునామయుతముగాఁ బద్యమొక్కటియునుఁ
దగఁజెప్పు రగడ భేదంబులందు
కళికలు ప్రత్యేకదళము లెన్మిది చేసి
తత్పూర్వార్ధముల నుత్కళికలనఁగ
నేకసమాసమై యేడుదళంబులు
తుదవిభక్త్యర్థంబు దోపఁ బలుక

తే. గీ. దానికెనఁగాఁగఁ జిక్కిన దళమమర్చి
ఫణితు లొడఁగూర్చి సార్వవిభక్తికముగఁ
గట్టకడపట పద్యమొక్కటి రచింప
నది యుదాహరణంబగు నజ్జనాథ ! (3-63)

సీ॥ ప్రథమ విభక్తికిఁ బరగు వీరావళి
మఱి ద్వితీయకు* గీర్తిమతి దలంప
సుభగాభిధానమచ్చుగఁ ద్వితీయకు చతు
ర్థికి భోగమాలిని దృఢముగాగ
క్షితిఁబంచమికి కళావతి కాంతిమతి షష్ఠి
కమరు నుదాత్త సప్తమికిఁ గమల
సంబోధనమునకు జయగతి యీగతిఁ
దగు విభక్త్యధిదేవతాచయంబు.

గీ॥ నెలమినయ్యాయి విభక్తుల నెసగఁ జెప్పఁ
గావ్యములను సంతోషించి కరుణతోడ
నాత్మనామాభిరూప ఫలాభివృద్ధి
భర్తలకుఁ గర్తలకుఁజేయు పద్మనాభ. (3-64)

# శ్రీకృష్ణదేవరాయ యుగము

## ( క్రీ. శ. 1500-1600 )

వైష్ణవ మతమునకు సంబంధించిన మొదటి యుదాహరణ మీయుగమున వెలసినది. అది తాళ్లపాక పెదతిరుమలయ్యగారి "వేంకటేశ్వరోదాహరణము". దీనికి సమకాలికముగనే చిత్రకవి పెద్దన రచించిన "హనుమోదాహరణము"ను పేరు గన్నది.

సంపూర్ణమగు నుదాహరణములేగాక, ఈ కాలమున వెలసిన ప్రబంధములలో నుదాహరణ సూచనలు సందర్భానుసారముగా పొందుపరుపఁబడినవి.

---

* వైవాసిలో గీర్తిమతి, కళావతి, భోగమాలిని, జయగతి మొదలగునవి ఆయా పాత్రల పేళ్ళనియు, తొల్లి దేవదాసీ లీ యుదాహరణములను చదివి నాట్యము నేయుచుండెడి వారనియు వారివారిపేళ్ల యాయా విభక్తులకుఁ బెట్టఁబడెననియు నిది ప్రాచీన సంప్రదాయమనియు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తెలిపిరి.

# శ్రీ వేంకటేశ్వరోదాహరణము

## తాళ్లపాక పెదతిరుమలయ్య

### ప్రథమా విభక్తి

[శ్రీతిరు వెంగళనాథదేవునికిఁ దాళ్లపాక అన్నమాచార్యుల కొమారుండు పెదతిరుమలాచార్యులు విన్నపము చేసిన యుదాహరణ.]

ఉ॥ శ్రీకరుణాకరుండగుచు - జీవుల కీవులఁ బ్రోచి కాచుచుం
గైకొని లోకముల్ మనిపి - కర్తయు భర్తయునై మునుల్ సురా
నీకము లోకముం బొగడ - నీరజజాతుని తాతయైన సు
శ్లోకుఁడు వేంకటేశ్వరుఁడు - చూడఁగనొప్పెడు బ్రహ్మమింతకున్.

### కళిక - వృషభగతి రగడ

మఱియు నెఱుకలకెల్ల నెల్లగు - మహితహితజనకల్పభూజము
మెఱపులొఱపులఁ జెలఁగు వెలుఁగుల - మించుమించుల మొదలి తేజము
మడుఁగువెడలని చిలువచెలువము - మాయఁజేయు మహానుభావుఁడు
జడధినడుమను తెరువువిరివిగ - జరపి పఱపిన దేవదేవుఁడు
కరము లురలఁగ బాణుప్రాణము - గాఁచి యేఁచిన నాఁటి నేర్పరి
సొరిది బిరుదుల యసురవిసరము - ప్రుక్కఁ ద్రొక్కిన వేల్పుఁదీర్పరి
పడగ లడరెడు శయ్యనెయ్యపు - భామఁ బ్రేమ రమించు చెలువుఁడు
జడికి గొడుగుగఁ గేలశైలము - చాటు వీటికి జేయు బలువుఁడు

### ఉత్కళిక

దురితవిరహితగురుఁడు వేదపు
శరధి నురుతర శాస్త్రవాదపు
నగము సుగుణపు గుణముఁ జుట్టుచు
పొగడఁదగు సత్త్వమునఁ బట్టుచుఁ

గెరలి తరువఁగ నరుఁడు మీఱఁగ
సురలదొరలకు నోరులూఱఁగ
నంది పొందమిన యమృతసారము
నందవనితానందపూరము

ద్వి తీ యా వి భ క్తి

ఉ॥ ఏఁటికి వేల్పులార ! చద - లేటికిఁ బోయెద రిందు రండు కో
నేటికి వచ్చుఁ దీర్ధచయ - మేఁబదిలక్షలదోడఁగూడు ము
క్కోటియునంచుఁ బల్కు-ముని-కోటుల మాటలు నేర్చి కీరముల్
చాటు తటాటవిన్నటన - సల్పెడు వేంకటభర్తఁ గొల్చెదన్.

క ళి క

మఱియు నెఱిఁగినబుధుల - మనసులెనసినవాని
మెఱుఁగులకు గుఱియైన - మేనుపూనినవాని
గొల్లెతల నెల్లెడలఁ - గూడిమాడినవాని
మల్లులను విల్లునటు - మట్టికొట్టినవాని
జక్రమున నక్రమును - జడియనడచినవాని
శక్రుఁడొకవక్రగతి..................
వీరుఁడగు కౌరవుని - వీడనాడినవాని
శూరుడఁగు సీరితో - జోడుగూడినవాని

ఉ త్క ళి క

మేడెములు గూడుకొని
వాడలను దాడిగొని
యుట్టులనుఁ జట్టులనుఁ
దెట్టెలుగఁ గొట్టి చని

యాటలనుఁ బాటలను
జోటులను మాటుకొని
కలసిమెలసినవానిఁ
దులసివలసినవాని

తృ తీ యా వి భ క్తి

ఉ॥ తీఱునఘంబులెల్ల నిలుఁ - దీర్ఘమువచ్చినయంత సంపదల్
మీఱు సుఖంబుగూరు - మతి మిక్కుటమై శ్రుతివీథిఁదూఱు వే
నూఱులుఁ జెప్పనేల సుమ - నోవిభుచేఁ దిరువేంకటేశుచేఁ
జూఱలుగా వరంబులిల - జొప్పడఁ గొందము రండు మానవుల్.

కళిక - హయప్రచార రగడ

మఱియు వఱలు సుజనభజన - మానలేని వానిచేత
మెఱపు మఱపులేక జోక - విడువ కడరు వానిచేత
శ్రుతుల గతుల నడువ నుడువఁ - జొక్కిచిక్కువానిచేత
అతులమతులఁ జెలఁగిమెలఁగి - నట్టిగుట్టువానిచేత
సగముమొగముచాయదాయ - జదియనదుచువానిచేతఁ
బొగులు మగువ వలువలొలువఁ - బ్రోచి కాచువానిచేత
జాతినాతిఁజేసి వాసి - ఱట్టుపెట్టువానిచేత
వాతజాతుఁ బనులఁ గొనుచు - వసుధ నెసఁగు వానిచేత

ఉ త్క ళి క

పురములెఱియు శరమనంగ
బరగి దురము పురికొనంగఁ
బగతు లగల మిగులఁగొట్టి
నగజ మగఁడు పొగడునట్టి
గెలుపు నిలుపు తలఁపులెంచి
బలము చలము కలిమి మించి

జనుల మనుపు ఘనునిచేత
వనజతనుజు జనకుచేత

చ తు ర్థీ వి భ క్తి

ఉ॥ భావజుతండ్రియై కుసుమ - బాణుని మామమఱందియై చకో
రావళిమిత్రుఁగన్నతని - యల్లుఁడునై జలరాశినాత్మమా
యావటపత్రశయ్యనఖి - లాబ్జభవాండపుగుడ్లఁబెట్టునం
చై విలసిల్లు వేంకటవి - హారునకై నుతు లేనొనర్చెదన్.

కళిక - వృషభగతిరగడ

మఱియును గొఱగలపుడమికి నొడికపు
మగఁడై నెగడెడు నఖిలేశులకై
కలకఱిమెఱయ సృగాలుని గాలుని
గనుగొనబనిచిన విజితాశునకై
కన్నుల వెన్నెలయెండయు మెండుగఁ
గాయఁగఁ జేయఁగఁ గల విష్ణునకై
జన్నము లెన్నడు చదువుల పదవుల
సరణుల దిరిగెడువర్ధిష్ణునకై
జగముల మగఁటిమిఁగావఁగఁ బ్రోవఁగఁ
జాలినయేలికయగు మూర్తికినై
తగులమి మిగులఁ బ్రపన్నులసన్నిధిఁ
దరలకమరఁగిన వరకీర్తికినై
నరులకు సురలకు ముంగిటఁ
జెంగట నమ్మినసొమ్మగు నగధీరునకై
యురమున సిరి గడుఁజెలఁగఁగ మెలఁగెడు
నున్నత సన్నుతమణిహారునకై

ఉ త్క ళి క

ధారుణి భారనివారణకలకై
శౌరవిహార విచారమనెడికై
తవమున జపమున బవిరితిరుగుకై
దువుఁ గొని వివిధసవిధదానవకై
కసరుధిర సలిలమెసఁగ విసరికై
వసముగ సురవిసరమునేలిన కై
లాసనివాస సతీవంద్యునకై
హాససమున్నత బుధవంద్యునకై

పంచమీవిభక్తి

ఉ॥ కొండలవంటి సంపదలు - కొండనివేగమె చాగమిచ్చుచో
గండరగండఁడై పసిఁడి - కంబమునం బడగెత్తియుల్లస
త్కుండలమండలాధిపతి - గోత్రవిచిత్రనివాస సౌఖ్యమున్
దండిగఁ గాంచు వేల్పువల - నన్ సుఖమందెద మెల్లకాలమున్.

క ళి క

మఱియు గుఱుతగు గుణసు - మణులు గలపతివలన
మఱఁగు మొఱఁగులు లేని - మానవుల గతివలన
గురువరుని గతసుతులఁ - గూర్చుశూరునివలన
బురహరుని పగతుఁదెగఁ - బోరుధీరునివలనఁ
గమలమునఁ దనయుఁగను - గరుడవాహనువలన
సమితహితయువతితతి - నవ్యమోహనువలన
నలువనెలవవల ధ్రువు - నకు నొసగు హరివలన
కలువచెలిచెలియలిని - గలయు బిత్తరివలన

## ఉ త్కా ళి క

తెఱఁగు లెఱుఁగనిబండి
విఱిగి యొఱఁగఁగఁ బండి
యుద్దిమద్దులఁ ద్రాల్చి
గ్రుద్ది యెద్దులఁ గూల్చి
ఘాతఁబాతనఁ దీర్చి
చేతనేతులు గూర్చి
యున్న వెన్నునివలన
నున్నతోన్నతువలన

## ష ష్ఠీ వి భ క్తి

ఉ॥ మానిసిపిండ్లమొత్తు నెఱ – మంటలపిల్లలకత్తివేల్పు పెన్
బోనపుముద్ద నిద్దముల – పొల్పుదొలంకెడు సంకుఁగల్గు నె
వ్వానికి వానికి న్నుతభ – వానికి వేంకటశైలశృంగస
న్మానికి భక్తసంపదభి – మానికి నే శరణంచు మ్రొక్కెదన్.

## క ళి క

మఱియు నెఱయు మంత్రతంత్ర – మర్మధర్మకీలకునకు
ఏఱుత యుఱుత భక్తిశక్తిఁ – జెలఁగి మెలఁగు పాలకునకు
హేమధామనూత్నరత్న – సుకరమకరకుండలునకు
సోమధామగానమాన – సక్తభక్తమండలునకు
బంతిఁగొంతి తనుజుననుజు – బండినుండు మాధవునకు
చెంతయుంతి గంధమంది – చక్కనొక్క భూధవునకు
రాజిరాజి కుంభికుంభ – రక్తసిక్త భీకరునకు
భోజరాజపుత్రిమైత్రిఁ – బొదలి మొదలు శ్రీకరునకు

## ఉత్కళిక

భువనసువన ఫలములలమి
జవనపవన బలముకలిమి
మెదలుపొదల మఱఁగి తిరిగి
చదలతుదలకరిగి పెరిగి
పేపుమాపు మించిపొంచి
రూపుచూపి సంచరించు
యోగరాగ కీరమునకు
యాగభాగసారమునకు

## సప్తమీవిభక్తి

ఉ॥ కోరిపదారువేలయిన - కొమ్మల నెమ్మదిఁ బెండ్లియాడియున్
ధారుణిఁబ్రహ్మచారినని - తప్పకపల్కి పరీక్షితున్ మహో
దారతఁబ్రాణమెత్తుచుఁబ్ర - తాపముమీఱఁగఁబ్రోచిమోహనా
కారునియందు వేంకటశి - ఖామణియందు మనంబు నిల్పెదన్.

## కళిక

మఱియు శోభిగుణాభి - మానియందు
తఱినాభి జనితాభి - ధానియందు
శతపత్ర సమనేత్ర - శౌరియందు
తతచిత్రతర గోత్ర - ధారియందు
శతకోటి శతకోటి - సారియందు
క్రతువాటి రిపుధాటి - కారియందు
భుజగేంద్ర ఘనసాంద్ర - భుజునియందు
రజనీంద్రరుంద్ర గో - త్రజునియందు

## ఉత్కలిక

భువియుఁ బవనంబు
దివియు భువనంబు
రుచులు నచరంబు
ఖచర నిచయంబు
నలరు బలుసొంపు
గలుగు చెలువంపు
ధరణి ధరునందు
బరమ గురునందు

## సంబోధన

ఉ॥ చాలిన నీ ప్రభావములు - వర్ణనసేయఁగ రావు కీలికిన్
బాలికిఁ బద్మమాలికిని - సోలికినున్నసురాలికిం ప్రభా
మాలికి నాకునెన్న వశ - మా యసమానగుణాఢ్య ధన్యగో
పాలక బాలకా నిగమభాషణ కీలక వేంకటేశ్వరా !

## క్రికి

మదిమి: దళవగు సిరుల - మరుల కొనఁగెడుదాత !
ఒలుకు పలికెడి విలుచు - ఘన జనకజామాత !
మెక్కు-నవు రక్కసుల - వేఁచి కాచినవాఁడ !
యుక్కు-ఁగనక్కు-దలి - యుబ్బుగిబ్బినతేఁడ !
పిడుగుఁ దెడుదగఁజేయు - విందుపొందులజాణ !
ముడుదు వెడుదనఁ జాటి - మూటగట్టిన గాణ !
లేచి శరకోటి నెద - లించి త్రుంచిన రామ !
మేటి నాగేఁటిఁగది - యించి చించినరావు !

ఉ త్క ళి క

ఘనవనధియను పాదు
నను మునుఁబలుకుఁ బ్రోదు
లలర మొలచిన మొదలు
కలిమి చలువలఁబొదలు
ప్రమదసుమములఁ దొల్లి
యమరిన రమావల్లి
జెలఁగునో యెలఁదేఁటి !
కలికి తలములమేటి !

శా॥ నీ పీఠండవు నిన్నుఁగొల్తు వరముల్నీచేతఁ గైకొందునేఁ
గైవారంబొనరింతు నీ కొలకు సంకల్పింప నీడేఱె మ
త్సేవల్ నీవలనన్ మహోయశము నిల్చెన్నీకు నీయందు ల
క్ష్మీవాల్లభ్యము గంటి భక్తవరదా ! శ్రీవేంకటాద్రీశ్వరా !

ఉ॥ ఆరవితారకంబుగ ను - దాహరణంబు రచించె భక్తివి
స్తారతఁ దాళ్ళపాకపుర - శాసనుఁ డన్నయ తిమ్మనార్యుఁడిం
పారఁగఁ జక్రనందక గ - దాంబుజధారికి శ్రీవధూమనో
హారికి వేంకటాచల వి - హారికి శౌరికి నంకితంబుగాన్.

మంగళమహ శ్రీశ్రీఁజేయున్

శ్రీవేంకటేశోదాహరణము సమాప్తము.

---

## ఉదాహరణ లక్షణ సూచనము

### చింతలపూఁడి యెల్లకవి, (రాధామాధవకవి)

ఈతఁడు తన రాధామాధవమున తృతీయాశ్వాసములోని శ్రీకృష్ణస్తుతి యందు నుదాహరణ లక్షణములలో నొకటియగు సార్వవిభక్తిక పద్యమును రచియించినాఁడు. అది రగడలో నుండుటయు విశేషము.

మధురగతి రగడ :—

నీవేచిన్మయమూర్తివి తలపఁగ
నిన్నుం గొలువ శుభము సేకూరును
నీచేతఁ దమోవరణము విరియును
నీకై నుతివాఙ్మణు లొనగూర్చుట
నీ వలనఁ గృతార్థత్వము నొందుట
నీకును సరిగా రేవేలుపులును
నీయందు దలంపులు నిలుపందగు
నీరేజాక్షః రక్ష నమస్తే

రాధామాధవము - శ్రీకపిలేశ్వరపురాధితులచేఁ బ్రకటితము. కాకినాడ ముద్రాక్షరశాల, కాకినాడ. 1936.

---

### ఉదాహరణ లక్షణము — మూర్తికవి

నరసభూపాలీయమున మూర్తికవి కావ్యరూపములను చెప్పు సందర్భమున మహాకావ్యలక్షణము చెప్పి—

"ఇందునొక కొన్నికడమైన నెంచిచూడ
నదియు నవని మహాకావ్యమనఁగ బరగు
మఱియు క్షుద్రప్రబంధ నిర్మాణమర్మ
లక్షణము లేర్పఱించెద లలితఫణితి." —2 ఆ. 168 పద్యము.

అని యుదాహరణ లక్షణముఁ జెప్పినాఁడు.

క్షుద్రప్రబంధము :—

కం॥ కలికోత్కలికలు పద్యము
లలరారు విభక్తులుం దదాభాసయుతో
త్కలికలు సజయతిపదమౌ
నలమాలిని మొదలఁ దగ నుదాహరణమగున్.

కం॥ అందు విభక్త్యాభాసము
లందుఁ జతుర్థికిని తెనుఁ గుదాహరణము పెం
పొందం గలికోత్కలికల
సందీప్త విభక్తితాల సంప్రాసంబై.

—2 ఆశ్వాసము 168, 169.

ఉ దా హ ర ణ సూ చ న ము

అయ్యలరాజు రామభద్రకవి తన రామాభ్యుదయ కావ్యములో శ్లేషగా నుదాహరణ లక్షణమును చెప్పినాఁడు. ఇది వసంత వర్ణనమున పొందు పరుపఁబడినది.

కం॥ తలఁప నుదాహరణాకృతిఁ
గళికల రంజిల్లి సరసకవి కావ్యమునుం
బలె నెడల మత్తకోకిల
కలన న్మధువేళ మధునికాయం బమరెన్.

—1 వ ఆ. 53.

ఇట కలికలు మొగ్గలు శ్లేషలో కావ్యభేదము పేర్కొన్నాఁడు.

# శ్రీ హనుమోదాహరణము

చిత్రకవి పెద్దన

## ప్రథమా విభక్తి

ఉ॥ శ్రీహనుమన్మహాకపి వ - రేణ్యుఁడు పుణ్యుఁ డగణ్యసద్గుణ
వ్యూహమనోజ్ఞభూషుఁడు స - మున్నత వాలధి జాతవాతసం
దోహనివారితాసుర ఘ - నుండు యశోధనుండు తే
జోహిమదీప్తి రాఘవభ-టాగ్రణి ప్రోచును మమ్ము సత్కృపన్.

కళిక - వృషభగతి రగడ

మఱియు దశరథరాజనందన
మంజుపాదసరోజభృంగము
కఱకుటసుర లనియెడు మదగజ
ఘటలఁ బోరిఁగొను కొదమసింగము
బలిమి గరుడనితోడ నేరెడుఁ
బంటికై పెనఁగిన యుదారుఁడు
చెలఁగి యక్షునిఁ బట్టి చట్టలు
చీరివైచిన సమరశూరుఁడు
దాసులకు ముంగొంగుపసిఁడి వి
ధమున వెలసినయార్తబంధుఁడు
వాసవాదిసమస్తనిర్జర
వర్ణితామిత సుగుణసింధుఁడు
ఎగిరి జలనిధిదాఁటి లంకిణి
నేపుమాపిన విక్రమోగ్రుఁడు
పగడములఁ జిగిఁ దెగడు మొగమునఁ
బరగుచుండెడు శుభసమగ్రుఁడు.

## ఉత్కళిక

ఎదురు నసురుల కడుఁ జలంబునఁ
చదియఁ గొట్టి భుజాబలంబునఁ
బెరికి మందుల గట్టు గొబ్బున
మెఱసి తఱితోఁదెచ్చియుబ్బున
కడిమి నని దశకంఠుఁ డేసినఁ
బడిన లక్ష్మణు బ్రదుకఁ జేసిన
వీరవానర సార్వభౌముఁడు
ధీరకైరవ పూర్ణసోముఁడు.

## ద్వితీయా విభక్తి

ఉ॥ మానును రోగముల్ వెతలు - మానును లేములుమాను మీకు నో
మానవులార ! ఊరక భ్ర - మంగొననేఁటికి నన్యదేవతా
ధీనులు గాక యెప్పుడు న - తిస్థిరభక్తిఁ దలిర్పఁగొల్వుఁడీ
మౌనినుతప్రసిద్ధమతిమంతుని-మా హనుమంతుని న్మదిన్.

## కళిక - ద్విరదగతి రగడ

మఱియు భీమాకార - మకరిఁ గొట్టినవాని
మెఱసి రణమునఁ బెరిగి - మిన్నుముట్టినవానిఁ
బేరుగల రక్కసుల - పీఁచ మడఁచినవాని
వారాశి ముమ్మాఱు - వడిని గడచినవాని
బ్రహ్మాస్త్ర బంధంబుఁ - బాయఁ ద్రెంచినవాని
బ్రహ్మపట్టంబునకు - భావముంచినవాని
నిలభాగవతులందు - నెన్నఁ జాలినవానిఁ
గలితధృతి వేలుపుల గట్టుఁ - బోలినవాని.

ఉత్కళిక

భీమగతిఁ బాతాళ
హోమమొనరుచు వేళ
మబ్బుదిరుగుడుఁజేని
యుబ్బుచెదరఁగ బూని
సంచలించుచు బొబ్బ
రింపఁగా నొకదెబ్బ
వేసియార్చినవాని
వాసిఁజేర్చినవాని

తృతీయా విభక్తి

చ॥ భవహరమౌను పుట్టువును - పావనమౌను దరిద్రతావ్యథా
నివహములన్నియుం దొలఁగు-నెమ్మదినెవ్వని పుణ్యసత్కథల్
చెవులను విన్నవారలకు శీఘ్రమె-చేకుఱు నట్టియాజినం
భవహితదాసుచేత హనుమ-త్ప్రభుచేత నభీప్సితార్థముల్.

కళిక - తురగవల్గన రగడ

మఱియు సురసమాయఁగెలిచి
మహిమబొఱయు యోగిచేతఁ
వెఱికి రావణుని మనంబు
పెంపుపఱచు వేగిచేత
గట్టిగాఁగఁ బసిఁడిముంజి
గట్టుకొన్న వటునిచేతఁ
బట్టిరాతి నాతిఁజేయఁ
జాలినతని భటునిచేత
రవిజుఁదెచ్చి పంపయొద్ద
రాముఁగూర్చు ఘనునిచేతఁ

జవుటికడలి దాఁటినట్టి
జవవిశాలధనునిచేత
మఱవ కెపుడు దాసజనుల
మనుచు మునివిధేయచేత
నెఱుక మెఱసి వరములిచ్చి
యెసఁగు నాంజనేయుచేత.

ఉత్కళిక

మొదలిచదువు జాగిలములు
పొదలిసోఁకు బంటుగములు
తొలిచి రాఁగ నలుగునేసి
నిలిచి మించు చెంచుడాసి
పోరిలోన గెలువఁ జాలు
వీరుఁడైనవాని డాలు
నందునున్న వేల్పుచేత
మందరాగ కల్పుచేత

చతుర్థీ విభక్తి

ఉ॥ చాటుమహాప్రబంధముల - జాడలు లక్షణవేత్తలౌనన్
సూటిగవిన్నవీనులకు - సొంపుగ నేనిటుకావ్యముల్ మహా
నాటకముఖ్య కావ్యము - లొనర్చినయట్టి మనీషికై మహీ
జాటకులాబ్జ భాస్కరుని - కైహనుమత్ప్రభుకై యొనర్చెదన్.

కళిక హరిణగతి రగడ

మఱియును బంగరుజందెము ముంజిక
మండలు దండము గల పుణ్యునకై
మెఱయఁగ సుగ్రీవాంగదు లొనన
మెలఁగెడు కపిలోకవరేణ్యునకై

తొలువేలుపుఁ దపసిని నొకపిడికిట
దునియఁగఁ బొడిచిన బలుమల్లునకై
వెలసిన పెను రాకాసి మెకమ్ముల
వేఁటాడెడు భీకర భిల్లునకై
మహిఁగల సద్గుణమహిమనుఁ బొలుపగు
రామాయణ హారోజ్జ్వలమణికై
మహిదుహితృమనోవల్లభ దాస స
మంచితధీవరకై రవ ఘృణికై
బళిరా యన బలుజాయి కరంగఁగఁ
బాడిన గాన కళాలోలునకై
సలలిత సుకృత ఫలంబున కేసరి
సతిగాంచిన ముద్దులబాలునకై

ఉత్కళిక

వేసర కిర్వది చేతుల నల కై
లాసము నెత్తిన బలు దొరపురి కై
పవిలసఖుం డాహుతిఁగాఁ గొని కై
కొనఁగాఁజేసి ప్రతాపమహా కై
రవ రిపునెసగించుచు మాయా కై
తవబలులగు దనుజుల మతయుత కై
టభవిభులను దునిమిన శూరునకై
శుభములు నతులకు నిడు ధీరునకై

పంచమీ విభక్తి

ఉ॥ ఏ పెదనైన వైష్ణవజ - నేతరులన్ భజియింపఁబోక మీ
రాయత బుద్ధులౌ మనుజు - లార భజించిన మాత్రగొబ్బున
న్వాయనిలాత్మసూను వల - నన్ రఘువంశజ రామధారుణీ
నాయక కార్ముక త్తవలనన్ - విడఁ జాలును కర్మబంధముల్

కళిక - ద్విరదగతి రగడ

మఱియు సూర్యకుమార - మంత్రి కుంజరువలన
మఱలు నతజన వార - వజ్రపంజరువలన
సవినయస్థితిఁ బొల్చు - సత్యసంధునివలన
భవదోషపటు తిమిర - పద్మ బంధునివలన
విజితేంద్రియత్వమున - వెలయు జయధనివలన
నజముఖ్య సురవినుత - హరిగుణ ఖనివలన
భీమాజి నిశ్శంక బిరు - దోద్ధురుని వలనఁ
దామసాకృతి దైత్య - తతి భీకరునివలన

ఉత్కళిక

రామతలిఘప్రసాద
మోమితీసుకమోద
గతిఁజెందఁగానిందు
మతిదెబ్బదియురెందు
వెల్వాలకునేమించి
తెల్విమీఱఁగఁబంచి

(యొసగుమాన్యునివలన ఎసగుధన్యునివలన)

షష్ఠీ విభక్తి

ఉ॥ దొంతులుగా మహాగిరులు - తోరముఁగల్గిన తోఁకచుట్టుపై
వింతవహింపఁజేర్చి విను - వీథిని మబ్బున గొబ్బు గొబ్బునన్
బంతముమీఱఁ గట్టకును - బల్మఱుఁ దెచ్చినయట్టి యాన భ
స్వంతునిఁ బట్టికిన్ ప్లవగ - చంద్రున కెవ్వరుసాటి లావునన్.

కళిక - తురగవల్గన రగడ

మఱియు బెఱయు రామనామ - మానవేన సేవకునకుఁ
దఱచు మెఱచు నక్షవృక్ష - దారుణోరుపావకునకుఁ

చెలువు నలువుగలిగిమెలఁగు - శ్రీప్రతాప్రభంజనునకుఁ
బలము బలమునెన్నఁగన్న - సాధుయూథరంజనునకు
క్రూరశూరపాళి పాలి - దేవతావనీజమునకు
భూరివారిజాప్త దీప్తిఁ - బొల్చునిల్చుతేజమునకుఁ
గేలమేలిఫలము : లలము - కీశదేశభూషణునకుఁ
జాలవాలమూఁచి చాచు - శత్రు గోత్రభీషణునకు.

## ఉత్కళిక

రాముచే మెఱుంగెసంగ
భూమమైవెలుంగునుంగ
రమిడి చిముడు సీతచేత
సమరసమర రీతిచేతఁ
గినుకఁజెనకి చుట్టిపట్టి
దనుజతనుజుఁ గొట్టినట్టి
దళిత లలిత వనకులునకు
గళిత కలిత దినకరునకు.

## సప్తమీవిభక్తి

శా॥ నందిగ్రామపురంబునన్ భరతుఁడుం-డన్ ముందుగావచ్చి యా
మందేహారి కులాబ్ధిచంద్రునకు-రామక్షేమ వృత్తాంతముల్
విందుల్ సేసిన పుణ్యునందు దితిభూ-విధ్వంసి యందున్ సుధీ
బృందారాధితపాదునందు నిలిచెన్-శ్రీమత్ప్రతాపోన్నతుల్.

### కళిక - హంసగతి - రగడ

మఱియు నుతికెక్కు శ్రీ - మంతునందు
జరపక వరంబు లిడు - శాంతునందు
భావసేవిత రామ - భద్రునందు
రావణముఖాసహ్య - రౌద్రునందు

ప్రకటితాచార సంపన్నునందు
సకలహిత సాధు ప్ర - సన్నునందు
స్వామి హితకార్య ని - ర్వాహునందు
సామాదినయ సము - త్సాహునందు.

ఉత్కళిక

పవనవేగంబు
వివిధయోగంబు
ప్రచురశౌర్యంబు
నచలధైర్యంబు
చారువిస్ఫూర్తి
భూరిసత్కీర్తి
గలసుకృతియందు
వెలయుప్రతియందు

సంబోధన

ఉ॥ భీమమహోరులంగెలిచి-పెద్దతికంబొనరింపు మంచు శ్రీ
రాముఁడు మెచ్చియిచ్చిన వి-రాజిత బంధుర తారహార మా
భూమిజఁదెచ్చి కంఠమున-బూన్చిన చెల్వువహించునాఁటి నీ
శ్రీ మహితాకృతిం దలఁతు-చిత్తమునం బవమాననందనా!

కళిక - ద్విరదగతి రగడ

మఱియు ఛాయాగ్రాహి - మదమడంచిన వీర!
నెఱయ పరమధ్యాన - నిష్ఠాసమాచార!
భావివేళాబ్రహ్మ - పట్టోచితాకార!
గ్రావసమధృతిఁగల్గు - గంధవాహకుమార!
గళిత శాత్రవదైత్య - కామినీతాటంక!
కలిత లంకాపురీ - గ్రావ భేదనటంక!

ధూమ్రాక్ష హరణైక - దోశ్శక్తి బిరుదాంక !
క్రమప్రతాప ఘన - కాంతిజిత ధూమాంక !

ఉత్కళిక

అనిరామలక్ష్మణులఁ
గొనిదాచుదుర్గుణుల
నలరసాతల లంకఁ
గలచి త్రుంచి కడంకఁ
బుడమి కా రాఘవుల
వడిఁదెచ్చి కడుమివుల
వెలయు దీనశరణ్య !
యలఘుపుణ్యా శరణ్య !

సార్వ విభక్తికము

శా॥ నీవాద్యుండవు నిన్ను గొల్తు నెపుడున్-నీ చేత శ్రీమించె నీ
కై వే మ్రొక్కులొనర్తు నీవలన-నిష్టార్థంబు సందిల్లె నీ
కే వైరుల్ భయమందకుండ్రు మది-నూహింపంగ నీయందు శౌ
ర్యావిర్భావ జయంబు లెచ్చెను జగ-త్ప్రాణోద్భవా ! ధీనిధీ !

అంకితాంక పద్యము

ఉ॥ లక్షణసార సంగ్రమి - శత్కలనామతి సన్నుతోపమో
త్ప్రేక్షలు మీఱఁ జిత్రకవి - పెద్దన యర్పణచేసె మీకు నో
యక్షయ శౌర్య యీ భవదు - దాహరణంబు జగత్ప్రసిద్ధియై
యీ క్షితి మించఁజేయుము మ - హీతనయాధిప పాదసేవకా !

లక్షణసార సంగ్రహము - ముద్రణము 1937. ఆంధ్రసాహిత్య పరిషత్తు. కాకినాడ.
పీఠికా కర్త. సంపాదకర్త. వి. వేంకటరావు ఎమ్. ఏ.

## ఉదాహరణ సూచనము

నిస్సహాయ కవితా ధురంధరుఁడగు బైచరాజు వేంకటనాథకవి (రాజకవి) తన పంచతంత్రములో (4-121).

చ॥ సరసగభీర శబ్దఘనసారసమృద్ధిఁ బ్రసిద్ధిగన్న యా
సరసులగూడి చారుగతి సద్వ్రతతుల్ భజియింప పాదవి
స్ఫురణఘటింపుచున్ దొడుసుపుట్టక యుజ్జ్వలధారచే నుదా
హరణము చేయుచున్నకవి నారసి చూడు మరాళగామినీ!

ఇందు శ్లేషగా నుదాహరణలక్షణము గలదు. కవి - కావ్యము చేయువాఁడు; నీటిపక్షి

గభీరశబ్దములు; చారుగతి; పాదవిస్ఫురణ - ఉజ్జ్వలధార యిరువురికి సమానములు.

మఱియు తృతీయాశ్వాసమున వసంతవర్ణన చేయునపుడును నుదాహరణము స్మరించినాఁడు.

"మఱియు నవ్వసంతంబు కళికాభిరామంబై యుదాహరణంబును శుకసూక్తి సందర్భగర్భితంబై భాగవతంబును (3-144).

# హ రి హ ర శ్లే షో దా హ ర ణ ము

## చిత్రకవి అనంతకవి

లక్షణసార సంగ్రహకర్తయగు చిత్రకవి పెద్దన పుత్త్రుఁడగు ననంత కవి హరిహర శ్లేషోదాహరణమను నుదాహరణము రచియించి నట్లాతని పుత్రుఁడగు చిత్రకవి వేంకటరమణకవి తన 'సాంబవిలాస' గద్యలోనిట్లు వ్రాసియున్నాఁడు.

"ఇది శ్రీహనుమత్ప్రసాద లబ్ధసార సారస్వతపాత్ర, భారద్వాజ గోత్రపవిత్ర, ప్రథమశాఖావంశ సంభవసముజ్జ్వలత్కాత్యాయనసూత్ర లక్షణసారసంగ్రహ రచనా విశారద చిత్రకవి పెద్దనార్య పౌత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యాన, వ్యాఖ్యాన, హరిహర శ్లేషోదాహరణ సకలజీవ సంజీవన ప్రబంధ బంధుర వంశావళి సృజనాధురంధర అనంత సత్కవీంద్రపుత్ర, దయాదాక్షిణ్యాదిక సమస్త సద్గుణ కదంబాంబా సమానౌబళాంబా గర్భక్షీర వారాశి కుముదబాంధవ చరిత్ర, శ్రీసుబ్రహ్మణ్యేశ్వరాంజనేయాంకన మంజుల త్రిలోకసంజీవన్యభిమన్యువిలాస, సకలవర్ణనాపూర్ణ రామాయణ కుమారగురు విలాసాదిక దివ్యత్కావ్యకరణాతిధురీణ శేముషీవిశేషణ రాఘవ పాండవీయ, విష్ణుచిత్తీయ, వసుచరిత్ర ప్రముఖదివ్య త్కావ్యార్థ బోధన సమర్థహృదయ కమల విద్వత్కవీంద్రవిధేయ వేంకటేశ్వరనామ వేంకటరమణ కవీశ్వర విరచితంబైన సాంబవిలాసంబను మహా ప్రబంధంబునఁ బ్రథమాశ్వాసము."

చిత్రకవి యనంతకవిరచితమైన యుదాహరణము లభింపలేదు. ఇట్లే యితని సకలజీవనసంజీవని, వంశావళి గ్రంథములు లభింపలేదు. ఇతని హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్యానము చాల ప్రసిద్ధమైనది.

(అముద్రితము సాంబవిలాసము సంఖ్య 123 బి మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము).

ఉదాహరణ సూచనము

షట్చక్రవర్తి చరిత్ర - మల్లారెడ్డి

కార్త్యవీర్యుని కథ - దత్తాత్రేయ ప్రార్థనస్తుతి.

వృ ష భ గ తి ర గ డ

మధునిశాచర వైరినీవై - మాహురిని నిద్రించువాఁడవు
నిన్నుఁగానఁగఁ జాలరెవ్వరు - నిఖిలమును నీవెంచఁగందువు
నీదుచే లోకంబులెల్లను - నిల్చెశ్రీలును హెచ్చి యిప్పుడు
వేదములు నీకై నుతల్పది - వేల భంగుల నిచ్చు నెప్పుడు
భుక్తిముక్తులుగాంతు రెంతయుఁ - బొల్పుతో నీవలన దాసులు
భక్తియుక్తులు నీకె గల్గఁగఁ - బ్రబలుదురు వైకుంఠవాసులు
తొదరి సద్గుణతతులు నీయం - దున వసించె ప్రభావనీరధి
చెడని భక్తి యొసంగినను ర - క్షింపవే కరుణాపయోనిధి !
నీ మహామహిమంబు పొగడఁగ - నేర్తు నే యజ్ఞానహృదయుఁడ
స్వామిదత్తాత్రేయలోక ని - వాస లసదసమానసదయుఁడు.

## దక్షిణాంధ్ర యుగము

దక్షిణాంధ్ర వాఙ్మయమున బాలకవి అనంతయ్య రచించిన శేషార్యోదాహరణ మొక్కటియే సంపూర్ణము గాగలదు[1]. ఉపలబ్ధముగాని గణపవరపు వేంకటకవి యుదాహరణమును గూర్చి పుదుక్కోటలో వెలసిన యొక ఉదాహరణఖండమును గూర్చిన వివరములు లిందు గలవు.

# శేషార్యోదాహరణము

## పాలకవి అనంతయ

### ప్రథమా విభక్తి

శా॥ శ్రీకల్లింగిదిగళన్ననాయమవనిన్ - జెన్నొందు నేవంశమం
నారాయణ జియ్యరంచనఁగఁ దా - నారాయణుం డుద్భవం
బై నావంచు జెలంగు తిర్మలసుధీ - యాదోధి చంద్రుండు దా
నామాస్థిరకీర్తి శేషఘనుఁ డు - ద్యద్ధర్మ శర్మాఢ్యుఁడై.

### కళిక

మఱియు సారసగర్భసార స-మగ్రసారసమాన్యచరితుఁడు
వర సభారస భావ భారస-వర్ణ్యభారసమానరీతుఁడు
చందనాచలహార తాచయ.........సతిహృదయుఁడు
నందివాహనమతి విమోహన-నయనమోహన మహితసదయుఁడు
దిక్ప్రతిప్రతిమాన క్షిప్రతి-తిక్షతాప్రతి పక్షశౌర్యుఁడు
దృక్పరిక్షిత సుజనరక్షిత-ధీరదీక్షిత భావవర్యుఁడు
కులవధూజనభావ భాజన-కుశలతాజన వంద్యశీలుఁడు
ఖలవిరోధన ఘన విబోధన-ఖడ్గసాధన...ఖేలుఁడు

### ఉత్కళిక

అరిభుజంగమ గరుడ మంత్రము
సరస జనవర సస్య యంత్రము
సాఁగఁదనరెడు నీతి తంత్రము
నాగమోక్షముఁగాఁగ మంత్రము
నెదలఁగ్రైకొనఁ గవి నియోగము
నెదఁదఁగ్రైకొన కది నియోగము
యోగమున మను వినయసాంద్రుఁడు
భోగమున మను భూమహేంద్రుఁడు.

## ద్వితీయా విభక్తి

శా॥ రాకేందుద్యుతి తిర్మలార్యసుతు భా-రద్వాజుగోత్రున్ దయా
లోక శ్రీకరుఁ డయ్యవారయకు మే-లుంగూర్చు వేతమ్మనిన్ (?)
జోకం వేంకటరాఘవార్యునకు క-స్తూరయ్యకున్ పెద్దనా
లోకైకస్తుత కీర్తిశేష ఘను సు-శ్లోకున్ బ్రశంసించెదన్.

### కళిక

మఱియు మదమెదలేని - మహిమఁగాంచిన వాని
మెఱయు వన్నెకడాని - మించు మించిన వాని
తొలఁకు పలుకు హిమాని - తులకింప నగు వాని
సొలపు పూవిలుకాని - సొబగు ననుదగు వాని
కలితనముఁగైకోని - ఘనతమెఱసిన వాని
నెలమివేలుపుమ్రాని - యీవినెలసిన వాని
పరమధృతిఁగొఱగాని - పనులఁ గొల్పని వాని
అరులెదిర్చిన యేని - యాపు నిల్పని వాని.

### ఉత్కళిక

శూరతయు దాక్షిణ్య
సారమును నైపుణ్య
మును(వి)నయసంసక్తి
యును విచక్షణతోక్తిఁ
గాంచి మధురాధీశుఁ
డంచి తామాత్యేశుఁ
డనఁగఁదగు ధృతివాని
ననఘ మగుమతి వాని

## తృ తీ యా వి భ క్తి

శా॥ ఆనందంబున చంద్రశేఖర జటా-నంతాపగాంభోజ మా
ర్గీనవ్యోరు రసప్రధానకృతు లెం-తేపల్కికై కొండ్రు నా
నానల్పాంబర హేమరత్న బహుమా-నంబుల్ కవీంద్రుల్ ఘనుం
డానల్లింపెగరీశ తిర్మలయ శే-షామాత్యుచేతన్ ధరన్.

### క ళి క

మఱియు వారి వాహభూరి - మహిమహారిదానుచేతఁ
గఱకు వైరిఁ గలనఁజేఱి - గదుము శౌర్యభానుచేత
జగముఁ బొగడ యశము నెగడ - సవతుదెగడు ధీరుచేత
పొగరు మగుడ నొరసిబెగడ - బుధులు నిగుడ భీరుచేత
కవి చకోరకములు జేరఁ - గల యుదార చంద్రుచేత
జవవిహారతురగవార - చతురచార సాంద్రుచేత
విజయడిండిమముల నిండి - వెలయుదండి యోధుచేత
ప్రజలు...పసిఁడి...ప్రబలుదండిసాధుచేత

### ఉ త్క ళి క

మదవదరులఁ గన్నులేటి
కాదమలనుచు నెంచి సూటి
గదిమి చిదిమి యదిమి మట్టి
కదన గరిమ గదుర గట్టి
బిరుదు(లు)గ్రై కొనఁగ నేర్చి
కిడుదు దొనని పటిమఁజేర్చి
మెలఁగినట్టి శూరుచేత
కలిత కీర్తి హారుచేత

చ తు ర్థీ వి భ క్తి

శా॥ అలయించున్ వితతానురక్త గతి శూరానంగతాపాదియై
బలిమిం గుత్తుకలాను చెల్మిబలె నే భవ్యాత్మ కౌక్షేయకం
బలధీరాకృతినట్టి తిర్మలబుధేంద్రాంభోధిచంద్రుండనన్
గలశేషార్యునికై యొసంగుదురు సత్కావ్యంబులార్యోత్తముల్

క ళి క

మఱియు ననుక్షణ శిక్షణ వీక్షణ-మర్దిత మదనతరిపువారునకై
కఱకు వజీరుల భీరుల భేరుల-గర్భవినిస్రుతులిడు శూరునకై
గడిదొరలందఱఁ జిందఱవందఱఁ-గాఁ దఱిమిన తేజోవంతునకై
కడిద్విపదంబుల కొమ్ములచిమ్ముల-కరినయననురౌన బలవంతునకై
మొకురుదునేలని తేలని వాలని-మొనలిడ లోగొను వీరాంకునకై
నికటపునోదన సాధన వాదన-నెలకొను నిర్భయ నిశ్శంకునకై

ఉ త్క ళి క

జగడపుటంగులు విని విని బలుకై
పలువగలెత్తుచు తులువల వగకై
కావరమున నలుఁగులుకొనిశిఖికై
కావిరిదనురారవ పరులై కై
లాటపుచివ్వల రువ్వెడు శిఖికై
లాటన పటులగు ద్రోహులు దెగకై
కొనియసి విసరెడు నుద్దామునకై
ఘనరణ పుంగవతాభీమునకై

ప ం చ మీ వి భ క్తి

శా॥ శ్రీరంగేశ పదాబ్జ భక్తినిధియై చింతామణీ కల్పకో
దారోదారత యాచకుల్ ధరణిదాతల్గా భుజాభోగరే

ఖారూఢిన్ దిగిభేంద్రహ స్తపటిమల్ గైకొంచు పెంపొందు ల
క్ష్మీరాజన్మతిశేషయార్యువలనన్ చెల్వొందు సత్కావ్యముల్

కళిక

మఱియు నాశ్రితభరణ - మహనీయుగుణువలన
వఱలు మతివిస్ఫురణ - వాస్త వార్హ్యణువలన
అన్వీక్షకీవరణ - హార్ద గుణచణువలన
అన్వయ జనాభరణ - హర్ష మర్షణువలన
హరి దయోదయ కరణ - హతవైరిగణువలన
వరకవిజనాదరణ - వచన భూషణువలన
శరణాగతోద్ధరణ - చాతుర్యధనువలన
సరసతావిస్తార - సర్వజ్ఞ ఘనువలన

ఉత్కళిక

ప్రబలకృత దిగ్విజయ
సబలహతరిపునిచయ
సమ్మర్దరణభరిత
సమ్మ్మ...పచరిత
సురపురీవిస్ఫార
వరగోపురద్వార
మణిసౌధతటువలన
ఫణిపభుజవటువలన

షష్ఠీ విభక్తి

మ॥ అలరారున్ వలరాజుచక్కదన మార్యాధీశదూష్యంబు రి
క్కలతేఁడక్కొగు నీవి తీవియు కళంకుస్ఫారగుర్వర్థ ధి
క్కలనం.........బేటికని పల్కన్ తిర్మలాచార్య వం
శలలామోజ్జ్వల శేషయార్యునకు నెంచన్ సాటిగా సత్కవుల్.

### క ళి క

మఱియు శౌరి శౌరి మను పరీక్షకునకు
కఱకు చెఱకుపాల దేల కడవనుడువరక్షకునకు
రాజరాజ దానధార రంజ మంజిమావకునకు
భోజరాజ సాహితోప... మోపరోపధీవహునకు
బాహురాహులీఢ గాఢవైరి భూరిహిమకరునకు
సాహసావాగ్ర నిగ్రహోభి శోభి శరధరునకు
శూరవార పోషణైక చూడ జూడ మోహనునకు
గౌర గౌర సౌధ యూధ......కవితవాహునునకు.

### ఉ త్క ళి క

చటుల నిటలనయన నయన
పటలకుటిల జయన పయన
మమర సమర విజయ విజయ
గమగతమక విచయ విచయ
నీయ గేయ శోభనాభి
ధేయ రాయ బిరుదశోభి
తాగ్ర విగ్రహోదయునకు
నుగ్ర విగ్రహిభయునకు

### స ప్త మీ వి భ క్తి

మ॥ స్థిరలక్ష్మీకర వేంకటాంబికయెడన్ శ్రీ తిర్మలార్యుండు భా
స్వరశశ్వద్రఘువంశభర్తలవలెన్ పాటిల్లఁగాఁ గన్న సు
స్థిరులౌ పుత్రులు నల్వురందును జగత్ శ్రేయాంకసాంద్రాదరా
ఢ్య రసజ్ఞత్వములొందు శేషఘనునందశ్రాంత దానోన్నతిన్.

క ళి క

మఱియు నిజజయభుజ - మాన్యునందు
మఱవక తనుధృతిశత - మన్యునందు
జగదేకహేవాక - చరితునందు
ప్రగమితాజ్ఞాచక్ర - భరితునందు
పటుభీమ సంగ్రామ - పార్థునందు
చటుసామవాగ్భూమ - సార్థునందు
దీనవరదానసుర - ధేనునందు
భానుపమ కీర్తిహిమ - భానునందు

ఉ త్క ళి క

వదనముననిందు
కదనముననిందు
ధరగెల్చిక్రిందు
పఱచుసుధతాలిందు
విడుపలుకులెందు
తొడివిను నెందు
లొనగు ఘనునందు
ప్రశమదనునందు.

స ం బో ధ న

మ॥ అవనీపాల సభావహాబహూమహా వ్యాహారహారిప్రభా
భవనీభూతముఖాముఖాబ్జభవ ! సంపద్ధీర్ఘగుణోదార దా
రవధూమ్యద్రిపుజాల ! జాలపదగౌరస్ఫారసత్కీర్తి భాం
డవ ! శ్రీతిర్మలమంత్రి శేషసచివేంద్రా ! దానసాంద్రాదరా !

కళిక

మఱియు మధురాధీశ - మహితకరుణావేశ!
తరమెఱిగి విబుధేశతతులమను పరమేశ!
సంగీతసాహిత్య సంగ్రహైకస్తుత్య!
సంగరజయౌన్నత్య - సాంద్రద్యుతిసాహిత్య!
కవినిరీక్షణమాత్ర - కలితదానవిచిత్ర!
నవనవప్రియమిత్ర - నవ్యవనికాచైత్ర!
సముదారసద్ధర్మ - సముచితాంచితశర్మ
విమతసేనామర్మ - వేదిపటుశరధర్మ!

ఉత్కళిక

శ్రీరామపదభజన
సారస్వతాద్యజన
సారళ్యసంప్రాప్త
వైరళ్యరహితాప్త
రక్షణవినిస్తంద్ర
వీక్షలక్ష్మీసాంద్ర
నవ్యనిజమణిసౌధ
భవ్యగుణగణబోధ!

సార్వవిభక్తికము

మ॥ కులరత్నంబవు నీవు నిన్నెనయు శ్రీ కొల్వొప్పునీచేత కీ
ర్తులు నీకై హరియిచ్చు నీవలన మీఱున్వన్నెయున్వాసి నీ
కలరున్ సొమ్ములు విద్యహృద్యమగునీయందార్జవంబౌర! చం
చలదృక్పంచశరాంక! తిర్మలయశేషా! పోషితార్యోత్తమా!

అంకితాంకము

క॥ తెలుఁగు నుదాహరణంబిది
నలసన్నిభ బాలకవియనంతయ నీకై
వెలయించె దీనిఁ గైకొను
మలఘుసమున్మేష ! తిరుమలార్యుని శేషా !

ప్రాచ్యలిఖిత పుస్తక భాండారము – ప్రతి – సంఖ్య. R. 126 (M. S. 13–8–6) (కాగితపుఁబ్రతి).

―――φ―――

## ఉదాహరణము – రఘునాథీయము

సుదురుపాటి సాంబశివకవి

### చతుర్థీవిభక్తి

కళిక

మఱియును దుర్జన భర్జన తర్జన పరిచయ కరజయ శరజాలునకై
నరపతి రక్షణ లక్షణ.........నిజశీలునకై
హరిదతి హాటక శాటక ఝాటకకరరుచిర సురుచిరగాత్రునకై
పరిసర భాసుర భూసుర వాసర......
అధికృత గర్విత గుర్విత రోర్వితలాధిపసాది పదాతివితతికై
మధురిమపూరిత సారిత గీరిత మంగళ......
కవిజనదాన విదాన నిదానన కరకృత కరకృత వరతేజునకై
అవితతభాషణ పోషణ భూషణ సువదన భువదన...
నవలాల్మాను గలనాట్యపు తళుకై
హవణిలువరుజుల నలరెడు పలుకై
దువలుమ బూనుక దుముకుచు వడికై......

పంచమీ విభక్తి

శా॥ స్ఫాయద్దంతి ఘటాఘటోద్భవ మదాసారస్ఫురద్వాహినీ
......ధరారుహా వరస్తోమా వసంతభ్రమ
ద్గాయత్భృంగ సమూహనిష్కపటములౌ దారిన్సుధీగేహముల్
......ధీరువలనన్ రంజిల్లు నెల్లప్పుడున్.

కళిక

మఱియు విభుల కలన గరిమను ప్రభువలన
... ... ... ...నవివిభువలన
రణధరాదిక చలన రహిత శౌర్యుని వలన
గుణధరాధిక మిళన కుతుక ధుర్యునివలన

తృతీయా విభక్తి

మ॥ ... ... ... ... నీ
కరణం బల్కరి తద్గుణైక్యమని తర్కజ్ఞాళి నవ్వంబడున్
హరతుల్యప్రతి పాద్యుచేత........

కళిక

మరియును గవులను మనుచును విభుచే
నరులను కవులను ననుచును ప్రభుచే
కలనై నను బొంకని ధీరు......
గంట్లెడ గాచిన కైగల దొరచే
గంబ్లెడగాచిన కైనగవరుచే
కోటి కులావన గుణవాక్పతిచే -
కోటి... ... ... నిజముగగొలిచే
ప్రజతగం బొలిచెన్
దిను సున మనిచెన్

# ఉత్తర ప్రబంధయుగము

## స్వదేశ సంస్థానములు క్రీ. శ. 1600 - 1800

ప్రసిద్ధలాక్షణికుఁడగు అప్పకవి తన అప్పకవీయమున ఉదాహరణ లక్షణమునకు లక్ష్యముగా "శ్రీకృష్ణోదాహరణమును" రచించియున్నాఁడు. ఈ యుదాహరణము తక్క పూర్ణ కృతి వేఱొకటిలేదు. సూచనలు మాత్రము ప్రబంధములయందు చాటువుల యందుఁగాన నగుచున్నవి.

---

## శ్రీ కృ ష్ణో దా హ ర ణ ము

కాకునూరి అప్పకవి

### ప్ర థ మా వి భ క్తి

ఉ॥ శ్రీవనితాసనాధుఁడు వశీకృతభక్తమనోంబుజుండు వి
శ్వావసుఁడుగ్రసేనుఁడురువైద్యుఁడజేయుఁ డగణ్యసద్గుణ
ప్రావృతభూషణోజ్జ్వలుఁ డహఃపతికోటిమరీచిభద్రదం
తావళనాయకావనుఁ డుదారుఁడు కృష్ణుఁడు మమ్ముఁబ్రోవుతన్.

క ళి క

మఱియు దేవకిశౌరసేని కు - మారనిర్మల రత్నరాజము
కఱకు టసురుల నెల్లఁ దారుణ - కదనధారుణి దునుము తేజము
బలిమి నందనవనములోపలి - పారిజాతము ధరకుఁదెచ్చెను
కొలఁదిమీఱిన సమ్మదంబునఁ - గుండలంబులు తల్లికిచ్చెను
చెలఁగి నరునకు సూతకృత్యము - జేసి కౌరవులఁ బరిమార్చెను
తలఁపు మఱువని దాసచయములఁ - దవిలి తిరుగని ముక్తిఁజేర్చెను
వెలఁదికొఱకును బాణుచేతులు - వేయునఱికిన విక్రమోగ్రుఁడు
జలదముల జిగిఁదెగడునొడలున - జానుమీఱెడు శుభసమగ్రుఁడు

ఉ త్క ళి క

కమలనేత్రుని రాక రోయుచు
యమునయొడ్డున తపము సేయుచు

నున్న కాంతనుఁ జూచి రయమున
నున్నసుద్దివచించి ప్రియమున
సరుఁడుగూర్చిన మిత్రునానతి
కరముబట్టెడు దానిఁదానతి
విదళితాసురసార్వభౌముఁడు
యదుకులాంబుధి పూర్ణసోముఁడు

ద్వి తీ యా వి భ క్తి

ఉ॥ మానవులార : రోగములు మానును లేములులేవు సంపదల్
గానగు దుఃఖముల్దొలఁగు జాలునఘంబులు మందబుద్ధులై
దీనతనొందనేఁటికి నతిస్థిరభక్తినిఁ గొల్వుఁడీ పరా
కీయలుగాక మీరు వసుదేవకుమారకు ముక్తికోసమై.

క ళి క

మఱియు ప్రేఁతలనెల్ల - మరులు కొల్పినవాని
మెఱపి కాసను బసుల - మేపి తిరిగెడు వాని
భామతో మహావసు - బండియిచ్చినవాని
వేమరెదిరిన మగధు - విఱుగఁ ద్రోచినవాని
బాలుఁడై జోలెక్కి - పాలు ద్రావిన వాని
హేలతోఁ బదిరూపు - లెలమిఁదాల్చినవాని
తాళవృక్షములెల్ల - ధరణిఁ గూల్చినవాని
గాలిరక్కసుఁ జావఁ - గాలఁ దన్నినవాని
లీలఁగొల్తును గడిఁది - లేమిఁబాపెడువాని

ఉ త్క ళి క

మందు పావకుఁగొల్చి
కాండవాహుతిఁ ద్రేల్చి
సాక్షివేశ్వరుఁ గాంచి
సార్థనక్కడ నుంచి

దారకుండమరించి
చేరఁదెచ్చినమంచి
యరదమెక్కఁక పూని
పురికి వచ్చినవాని

తృ తీ యా వి భ క్తి

చ॥ పులసిలనేల మానవుల పుట్టును పావనమయ్యె నెప్పుడున్
గళవళమేల రోగము లకాలగతిం గడవట్టు నీతి బా
ధలును దరిద్రతావ్యధలు దవ్వులకేఁగును వాంఛితార్థముల్
గలుగు నమేయుచేత కమలాధవుచే వటపత్రశాయిచేన్.

క ళి క

మఱియు బ్రహ్మమాయఁగెల్చి – మసలు మంత్రవాదిచేత
నెఱిఁగి సౌంభకునకు వరము – లిచ్చి మెఱయు మోదిచేత
మృతతనయుని మరల గురున – కిచ్చినట్టి యమృతుచేత
నతుల రాసకేళిసలిపి – నట్టి యాదినటుని చేతఁ
బిండిరుబ్బునాతిమోము – పెరుగు దుడుచు కొంటెచేత
మండుచున్నకారుచిచ్చు – మరగి త్రావు నమరుచేత
నెలుఁగుతోడఁ బోరిమణియు – నింతిఁగొనిన యజరుచేత
వెలయఁ దులసిపూసపేరు – వేసికొనిన జోగిచేత.

ఉ త్క ళి క

గట్టిగళరపంజరంబు
గట్టఁదలఁచి వేగిరంబు
చవుటికదలి చెంతఁజేరి
పవనతనయుతోడఁబోరి
తన్నుఁ జీరినంత వచ్చి
చెన్నుగెలుపు నరునకిచ్చి

మహిమ మెఱయు కృష్ణుచేత
మిహిరకోటి దీప్తుచేత.

చ తు ర్థీ వి భ క్తి

శా॥ ఓలంబాసకుఁదేక మత్సరముతో నుప్పొంగి పెక్కేడులా
ఖీలాకారమునన్ కొలంకునడుమన్ బేటాడునక్రంబుతోఁ
జాలంగయ్యముచేసి చిక్కిన మద స్తంబేరస్వామిమై
కేలంబట్టి నిమిర్చినట్టి హరికై కృష్ణాంబు భృన్మూర్తికై

క ళి క

మఱియునుఁ గౌమోదకీయును ఖడ్గము
మణియును శంఖముఁబట్టిన హరికై
మెఱయఁగ విద్యుచ్చేలముఁ దాల్చక
మెలఁగెడుదధికణపరిదిగ్ధునకై
పెలుచం గదిసిన మల్లులనిరువురఁ
బిడికిటఁబొడిచిన బలుమల్లునకై
వెలయఁగ యమునానదిలోఁగాళియ
విషధరుఁదోలిన యదుసింహునకై
విజయుని రథసారథియై గురున్నృప
భీష్మాదులగెలిచిన భూపతికై

గజిగా యవనాభిదు ముచుకుందుని
గనుదృష్టినిఁ జంపిన శ్రీపతికై
బలువిడి దేవకి తండ్రిని మధురకుఁ
బట్టము గట్టిన గోవిందునకై
గెలఁ దాల్చినవై ఖరి గోవర్ధన
గిరిమోచిన మహదానందునకై

ఉ త్క ళి క

తొలిపుట్టువు నోము ఫలంబున వే
బలువిడినగు పేదఱికంబున వే

సరికొందలమందుచు పయనంబై
పురికింబరమానందమునం బై
కొనియుబ్బుచువచ్చి కలిమిపనికిం
గనియడుకులొసంగిన బాపనికి
గలిమిచ్చిన బాలస్నేహునకై
కలుములచే నేలిన కృష్ణునకై.

పంచమీవిభక్తి

మ॥ పురుటింటం బసిబిడ్డ చందమున వాపోవంగ నాఁడాత్మలో
మురువొప్పన్విష దుగ్ధయుగ్మకుచయై ముద్దాడు రాకాసి చ
న్నిరుగేలంగొని బాలుఁ(ద్రావుమిషచే నిమ్మైనకాలంబునన్
ధరణింగూల్చిన నంద పుత్రువలనం దార్కాణధర్మస్థితుల్.

కళిక

మఱియు గీతామృత స - ముద్రసింధునివలన
వఱలు భవపటుతిమిర - వనజబంధునివలన
బొంకుపెయ్యెడలేని - భూరిసత్త్వునివలన
జంకుపెన్నడులేని సమరనిత్యునివలన
ఖేదముల్ బెడబాపు - కేశిమర్దనువలన
నాదికారణమూర్తి - యగు జనార్దనువలన
గానరాని పదముల గాము పానుపువలన
పూనిగొ(ద్రాలికిం - బుట్టుకానుపువలన

ఉత్కళిక

తనువుబిల్వమిగురూర
దినిపాకమింపారఁ

జేసిద్రౌపదిచేత
నాసఁదీరఁగ నేఁత
యడిగిన మునీశులకు
నిడఁగల్గు దాసులకు
గల్పించుహరివలనఁ
గల్పస్థాయివలన

షష్ఠీ విభక్తి

శా॥ కారాగారమునందు వెల్వడి భుజంగస్వామిసుచ్ఛత్రమై
పైరాఁ దార్క్ష్యుఁడు వాకిటల్ దెఱువన ప్రస్తోమముల్ మీఱిశ్రీ
సూరోద్యోతిపథంబొసంగఁ దనుగొంచుం దండ్రియేతెంచి జా
ల్యారేపల్లెను నిల్పఁ బొల్చు హరికిన్వాలారనేత్రముకెక్కాదన్.

కళిక

మఱియుఁ బెఱయనెఱయ నుఱియు-మధునిఁగూల్చినట్టి హరికి
నఱిమి తఱిమి చఱిమి నుఱుము-నక్రుఁ గెల్చిన వితకరికిఁ
గఱచి పఱచి యఱచి పఱచుఁ-గపిని జంపి నచ్యుతునకు
మఱిగి తిరిగి విఱిగి సొరగు-మద్దులీడ్చినయమితునకు
సరలి కెరలి వరలి మరలి-సాళ్వుఁ జంపి నక్షరునకు
గరిమ మెరిమెయెరిమినెరిమి-కామెపల్లిమందిరునకు
నయముఁ బ్రియము రయము జయము-నరున కిడిన కేశవునకు
వ్యయము భయము లయము క్షయము-వైరికొసఁగు మాధవునకు

ఉత్కళిక

గొల్లిలెల్లఁ దల్లడిల్లఁ - బెల్లు జల్లులల్లిరాళ్ల
సోనవానమానపూని - కానరాని కోనలోన
మట్టిపట్టి గట్టిదిట్ట - రొట్టు గట్టు మట్టు గుట్ట
నూఁచి లోచినోచి మోఁచి - బ్రోచినట్టి వామనునకు

## స ప్త మి వి భ క్తి

మ॥ పృథులావంతి వరస్వయం వరమునన్వింందాను విందాదులన్
ప్రథనక్షోణిని గెల్చి సద్గుణ సుభద్రన్ భద్రదోకొంచు వ
చ్చిధరాధీశు నను జ్ఞచే ననలసాక్షీకంబుగృహోక్త్య స
ద్విధిఁ బెండ్లాడిన కృష్ణునందు నిలిచెన్ ధీరప్రతాపోన్నతుల్

### క ళి క

మఱియు నుగ్రసేనా - మాత్యునందు
నెఱిమీఱ లయకాల - నిత్యునందు
విదురార్చిత పదార - విందునందు
విదళిత ఘోరారి - బృందునందు
నాభీరు వస్త్రాప - హారునందు
బలిపట్టణద్వార - పాలునందు
జలగాది దళతనూ - చ్ఛాదునందు

### ఉ త్క ళి క

సజ్జరాగంబు
రజ్జునాగంబు
కంధియోగంబు
మంధరాగంబు
రాపుతోనూచి
వీపుతో మోఁచి
వెలయుహరియందు
జలజాక్షునందు

## సంబోధన

ఉ॥ ధర్మజుఁడంపినం జరిగిదంతిపురంబున నాంబికేయుతో
ధర్మముఁజెప్పి దుష్కృతులదగ్గఱ శాంతనవాదిసజ్జనుల్
నిర్మలచిత్తులెల్లఁగనునేరుపునస్సభఁదాల్చినట్టి ని
ష్కర్మవహాకృతిం దలఁతునాదు మనంబున నందనందనా॥

క ళి క

మఱియు జగన్మోహన - మాయఁదాల్చిన జాల
జెఱుము తఱిద్రౌపదికిఁ - జీరలిచ్చిన కాల!
సఖులతో నదిలోనఁ - జల్దిగుడిచిన బాల!
విఖనసుండెదలోన - వేఁదలిర్చినలోల!
నరు తేరినొగలపై - నాట్యమాడినవీర!
నరకుఁగొని భీష్మపై - చక్రమెత్తినశూర!
తరిని సద్గురు సుతుల - దాపరించిన సదయ!
పెరిమ నాగపురంబు - పెక్కలించిన విజయ!

ఉ త్క ళి క

గురుభీష్మరాధేయు
లరుజన్యమున నేయు
శరవహ్ని జయలెక్క
యరద మెల్లను నెక్క
తరిగొల్చునెడ పాండు
వరులనేగురి మెండు
బ్రతుకఁజేసిన పుణ్య!
పతిత దీనశరణ్య!

### సార్వవిభక్తికము

శా॥ నీ వాక్కాండవు నిన్ను నమ్మి కొలుతు న్నీ చే సుఖంబబ్బె నీ
కై వేదండ మొనర్తు నీ వలన నిష్టావాప్తి చేకూరె నీ
కే విశ్వాసముఁ జేర్చితింక మదిలో హెచ్చయ్యె నీయందు నా
కై వారంబులు శౌరసేనతనయా కామేపలీ వల్లభా!

### కవినామము - అంకితము

ఉ॥ నామనవిచ్చగింపు మిట నన్నయభట్ట కృతాంధ్రశబ్ద చిం
తామణి కల్పనోక్త కల నాచతురోపమలు ల్లపిల్ల ని
చ్ఛామతి నర్పణంబుగ నొసంగితిఁ గామెపలీశ! నీకునై
రామయమై తగన్ భగ దుదాహరణంబు జగత్ప్రసిద్ధిఁగన్

---

### ఉదాహరణ సూచనము

కుముద్వతీ కల్యాణము మట్లకుమారానంత రాజప్రణీతము

చ॥ కులగిరి పంక్తి సీసముల గూర్చు నుదాహరణంబొనర్చు ది
క్కుల గజరాజి కందములకున్ గడునూహ యొనర్చు గోణి చి
ల్వలదొర చక్రబంధముల వైఖరిమించి ధరాస్థలంబు ధీ
విలసనలీల మట్ల తిరువెంగళనాయకుఁ డాక్రమించినన్

(కుముద్వతీ కల్యాణము అముద్రితము. అడయారు పుస్తక భాండాగారము మద

---

## ఉదాహరణ సూచనము

వక్కలంక వీరభద్రకవి వాసవదత్తా పరిణయము
శ్రీ పురుషోత్తమ క్షేత్రమున జగన్నాథస్వామినిగూర్చినది.

### సార్వ విభక్తికము

శా॥ నీవేదైవత చక్రవర్తివి సభన్నిన్నేఁ బ్రశంసింతు నీ
చే విశ్వంబలరారు నీకొఱకునేఁ జేతున్నమస్కారముల్
నీవల్ల న్భవముల్ దొలంగు నెవరు న్నీకు న్సముల్గారయా
యావిర్భావమునందు లోకములు నీ యందేకదా! యోహరీ!
(చతుర్థాశ్వాసము)

క॥ అకలుషభక్తి జగన్నాయకునింబూజించి యీ క్రియం బొగడుచు
రాజకుమారుఁడు... ... ... ... (చతుర్థాశ్వాసము)

---

## ఉదాహరణ సూచనము

పోడూరి పెదరామామాత్యుఁడు క్రీ. శ. 1756

"శివరామాభ్యుదయము" అను ద్వ్యర్థి కావ్యమును రచించిన పెద రామామాత్యుఁడు "ఉదాహరణమును" కూడ రచించినట్లు పై గ్రంథములో నిట్లు వ్రాసికొనినాఁడు.

కృతిపతి తన్ను గూర్చి చెప్పు సందర్భమున

సీ॥ ....................
నీవు ప్రౌఢోక్తివి నిర్మించినావు కా
సల్యా పరిణయాది సరస కృతుల

గీ॥ మఱియు నుదాహరణాది చమత్కృతులను
సంస్కృతాంధ్రంబులను జెప్పఁజాలినట్టి
ప్రౌఢ సత్కవి వీవ ధరా తలమున
కలిత గురుగణ్య! పెదరామ కవివరేణ్య!

ఈ యుదాహరణము లభింపలేదు.

---

ఉదాహరణ సూచనము - వెలుగోటివారి వంశ చరిత్ర

ఉ॥ దేవ మహీజ మందె నొకదిక్కున మంజరి చంద్రుఁ డందె తా
రావళి వార్షికాంబుధరమందె నుదాహరణంబు వీత సం
భావనమింటి వార్తలవి మన్నన నీవలె నెవ్వరందిరెం
తే వసుధాస్థలిన్ తిరుపతిప్రభు తిమ్మ మహాప్రబంధముల్ (పుట 322)

---

ఉదాహరణ సూచనము

మట్లవారి చాటువులు - మట్లయెల్లమరాజు

శా॥ శాంతిం దుర్గుణ దోష సంఘముల నెంచంబోకు కారుణ్య సం
క్రాంత స్వాంతమున్ శుభాన్వితునిగాఁ గావించి పోషించు ధీ
మంతా ! మట్లకుమారనంతనృప ! సమ్యగ్వాక్ప్రసూనా వళీ
కాంతంబై తగు నీ యుదాహరణముం గల్పించి పూరించితిన్.

"మట్లకుమార అనంతరాజుగారు స్థాయిగా రాజ్యము యేలుచూ ఉన్న సమయమునందున యీయన అనుజన్ములైన ఖయిదులోవున్న యెల్లమరాజుగారు అన్నగారైన కుమార అనంతరాజుగారి యందు కృతిగా ఒక పద్యం చెప్పిరి." (పై పద్యమదే)

ఈ ప్రకారం పద్యంచెప్పి భట్రాజు చేతికిచ్చి అన్నగారికి వినిపించు మనగా ఆ భట్టురాజు కుమార అనంతరాజుగారికి యీ కృతి వినిపించినంతట ఆయన సంతోషించి తమ్మునియందు వాత్సల్యత వుదయించి యెల్లమరాజుగారికి మైలుపల్లె, పొందలూరు, గుండ్లూరు, వూరెంపాడు, రాయవరం యీ అయిదు గ్రామములు అమరం యిచ్చి ఉండగా యల్లమరాజుగారు ఆ గ్రామములు అయిదున్ను ఖర్చు వ్రయములకుగాను అనుభవిస్తూ ఉండిరి.

చిత్వేలికైఫీయతు - స్థానిక సంపుటము 22 - పుట 212-213.

---

## ఉదాహరణ సూచనము

పోచనకవి 'చంద్రాభ్యుదయము' అను ప్రబంధములో

"గీ॥ రసికసభయెల్ల బళిబళిరవముతోడ
వేడుకలుదేరఁగా దదుర్వీసు పర్వ
శంబరారి యుదాహరణంబు చదివి చదివి
వీణగైకొనెగీత ప్రవీణమతిని." అని పేర్కొన్నాడు. (2 వ ఆశ్వాసము)

ముద్రితము కాలేదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము నందలి D. 505, R 125 అను ప్రతుల ననుసరించి వ్రాయఁబడినది.

---

### విశ్వేశ్వరోదాహరణము - ఏనుఁగు లక్ష్మణకవి

ఇది ఈతని కృతియగు "రామ విలాసము"న బేర్కొనబడినది.

తే. గీ॥ రమ్య విశ్వేశ్వరోదాహరణ నృసింహ
దండకాదిస్తుతి ప్రబంధములుగూర్చి
సములలో నుత్తమఖ్యాతినమరినావు,
లతిగుణధుర్య ! యేనుఁగు లక్ష్మణార్య ! - అని చెప్పబడినది.

లక్ష్మణకవి విశ్వేశ్వరోదాహరణము నేఁడు లభ్యమగుటలేదు. లక్ష్మణకవి యధునాతన ప్రసిద్ధ కవులలో నొకఁడు. ఈతఁడు క్రీ. శ. 1700-1790 ప్రాంతముల జీవించియుండెను.

---

| ఆంగ్లపరిపాలన యుగము | భారత స్వాతంత్ర్యయుగము |
|---|---|
| క్రీ. శ. 1800 - 1947 | క్రీ. శ. 1947 నుండి |

పై యుగములను రెండింటిని ఉదాహరణ పరిణామ చరిత్ర ననుసరించి రెండు విధములుగా విభజింపవచ్చును.

మొదటి భాగము - క్రీ. శ. 1800 - 1937 వఱకు
రెండవ ,, క్రీ. శ. 1937 - నుండి

మొదటి భాగమున - క్రీ. శ. 1937 వఱకును ఉదాహరణ సూచనలు తప్ప సంపూర్ణోదాహరణములులేవు.

1. పరవస్తు చిన్నయసూరి శబ్దలక్షణ సంగ్రహము (1853)

ఆశ్వాసాంత విభక్తులు

బాలవ్యాకరణము క్రీ. శ. 1858 లో ప్రకటించుటకు పు చిన్నయసూరి క్రీ. శ. 1853 లో శబ్దలక్షణ సంగ్రహమును రచించెను ప్రస్తుతము లభ్యముకాదు. దీని వివరణము.

| | | | |
|---|---|---|---|
| 1. సంజ్ఞా పరిచ్ఛేదము | | 42 | సూత్రములు |
| 2. సంధి | ,, | 46 | ,, |
| 3. శబ్ద | ,, | 114 | ,, |
| 4. క్రియా | ,, | 118 | ,, |
| 5. ప్రకీర్ణ | ,, | 150 | ,, |
| | మొత్తము | 470 | ,, |

దీనికి మంగళా చరణముగా నీ క్రింది శ్లోకములు గలవు.

శ్లో॥ కరోదర ధృతోద్భూత వనజాతే సనాతనౌ
శేషాద్రి శేఖర త్పాదచ్ఛాయౌజాయా పతీస్తుమః

పూర్వేషాం లక్ష్య లక్ష్మాణి విక్రుతేర్వీక్ష్య భూరిశః
క్రియతే బాలబోధాయ శబ్దలక్షణ సంగ్రహః ॥

ప్రతి పరిచ్ఛేదాంతంబు నందును ఇది పరవస్తు చిన్నయసూరి కృత శబ్దలక్షణను సంగ్రహానుశాసన వ్యాకరణంబున........పరిచ్ఛేదము అని గలదు ఇందున్న మఱియొక విశేషమేమనఁగా ప్రాచీనాంధ్రవాఙ్మయమున పొడగట్టు సంబోధనేతర విభక్తిరూపములతో పరిచ్ఛేదాద్యములు కనుపట్టుచున్నవి.

ద్వితీయ పరిచ్ఛేదము - కం॥ సంబోధన

శ్రీచరణ సరోరుహాలా
క్షాచారు విలాసవక్షసంశ్రితజన ర
క్షాచరణ దక్షదుష్టని
శాచర కులశిక్ష శేషశైలాధ్యక్షా.

తృతీయ పరిచ్ఛేదము - కం॥ షష్ఠీవిభక్తి

శ్రీగృహమేధికి నతనిధి
కాగమవేద్యునకుఁ ద్రిభువనారాధ్యునకున్
భోగాప వర్గదాయికి
నాగాధిపశాయికంజనాధరపతికిన్.

చతుర్థ పరిచ్ఛేదము - కం॥ ప్రథమావిభక్తి

శ్రీనయనోత్పల శీతల
భానుఁడు కలుషాంధకార భానుఁడు కరుణా
ధీనుండాశ్రిత శుభ సం
ధానుండధ్యుషిత శేషధర సానుఁడొగిన్.

పంచమ పరిచ్ఛేదము - కం॥ తృతీయావిభక్తి

శ్రీలోచనాంజనాంక
శ్రీలలితాధరునిచేతఁ జిరభద్రగుణ
శ్రీలునిచేతన్ దీన కృ
పాళుని చేతన్ వృషాద్రి పాలునిచేతన్.

ఈ ప్రాచీన సంప్రదాయము నెఱిఁగిన వాఁడగుటచే సూరి యీ గ్రంథము చివర నీ క్రింది సూత్రము గావించియున్నాఁడు.

"సరూపవిభక్తి నాయక విశేషణంబులతోడ నాశ్వాసాంతంబునందును మీఁదం దదాదిని విశేష్యాంతంబులతోడను మంగళంబార్యు లభివర్ణింతురు".

---

2. మచ్చ వెంకటకవి ముఖలింగేశ్వరోదాహరణము (1895)

ఇది సంపూర్ణోదాహరణముకాదు. ఇందు కళికోత్కళికలకు సమానముగ గేయములుకలవు.

---

3. రాజామంత్రి ప్రెగడ భుజంగరాయ ప్రణీతము విజయాంక సాహసము (1903)

ఉదాహరణ సూచనము-విజయాంక సాహసము

ప్రథమాంతములు

క॥ కర్కశమానస భయదుఁడు
అర్కాంబుజవైరి పావకాక్షుండమృతో
దర్కనిజ దర్శనుఁడు
మార్కండేయేశ్వరుఁడు కృతిపతిగా

ద్వితీయాంతములు

శర్వాని పాదవినతీసు
పర్వాని విశదగాత్ర భద్రాధిప గం
ధర్వాని హత నిశాచర
గర్వాని అస్త్రాయమాణ గరుడార్యని వేడి



తృతీయాంతములు

దర్పక దర్పఘ్నునితో అ
హర్పతి తారాద్రి రాడ్రథాంగునితో
కర్పూర విభాసమానకాయచ్ఛవితో
నొగ్రంధరచనా భీష్టముం దెలుపుకొని

చతుర్థ్యంతము

శశిఖండ శిఖండునకై
వశిమానస హంసమునకై
హైమవతీ దళచ్ఛద మధురసుధావళ సంచర
దంతరంగ బంభరమణికై
సపర్యా పూర్వక నమస్కృతులర్పించి

పంచమ

శైలాధిప బాలామృదు
హేలా వివశీకృతాచ్ఛ హృదయాబ్జుని కంటె
హృదయాళుని కంటె రక్షకుఁడు వేఱెలేడని

సప్తమ్యంతములు

శ్రీ భూమీధర వరకన్యా భాస్వరవామ భాగునందు
ఉరగాధీశాభరణునందు అనవద్య ప్రాభవ
జితపుర నిశాచర శ్రీకునందు భక్తినిల్పి

సంబుధి

శ్రీమద్రాజాధిరాజ శిరోవిరాజ మానసమాన
హాటక కిరీటతట ఘటితమణి గణమరీచిరాజి
నీరాజిత చరణసరోజాది వాకరతేజా!

నాకృతీ నంగీకరింపుము.

———

# ఆధునిక యుగము

పై యుగ వివరణమును బట్టి క్రీ. శ. 17 వ శతాబ్దినుండి 1937 వఱకును "ఉదాహరణ రచన" విస్మృతమైనదని చెప్పవచ్చును. క్రీ. శ. 1937 లో "త్రిపురాంత కోదాహరణము" వెలువడిన వెనుకనే ఆంధ్ర సాహిత్య ప్రపంచమున ఉదాహరణశాఖ తిరిగి ప్రారంభమైనది. ఆ కాలమునుండి నేటివఱకు వెలువడిన ఉదాహరణలను గ్రంథకర్తలను తెలుపుచు సంగ్రహ వివరముల నిచ్చుచున్నాను.

1. నాగేశ్వరోదాహరణము :- కీ. శే. మండపాక పార్వతీశ్వరశాస్త్రి
మానవ పరము 1938
2. గోపాలోదాహరణము :- కళాప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణ
మానవ పరము 1940
3. వీరేశలింగోదాహరణము :- మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
మానవ పరము 1948
4. అన్నమాచార్యోదాహరణము :- తిమ్మావఝ్ఝుల కోదండ రామయ్య
మానవ పరము 1951
5. శంకరోదాహరణము :- కవికిశోర శంకర ప్రసాద్ - దైవపరము 1952
6. శ్రీమద్రామానుజోదాహరణము :- శిరోమణి చెలమచెర్ల రంగాచార్యులు
మానవ పరము 1955
7. ఆంధ్ర లక్ష్మీవైభవోదాహరణము :- శిరోమణి చెలమచెర్ల రంగాచార్యులు
మానవ పరము 1953
8. విశాలాంధ్రోదాహరణము :- డాక్టరు దివాకర్ల వెంకటావధాని
మానవ పరము 1956
9. వీరభద్రోదాహరణము :- మల్లంపల్లి వీరేశ్వరశర్మ
దైవ పరము 1961
10. విరూపాక్షోదాహరణము :- మల్లంపల్లి వీరేశ్వరశర్మ ,, 1961

11. లక్ష్మీనృసింహోదాహరణము :- డాక్టరు సుప్రసన్న-దైవపరము 1962
12. సామగానప్రియోదాహరణము :- బుర్రా కమలాదేవి ,, 1963
13. వివేకానందోదాహరణము :- పాటిలు తిమ్మారెడ్డి ,, 1965
14. వేంకటేశ్వరోదాహరణము :- గాజుల వీరయ్య ,, 1966
15. శ్రీరామోదాహరణము :- నిడదవోలు వేంకటరావు ,, —

అముద్రితములైన యుదాహరణములు కొన్ని నాకు సకాలమునకు చేరకపోవుటచేతను, స్థలాభావము* చేతను పై యుదాహరణములలో కొన్నింటిని మాత్ర మిందు ప్రకటించుచున్నాను. అవకాశము కలుగునేని తృతీయ ముద్రణమున "ఉదాహరణ వాఙ్మయ సర్వస్వము"ను యాంధ్ర విద్వల్లోకమున కర్పింపగలను.

---

*ఈ కారణముచేతనే ప్రథమ ముద్రణమున యిచ్చిన తాళపత్ర ముద్రిత గ్రంథ వివరణ సూచికల నిందు విడిచిపెట్టవలసి వచ్చినది.

# శ్రీ నాగేశ్వరోదాహరణము

కీ. శే. మండపాక పార్వతీశ్వరశాస్త్రి (1892–1951)

శా॥ శ్రీ నీలాచల శేషశైలాకటక శ్రీపీఠ సంజాతముల్
భూనాథస్తవనీయ కావ్యరచనాంబోధి ప్రమోదప్రద
శ్రీనిత్యంబులు నిష్కలంకములు నాంధ్ర కీర్తి చాంద్రిద్యుతుల్
నానాదేశంబులందుఁ గ్రమ్మి వెలుఁగున్ నాగేశ్వరోదాహృతిన్.

## ప్రథమా విభక్తి

శా॥ శ్రీ నాగేశ్వర పాదసేవకుఁడు కాశీనాథ వంశాంబుధి
శ్రీనీహారకరుండు సాధునికర క్షేమంకర ప్రాభవ
శ్రీనిత్యుండు దయాశమాది సుగుణ శ్రీరాజితుండౌచు నా
శ్రీనాగేశ్వరుఁడింపునం జెలఁగె నాంధ్రీ పూర్వ పుణ్యంబునన్.

## కళిక

మఱియు భారతభూమిఁ బుట్టిన మాన్యులందఱిలో సమర్థుఁడు
మఱపు పుట్టఁగరాని త్యాగమ్మై ధరించిన మొదటి పార్థుఁడు
కలియుగంబున నవనిఁ బుట్టిన కవుల పాలిటి కామధేనువు
తెలుఁగు వారల తెలివితేటలఁ దీర్చి పేర్చిన రత్నసానువు
పరుస మెన్నఁడుఁ బలుకఁజాలని పలుకుమెత్త నిఁదనపుఁ దోరము
పరువులనుగని యీవులిచ్చెడు బాగుమెచ్చులకెల్లఁ దీరము.

## ఉత్కళిక

దీన జనములఁ బ్రోవనేర్చెను
మౌని జనములఁ గాచిపేర్చెను
అడుగు వారికి నన్నమిచ్చెను
బడుగు వారికి బలముఁ దెచ్చెను

తెలుఁగుఁదల్లినిఁ గొలుచు ధన్యుఁడు
తెలుఁగు బిడ్డలఁ బ్రోచు మాన్యుఁడు
తెలుఁగుఁ దమ్ములకును శరణ్యుఁడు
తెలుఁగు జనులకుఁ బ్రథమ గణ్యుఁడు.

ద్వితీయా విభక్తి

ఉ॥ ఆంధ్ర జనంబులార ! భవదభ్యుదయంబునకై నితాంత నీ
రంధ్ర మహోద్యమంబులనురాగమునన్ బచరించువాని నై
రింధ్రినిఁబోలి యన్యులఁ గరమ్మె తిరమ్ముగఁ గొల్చి స్రుక్కు మీ
యాంధ్రినిఁ బ్రోచుశక్తి నలరారు మహాత్మునిఁ జింతసేయరే

కళిక

మఱియు దీనులఁబ్రోవ నేర్చిన మహిమఁగల యౌదార్యవంతుని
బిఱుదుమగలెఱుఁగంగఁజాలని పేరుఁగాంచిన పరమ శాంతుని
తెలుఁగు సీమకుఁ బేరుఁదెచ్చిన దిట్టతనమునఁ దగుదయాళుని
తెలుఁగు మొఱవిని కరఁగు మనమునఁ దేజమొందిన త్యాగశీలుని

ఉత్కళిక

తెలుఁగు వారికిఁ దెలుఁగు వ్రాఁతల
తెలుపఁగలిగిన తెలుఁగు నేఁతలఁ
దెలుఁగు సీమను విడిచి దూరము
నిలిచి తెలుఁగున నిలిపి బీరము
తెలుఁగు వారలు తెలుఁగుఁ దినమున
వెలుఁగు రీతులు వెలచి మనమున
తెలుఁగు సేమముఁ దలఁచు వానిని
తెలుఁగు నిలువున నలరు వానిని.

## తృతీయా విభక్తి

శా॥ నానాఁటన్ గృశియించె నాంధ్రకవితా నారీవతంసంబు స
మ్మానంబుంగడియించి క్రమ్మర రహింపంగల్గి వెల్గొందెఁ గా
శీనాథాహ్వయవార్ధి శీతకరుచే శ్రీమద్యశఃకాయుచే
శ్రీ నాగేశ్వరుచే మహామహిమచే శ్రేయస్కర త్యాగిచే.

### కళిక

మఱియుఁ గవులకునెల్ల మనసు వచ్చిన యీవి
గుఱుతుఁ గల్గిన యీవి కోరివచ్చిన యీవి
యమరించు వానిచే నలరించు వానిచే
కమనీయ మధుర వాగ్గరిమఁ గలవానిచే.

### ఉత్కళిక

అమృతాంజన మొనర్చి
యమృతంబు చేకూర్చి
పసిఁడి కొండ కరంచి
పనవారి యొడినించి
యసదైన కలిమిచే
నలరారు బలిమిచే
తెలుఁగు తల్లి వెలింగె
ధిరుచేతఁ జెలంగె

## చతుర్థీ విభక్తి

శా॥ దేశోద్ధారకుఁడై కళామహితుఁడై ధీమంతుఁడై శాంతుఁడై
యాశాపూరణమే మహా వ్రతముఁగా నాంధ్ర ప్రభావర్ధిమై
కోశంబులే రచియింపఁజేసి తమకోర్కుల్ దీర్చియున్నట్టి నా
గేశాభిఖ్యునకై సమస్త విబుధుల్ కేల్దోయి సంధింపరే.

కళిక

మఱియును భారత మహిమను భారత మహిలో నిల్పిన మాన్యునకై
ఎఱిఁగిన వారలనెఱిఁగి మఱగి తన యీవులఁదనుపు వదాన్యునకై
ఈవియెవ్రతమని యెదలో నెంచుచు నిచ్చుచు వగవని ధన్యునకై
ఈవికి గనియై తావికిజానియై యెంచిన గురుసౌజన్యునకై

ఉత్కళిక

ఆంధ్రులు కట్టిన చెన్నపురంబున
నాంధ్రత శూన్యత నందరయంబున
నాంధ్ర పత్రికను గొల్పి జయంబున
నాంధ్రతనిల్పినయంబున డంబున
నాంధ్రుల కుత్సాహము పుట్టించిన
ఆంధ్రుల ప్రతిభకు నతులతనించిన
ఆంధ్రవరేణ్యునకై గణ్యునకై
ఆంధ్ర శరణ్యునకై పుణ్యునకై

పంచమీ విభక్తి

శా॥ వాగర్థంబుల కూరిమిం దెలిపి కావ్యంబుల్ రచింపంగ వి
ద్యాగారంబగు నాంధ్రపత్రిక సమస్తాంధ్రాళికింగూర్చి నీ
నాగ్రహాగ్రిమమై విమర్శనములన్ వ్రాయించెనే గేయుఁదా
నా నేకాఖ్య కళాప్రపూర్ణువలనం ద్యాగంబురాగిల్లెడున్.

కళిక

మఱియు భారత భూమి మనుపు ధీరుని వలన
నెఱకేఁగి సేమంబుగుడియు శూరుని వలన
దవ్వు తెలుఁగుల ప్రేమఁదనుపు మహితుని వలన
మవ్వంపు నెయ్యంబు మలపు విహితుని వలన

ప్రత్యేక రాష్ట్ర నిర్మాణదీక్షుని వలన
సత్యవాక్పాలనాచరణ దక్షుని వలన
విశ్వవిద్యాలయాభీష్ట పక్షుని వలన
శశ్వత్ కళాపూర్ణ చతులశిక్షుని వలన

ఉ త్కా ళి క

యోగీశ్వరుని వలన
వాగీశ్వరుని వలన
త్యాగేశ్వరుని వలన
నాగేశ్వరుని వలన

ష ష్ఠి వి భ క్తి

శా॥ శ్రీ గౌరీశ్వరునాజ్ఞ భారత ధరిత్రీ పూర్ణకామాప్తికై
భోగాసక్తినివీడి త్యాగమహిమంబూర్ణంబుఁగాఁజూపి కా
రాగారంబున కష్టముల్ గనిన ధైర్యస్థైర్య విస్ఫూర్తికిన్
నాగేశాగ్రణికిన్ సమస్త విబుధానందాను సంధాయికిన్.

క ళి క

మఱియును భారత మహిళాసంతతి మహిమను గాపాడిన గుణికిన్
కొఱతలు గలిగిన కూరిమితమ్ముల కొలఁదులు నిల్పిన యగ్రణికిన్
దేశదేశముల నాంధ్రుల మహిమను ద్రిప్పి ద్రిప్పి కావిన గుణికిన్
నాశమెఱుంగని కీర్తిగడించిన నవ్యమధురవాగ్ధోరణికిన్
ఖండాంతరములనిండిన యాంధ్రుల కష్టములరయునుదారునకున్
పండిత మండలిపై దయఁజూపిన భవ్యవిచారవిహారునకున్
అమృతాంజన మనూనదద్భుత వస్తువు నవనికిఁదెచ్చిన వీరునకున్
అమరు లెఱుంగని యమృతమిచ్చి యఖిలాంధ్రులఁబ్రోచిన ధీరునకున్

ఉ త్క ళి క

చేతులు మోడ్పుడు నాగేశునకున్
ప్రీతినిఁ జూపుడు నాగేశునకున్
చేతలు రీతులు నాగేశునకున్
ఖ్యాతిగ నొసఁగుఁడు నాగేశునకున్.

శ్రీ నిత్యంబయి యొప్పు బొంబయి పురిన్ శృంగారరూపంబుతో
నానాంధ్ర స్తవ నీయవాక్యరచనా నవ్య ప్రభావంబుతోఁ
దానాంధ్రంబునఁ బత్రికారచన సంధానించె నే భవ్యుఁడా
శ్రీ నాగేశ్వరునందుఁ జిత్తములు నిల్చెన్ నేఁటి యాంధ్రాళికిన్

క ళి క

మఱియు నాంధ్రుల ప్రతిభమనుపు కావ్యునియందు
కొఱలేని నిర్భరముఁ గూర్చుదివ్యుని యందు
భారతీ పత్రికాప్రకటసేవ్యుని యందు
భారతీయ ప్రేమ భరణనవ్యునియందు

ఉ త్క ళి క

పరమ శాంతుని యందు
సరస దాంతుని యందు
రాగశీలుని యందు
నాగేశ్వరుని యందు

సంబోధన - సార్వవిభక్తికము

నీవే తానని నిన్నునమ్మెమదిలో నీచేత సత్కార్యముల్
వేవేల్ వెల్గఁగఁజేసె; నీకయి సమర్పించెన్ మహైశ్వర్యముల్
తావుల్ నీ వలనన్ గ్రహించె; కృతి కర్తల్ నీకుఁగార్యంబులన్
నీవారై యొసంగంగఁజేసెఁ; గలనెన్ నీ యందు నాంధ్రీశ్వరీ!

సముద్రధికుండు లేడు పురశాసనునిడొక్కఁడు దక్క : నింతని
క్కము భవదీయవృద్ధికయి కాయము వాక్కును దారవోసి నీ
యమరతవెల్గఁజేయు నమృతాంజనమున్ సృజియించె నాంధ్రీ నీ
వ మలినమైన యాతని యుదాహరణంబునఁ బ్రీతిఁ బొందుమా !

మండిత మండపాకకుల మండన కామకవీశ్వరాగ్ర పు
త్రుండు లసత్కవిత్వ పరితోషితరాజ సభాంతరస్థ సత్
పండిత పార్వతీశకవి పౌత్రుఁడు నైతగు పార్వతీశ్వరా
ఖ్యుండు రచించెనాంధ్రకవికుంజర తృప్తిగ నీ యుదాహృతిన్.

# గోపాలోదాహరణము

కళాప్రపూర్ణ విశ్వనాధ సత్యనారాయణ
శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి వివాహసందర్భమున రచితమైనది

ఆ శీ స్సు

నవ్య సాహిత్య భాస్కరానందకిరణ
దరవిదళితాంబుజాత సౌందర్యమూర్తి!
భారతీయ మహాసభాజ్ఞా రచిత ప్ర
ణాళికా ద్రావిడావనీ బాలమంత్రి!

నిఖిల దేశవాఙ్మయ ప్రబంధీకరణ మ
నాక్కిరణధి శాంతినికేతనంపుబిడ్డ
ఆంధ్రఘూర్జన దీప్తవంగాంగిలేయ
ముగ్ధసారస్వతామృతస్నిగ్ధవదన!

సోమ కొంపల్లె వంశ సుషీమరోచి
షు హనుమంతరాయ ధిషణాస్ఫూర్తియైన
యాంధ్ర జాతీయ విద్యాలయాగ్రశిష్య!
పౌరపరిషదగ్రేసర హారితిష్య!

మంత్రివయ్యును బిగువులుమాని యల్ల
నాఁటి గోపాలరెడ్డిగా మాటలాడు
నీసుగుణరాశి యెంత పండినను బండు
నీ సుకృతరాశి యెంత పండినను బండు!

అటునిటు రెండువంగడము లాంధ్రము లప్పుడునిప్పు డేలఁగాఁ
బటువులు సభ్యభావములబాటలతీర్పు లుదారతానవో
త్కటగుణపేటికల్ తెనుఁగుకైతల గుండెలలోఁతులుఁ సుధీ
ఘటితపరిష్కృతుల్ బొమిడికంబుల నొత్తునొసళ్ళ యూహలుఁ.

తిక్కనకర్మచంద్రు లోకదిక్కనదైవతముల్ మఱొక్కడ౯
బెక్కువవేల్పులేదు రరవింద రవీంద్రులు రెండు నింగిలో
నొక్కనమేరుశృంగము లనూతననూతనముల్ మనఃక్రియా
ఫక్కికలందు నెందు బెజవాడయుఁ దిక్కవరంబు చాలికల్.

ఏ కులదేవతాప్రకృతి యేగిన యాసగము౯ సగంబుగా
నే కొనసాగఁజూచు నెదయేఁచుఁ దపస్విగ రామిరెడ్డిగా
రా కులదేవతా ప్రకృతి యాకృతి యీసతి దోసతీవగా
నీ కుల మింత పాదులుగనెక్కొనుఁ దత్తపసుల్ ఫలించుచు౯.

ఈయమ నీదుసోదరిమహీయసిప్రేవు మఱీవ యీమెఁ గాం
తాయతిఁజూడు మాదివమునందలి భర్తృరతా మహస్సు మీ
దోయిలులందున౯ వెలుఁగుతోఁ గయిసేసెడు పాలికల్ ఘటీ
తోయములందుఁ జేతులిడి దోచిన బంగరుటుంగరంబులు౯.

పాటపాటి ప్రేపల్లెలో వానగురిసి
పూలుపూచిన నల్లగోపాలరెడ్డి
ఒకతరువు రెమ్మకొమ్మల నుజ్జగిలిన
జంటగట్టిన పూవుల సాకు మిమ్ము !

లేనెల సదాస్థితి౯ బోలెకాని యాటు
కాననేరని హల్లీసకముల గంగ
శివజటాజూటికా తీర్థ సేవఫలము
వాఙ్మయస్నాతలకు మీకు వరలుఁగాక ?

అరయ నీకాంతకును నీకు నబ్దమైన
కాకమును చిన్నిచిన్నరి కలుగుఁగాక
పొత్తిళుల నొత్తిగిలలేని బోసినోటి
పాలబుగ్గల చిన్ని గోపాలరెడ్డి.

ప్రథమ

శా॥ శ్రీకాంతాస్మిత కౌముదీధవళరోచిస్స్విన్న చంద్రోపల
ప్రాకామ్యాభినవాభిరామ సుషమాప్రావిర్భవద్దేహవ
ల్లీకళ్యాణ మనోజ్ఞమూర్తి, స్తుతగీర్లేఖర్షి, గోపాలుఁ డా
శాకేదారపదావదారణహలీషావత్కృపామూర్తియున్.

రగడ

సత్యభామా భుజాస్ఫాలనా పులకిత
శార్ఙ్గకోటివిముక్త చటులపృషత్కుండు
దైత్యారణ్యరకయుద్ధక్రీడనారంభ
తార్క్ష్య మహాభుజాస్థాన దీపితమూర్తి
నిర్హారి పారిజాతార్హగంధానూన
నిభృతవీచిస్నిగ్ధ నేత్రాభిరాముండు
బర్హిర్ముఖాధీశ వజ్రోగ్రధారాని
బర్హణోద్రేక సంపాదితానందుండు.
రుక్మిణీ హృదయాంబురుహమరందాసార
రూపితాంభోజాప్త రూఢజీమూతుండు
రుక్మపృష్ఠవిదీర్ణ రూక్షదానవయుద్ధ
రోధస్సమాసీత రోలంబచికురుండు
మత్స్యాత్మసఖుఁడు కమ్మకులాధినాథుండు
మహిత గుణుండు బ్రహ్మయ్యాఖ్యధీనిధి
కృత్స్నపుణ్యగేహ వర్ధిష్ణు దీప్తాంగ
కృతభక్త సంత్రాణ కేళిగోపాలుండు.

ఉ త్క ళి క

గూడవల్లి కులాబ్ధి కుముదబాంధవ బ్రహ్మా
రాడాత్తనివసనారాత్రాశ్రితభక్తుండు
ముదిత నీలాంభోదముగ్ధ దీర్ఘాకారుఁ
డుదిత శంపాభ క్లప్తోర్ధ్వ పుండ్రాస్యుండు
వ్యత్యస్తపాదుఁ డంహఃకుంభిసింహుండు
నిత్యవేణు వినాద నీలాంబుధరమూర్తి
కాంతముఖాబ్జ శ్రీకాంతామనోహారి
కాంతు గోపాల్‌రెడ్డిఁ గాచు గోపాలుండు.

ద్వి తీ య

చ॥ అల తొలినాఁడు ప్రాఁబలుకులన్నియుఁ జిన్నగ ముచ్చిలించి నీ
ళ్ళలఁబడిపోవుచుఁ గడలిలోఁ జొరఁబారిన మేటిరక్కసిఁ
జెలియలికట్టవోలె సొరచేపగఁ జోపఁగ నడ్డగించి కు
మ్ముల విదలించినట్టి సొరముల్లుగలానిని గొల్లపిల్లనిన్.

క ళి క

తలిరుటాకుల యందములకును దళుకుదిద్దెడు మేనివానిని
పొలసురతనపు జిలుగువెలుఁగున పున్నెములు వెలిఁగించువానిని
నీటిలోపలపోవు నోడకు సాటిగా దూసి చనువానిని
మేటి రక్కసునెత్తురులనెఱ నీటి పడియలు కట్టువానిని
తోఁకచిమ్ముల నీళ్ళలను పెనుత్రోవలుగ వెలయించువానిని
కూకలుంగేకలుగఁ బెను గగ్గోలుచేసినయట్టి వానిని
నిట్టపొడచిన వెల్లిగాఁ బెను ముట్టియం బయికెత్తువానిని
నట్టనడుమనఁ గడలిలోపలఁ బుట్టుదీవిహారంగువానిని.

ఉ త్కా ళి క

బమ్మకును బ్రాఁబలుకు లొసఁగుచు
చిమ్మకొను చిఱుమొట్టె వానిని
కమ్మ పొలసులతావి దెసలను
క్రిమ్మకొను నెఱయందగానిని
కడలిలోఁ బెనుచేప దిండుల
కడలుగాఁ గడగి చనువానిని
బుడుతలౌ గోపాలరెడ్డిని
మడతిదీవన సేయువానిని.

తృ తీ య

మ॥ తలుగుంజారుచుఁ గ్రుంగుకొండకెలనన్ దాబేలుగానై హాలా
హలిఁ గ్రీడిప్పను నెత్తుపెట్టి చిలుకన్ హాళించు నిద్రానిచే
ఇల నుచ్చావచఘృష్టి బర్కరుని నాహేమాక్షు రక్తార్ద్రిపి
చ్ఛిల మస్తిష్కవిదారిపోత్రనిశితాగ్రి ప్రౌఢ భూదారుచే.

క ళి క

నిగుడుకాళ్ళు తలయుఁ ద్రవ్వ నిలువుటీఁతగాని చేత
మొగుడు డిప్పయొరసియొరసి మొగ్గతిలనివానిచేత
ముసరుకడలి బిరుసునురుసు పుక్కిలించువానిచేత
కసరి దరియుఁజేపపిండు కక్కసించువానిచేత
హేమదితిజగళవసావపామిళచ్ఛరీరుచేత
సామివికసితార్ద్రపోత్రచటుల భీషణాస్యుచేత
వారితాపదుదితప్రేమ భావప్రణుత ధాత్రిచేత
ఘోరదైత్య దళన తీవ్ర ఘూర్ణమాననేత్రుచేత.

ఉ త్కా ళి క

అమృతమిచ్చు వానిచేత
శ్రమముదీర్చు వానిచేత

ప్రేమముద్దగానిచేత
హేమదితిజకాలుచేత
తతకరాళముఖునిచేత
కృతసురారి దమనుచేత
కడగి గోపబాలరెడ్డిఁ
బడతిఁ బ్రోచువానిచేత.

చ తు ర్థి

మ॥ జరఠోదీర్ణ మహావిదీర్ణ జఠర స్తంభోద్గమ త్తీవ్రతా
స్ఫురితోద్వేలవిశీర్ణ దైత్యపతి వక్షోదక్ష విక్షిప్తికై
సిరికై తావడుఁగౌచు గుజ్జునయి కాశీయాత్రకుంబోవుపై
ఖరియై జన్నపుసావడిందరియు పక్కాబిచ్చపుంగండుకై.

క ళి క

పంచాస్యసంరావ బధిరితకాకుభ పద్మికర్ణ నాళపటలికొఱకు
వంచిత దైతేయ వక్షఃకవాటోగ్ర పాటనాత్త నఖదవార్చికొఱకు
వివృతాస్యదంష్ట్రానవీనశోచిష్కీళ విద్ధదైత్య ప్రాణవితతికొఱకు
ప్రవిమల భక్తిమత్ప్రహ్లాదనయనాబ్జ బాలసూర్యకిరణ పటలికొఱకు
జన్నంపుసావడిఁ జన్నిపచారులై సగముగడుసుమాటజాణకొఱకు
చిన్నారి పొన్నారి చిట్టికూఁకటిముడి చిళ్ళసరుదుకొనెడు చిట్టికొఱకు
రక్కసలొజ్జఁదీరని గ్రుడ్డిగాఁజేయు అవ్వబిచ్చమెత్తు జాఁగకొఱకు
బక్కవేల్పులయండపట్టి మాంసపుదిండి బంతులందుజమురుపరుజుకొఱకు.

ఉ త్క ళి క

బ్రహ్మాది సౌరసంప్రణుతి పాత్ర
జిహ్మేశరప్రాణ శిక్యకొఱకు
ప్రహ్లాద సంత్రాణ భావభూత
కహ్లారమాలికాకారుకొఱకు

బలినిముందంటి వేళ బ్రహ్మఁ జేయు
వలిమిరి గుండియ జంతెకొఱకు
ప్రేమతో గోపాలరెడ్డిని నతని
భామను బాలించు ప్రభువుకొఱకు.

పంచమి

క॥ ఇసువసియు నొక్కమారలు
వసుసనిఁకొఱఁందొలంచు పాఱునివలనఁ
వరి తల్లితలయుఁ దఱిగెడి
మొఱకుతనంపు జమదగ్నిపోఱనివలనఁ.

కళిక

జననీకేకావిహ్వాల కలనా సారణవిధురాభీలునివలనఁ
వినమత్సరకుప్రోజ్జ్వలధారా విదళితరిపుయూధోగ్రునివలనఁ
గమన స్తంబేరమయూధపతి క్రమభాస్వరశోభానిధివలనఁ
విమతప్రాణానిలదర్వీకర విషవత్పరశుప్రౌఢునివలనఁ
సకలక్షోణీవితరణసంధా సంగతధిషణాసాధువువలనఁ
వకితభ్రూవల్లీసంలగ్న స్థాణుప్రాంశుజ్యోతిషువలనఁ
విశిఖాసనవిద్యాకృతమత్సర విశాఖిలీలాదమనునివలనఁ
విశిఖోద్భిన్నక్రౌంచక్ష్మాభృ ద్వీరాకృతిసారాకృతివలనఁ.

ఉత్కళిక

త్రికాలపాణి ప్రియశిష్యత్వ
ప్రశాంతశత్రుప్రథనునివలనఁ
హిమాద్రికన్యాహిమాభకరుణా
సమానసురిణీస్నాతునివలనఁ

అసద్ధరాభృద్ధరణవ్రతబ
ద్ధసాయకోగ్రధ్వానుని వలనఁ
కుమారదంపతి గోపాలద్వయి
నమందకృపఁగాచు మహస్సువలనఁ.

షష్ఠి

ఉ॥ నాఁగెటి చాలుకన్నియమనస్సునఁ గూడికవీడిపోకలఁ
గాఁగల కుల్కునుల్కులకుఁగాని విచిత్రపుప్రేమముద్దకుఁ
నాఁగెటి వాలుతుట్టతుదనాటిన రక్కసగొంతునెత్తురుల్
వాఁగులనాడియుఁ దెలుపు వారిన మైజిగి సొంపువానికిఁ.

కళిక

తరిమితరిమి రక్షోబలంబుల తరగి తరగి రక్షశ్శిరోధుల
నొరిగియొరిగి నాకౌకసులకు సిరులఁదెచ్చియిచ్చువానికిఁ
తలఁచి తలఁచి పిత్రాజ్ఞాంబుధి దాటిదాటివన్యాసీమల
నిలచి నిలచి పద్మాల్గేడులు నేలనేలిప్రోచువానికిఁ
మరగి మరగి హాలారుచులను కరగికరగి భక్తావనముల
తిరిగితిరిగి పుణ్యాశ్రమములు తఱపిశాంతి పేర్చువానికిఁ
కెరలికెరలి ఢిల్లీకోటను గిరిగిరిసూర్యాత్మజలో
నొరుగ నొరుగనాగేల్కొల్లున నూచిత్రోయనేచు వానికిఁ.

ఉత్కళిక

మొఱటుచవటలాడికచేతను
తరుణివనికిఁ దార్చువానికిఁ
ధరణిధర్మపాలనచేతను
తిరిగి కృతముసేయువానికిఁ

రేణుకామరంద ప్రేమాంబుధి
శ్రేణీసేసి యీఁదువానికిన్
కృతిని మంత్రి గోపాలరెడ్డిని
నతిని కాంత నాదువానికిన్.

స ప్త మి

ఉ॥ భూతదయావిచిత్రమగుబుద్ధిని నందఱ కందుబాటుగా
నీతిప్రధానమౌ మతము నిల్పిన కైతవయోగియందునన్
నీతియు ధర్మ మేఁది కలినిండినఁ గత్తికొనన్ విదల్చుచున్
శ్వేతహయాధిరూఢుఁడయి చెన్నెసలారెడు రౌతునందునన్.

క ళి క

సురారికాంతావంచనకేళీ స్ఫురత్కృతవదర్పాకృతియందున
సురారిరంసాహింసాగాధా స్ఫురద్దితిప్రసూమోహకునందున
నిరస్తసంవిత్కల్పితమాయా నిరంతజగదాభోగునియందున
పరాస్తకర్మప్రభుసిద్ధాంత ప్రతారితాఖిలలోకునియందున
ప్రపూరితైనోవిహ్వలధర్మ ప్రభావపునరుద్దీపకునందున
కృపారహితఖడ్గాంతధ్వస్త క్రిమిప్రకటభూతావలియందున
హయాధిరోహప్రవేగధావన హఠాత్త్రుటితపాపావలియందున
హయోగ్రఖురసంఘట్టితధాత్రీ హఠాజ్జనితదీపావలియందున

ఉ త్క ళి క

పునీతబోధిక్ష్మాజాతాది
ప్రణీతనవసిద్ధాంతుని యందున
ఘృణాకలితహృత్పర్యాలోచిత
ధునీజననమరణోల్బణు నందున
పునః కృతయుగీనోజ్జ్వలధర్మ
ప్రణాళికాసంస్థాపకునందున

వనేజనేత్రాలక్ష్మీకాంతా
సనాథుఁ బ్రోచెడి సాధువునందున

స ం బో ధ న ప్ర థ మ

మ॥ సరికర్ణాదులు శోభనాద్రులకు నస్మత్తాతపాదుల్ గడిం
చిరి విశ్వేశ్వరు నందమూరుపురి నా శ్రీకంఠు మైత్రిన్ నిరం
తర భక్తావన దీక్షనొప్పెడు జగన్నాథా మహోరోధ నీ
సరి విశ్వేశ్వరుఁ డొక్కఁడే ప్రభువయా ! సంతానగోపాలకా !

క ళి క

సంతోషితాత్మ సంపూరితాత్మ సంతానవేణుగోపాలదేవ !
సంతోషసిక్త సంతుష్టభక్త సంతానవేణుగోపాలదేవ !
నీపాదమంటి నీపాలమంటి గోపాలదేవ ననుఁగావరావ !
నీపాలివాఁడ గోపాలదేవ నాపాలిదేవ గోపాలదేవ !
గుడిలోని గుబురు సంపెంగకుదురు గోపాలనీదు ప్రేమంపుపాదు
సడియేలనీకు వడినన్నుసాకు సంతానవేణుగోపాలదేవ !
రావయ్యతండ్రి! రావయ్యస్వామి! రావయ్యప్రభువ! రావయ్యదేవ !
సావిత్రమూర్తి! సందానితార్తి! సంతానవేణుగోపాలమూర్తి !

ఉ త్క ళి క

శ్రీ తిక్కవరపుధీశిత రామరెడ్డి
కూఁతురు లక్ష్మికాంతా తన్వితోడఁ
దగఁజెన్న రాష్ట్రంపు స్థానిక మంత్రి
తగురెడ్డి వంగసతొగకన్నెవలపు
బెజవాడ గోపాలు పెండిలివేళ
వ్రజనాధ ! నినుగూర్చి వ్రాసిన కృతిని
తగ వధూవరులతో దయచూచుస్వామి !
నిగమాంతవేద్య ! భక్తగణాలి హృద్య !

ఇది యథా మాతృకముగా పునర్ముద్రితము నవ్యసాహిత్య పరిషత్తు - గుంటూరు 1940

---

# వీరేశలింగోదాహరణము

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి - తెలుఁగు పండితుఁడు
వీరేశలింగోన్నత పాఠశాల - రాజమహేంద్రవరము.

౧

ఆఱని సౌరభంబు భరతావని నాల్గు చెఱంగులందు పొం
గారెడితీరుగా శతశతాబ్దము లెండని నిండుతేఱులై
పాఱి రసజ్ఞ చిత్తములు పండువుచేసిన 'కందుకూరి' మం
దార మరందముల్ తెలుఁగునాటను జిందిన జీవబిందువుల్.

జాతిలోఁ గలుష విశ్వాసంబుఁ దొలఁగించి
నీతిసంస్కృతిధర్మనియతులు వెలయించి
భావ వైశాల్య మేర్పఱచి దేశమునందు
జీవకల్యాణ సవిత్రికి నెఱివిందు
సంతరించిన మహాశయులలోఁ బ్రథముండు
పంతమ్ముగల బుద్ధిపరులలోఁ బ్రథితుండు
భవ్యసంస్కారరూపక మహారంగము
నవ్యకవిత్వపునాంది మా లింగము

సహనశక్తిని దేర్చి - ప్రహసనంబులు గూర్చి
పుడమిలోఁ గలమఱక - కడిగివేసిన యెఱుక
గలిగి పొల్చినవాఁడు - తెలుఁగు నిల్పినవాఁడు
తెలివి మెచ్చినవాఁడు - వెలుఁగు దెచ్చినవాఁడు

౨

ఒకకంటన్ మన తెల్గుజాతి పరమాయుర్గ్రంధి గుర్తించి వే
ఱొరకంటన్ మన తెన్గుభారతి శుభోద్యోగంబుఁ గాంక్షించి సాం

షిక సారస్వత నైతికోన్నతుల కేకీభావముం బెంచి ని
ల్వక యేనాఁడొ గతించిపోయిన కవిస్వామిం బ్రశంసించెదన్.

సొగసుఁగప్పురములో సొలపుఁజందనములో
ముగుదతెమ్మరలలో మురియునందనములోఁ
బొలపమ్ము వెలయఁ జూపులకు విందులుగూర్చి
యలఁతిపల్కులగద్య మలరించి యెడలూర్చి
ఆనాఁడు తిక్కన యాహరించినపల్కు
లీనాఁడు కృతులలో నెదుటనే రసమొల్కఁ
జిలికిన కవిరాజశేఖరు నెదలోన వెలయఁ
జేయుట పురావిభవమ్ము మనలోన.

జాతిలో నొకక్రొత్త - జాతి సంస్కృతి హత్త
ప్రాకృతప్రజలయెదలు - సోక ముద్దులు పొదలు
వచనశైలికి మంచి - రుచియు వన్నెయుఁ బెంచి
యమృతుఁడైన కవీంద్రు - నమరఁ గొల్చుట విందు.

౩

చివురించెం గవితాతరుల్ విరియఁ బూచెం గాచె వీరేశలిం
గ వసంతోదయ మాధురీ రుచిరసంక్రాంతిన్ మహాంధ్రంబునన్;
గవితాకల్పము కొమ్మకొమ్మదెసఁ బైక శ్రీసుధాగానముల్
సవరింపంబడెఁ గందుకూరికవిచేఁ జారుప్రసారంబుగన్.

యుగయుగంబులకేని యొఱుపుమాఱని వాసి
యుగము వాఙ్మయమున నుదయింపగాఁ జేసి
పెఱబాస సాహితిపెంపు తెల్గున దింపె
సరసభావనకు వైశాల్యంబు నొగినింపె

స్త్రీ బాల వృద్ధ సుధీగణధ్యేయమ్ముగా,
బాసలో నూత్నగతి శ్రవఃపేయమ్ము
సరిక్రొత్తశైలి మెచ్చఁగ సంతరించెను
గరుణమై మనబాస కఱ వంతరించెను.

అతనిచే నొక వెలుఁగు - అతనిచే మన తెలుఁగు
అన్యఖండములందు - అన్యసీమలయందు
పారదంబయి విరిసి - పాఱె నాగతి దెలిసి
లెండు ! బంగరుపంట - పండఁజేయుఁడు వెంట.

౮

తెనుఁగుంగబ్బము సంతరించిన కవుల్ తెల్గన్న, తిమ్మన్న, లిం
గన లంచుం గొనియాడి నిండినమదిం గై మోడ్చె వీరేశలిం
గనకై కావ్యములోన నాఁ డలసుధీగణ్యుండు కొక్కొండ; పొ
త్తనఁగా నుత్తర దక్షిణధ్రువము లొండై యుండె నన్నట్లుగన్.

అనసూయులై సంఘ మారఁగప్పిన కారు
తునకమబ్బుల నూఁదఁ దొడరిన తనతీరు
తరతరంబులదాఁకఁ జెఱుగక విఱుగక
తిరముగా నిలిచి నర్తించును దఱుగక
ఎదిరిపాముల డెంద మేఁచు కాటులకునై
ముదితొక్కుల వెడంగు బోసిపోటులకునై
పిల్లల కంకర బెడ్డరువ్వులకునై యెల్ల
సత్త్వమును మాయించు నవ్వులకునై

ఎన్ని మందులు మ్రింగి - ఎన్ని సందుల వంగి
ఎన్ని యడ్డులు వెట్టి - ఎన్ని గడ్డులు నెట్టి
బ్రతికెనో నిరుపేద - బ్రతుకు జీవములేద
యీమహాత్ముని యెడలఁ బ్రేమగౌరవ మెడల.

౨౫

పొలపముదక్కి పుర్వులకు బోనము వెట్టెడి తాటియాకుఁగ
ట్టలఁబడి బూజుపట్టుచుఁ జెడంజెడియున్న పురా మహాకవీ
శుల కవితామణీ గణరుచుల్ వెలి సేసి తదీయసాధు గా
థలకు వెలుంగు చూపిన యుదారువివల్లఁ జరిత్ర మేల్కానెన్.

శ్రీమద్రపురి ప్రాచ్యకృతిశాల కురిచీలు భూమ
"తంజా" మహాపురి మంజుల శ్రీలు
'వేదవిలాస' పవిత్రమందిరభిత్తి చేదోడు
వాదోడు సేయ నద్భుతవృత్తిఁ
దాళపత్రముల కాంతారమ్ములోఁ బడి
మేలిదారులుతీసి మెఱయించి ప్రాఁబడి
పడియున్న కవులకుఁ బ్రపనిల్పె నాజోదు
పుడమి నాతనిఁ బట్టిపుట్టని కృతిలేదు.

అతని సత్కృతులెల్ల - అతని సంస్కృతులెల్ల
తిరుగదోఁడి తెలుంగు - ధరణిలోన వెలుంగు
వెలయఁజేయుట మేలు - పలుకులాడుట చాలు
నిలకుఁ బంతులుగారి - చెలిమి చల్లనిదారి.

౨౬

మొత్తముమీఁద వాఙ్మయపుఁ బోకడ లెన్నియొ యాకళించి, క్రొం
గ్రొత్తగఁ దాన పన్నుకొని క్షుణ్ణము చేయని తెన్నులేదు: తా
నెత్తిన త్రోవలో నడచియే కవులై రల 'చిల్కమర్తి' వి
ద్వత్తముఁడాదిగా విబుధు; లా మహనీయునకుం గృతజ్ఞులై.

మృతిలేనిజీవిత మెసలారుజననంబు శత
వార్షికముల యుత్సవ సమాచరణంబు
పడయుటగా : దాంధ్రభాష యుండినదాఁక గడి
యారముల లెక్క గడచిపోయెడిదాఁక

కలకాలమును, కాలకాలమ్ము దీపించు ;
నిలిచి దేశాలకు వెలుఁగుచూపించు
ఒక యుపాధ్యాయున కొకబాఁపనయ్యకు
ఒక పేదజియ్యకు నొకముసలయ్యకు.
ఔర ! ఎంతటి శక్తి ! ఔర, ఎంతటి సూక్తి !
ఒక్క పీనసరోగి - కొక్క సంసృతిరాగి
కెట్టియద్భుత శక్తి ! - యిట్టి యుత్సవరక్తి
తెలుఁగు దేశములోన - వెలయు టెన్నఁడుగాన.

౭

ఒక్కటికాదు భారతము నూఁపిన సర్వసమస్యలందుఁ బే
రెక్కిన యట్టినేర్పరి-మహిళ మనసాహితిసొంపు చాటి పెం
పెక్కినయట్టితీరుపు రచించిన కూర్పరి కందుకూరి స
మ్యక్కవితా కళారతునియందుఁ గృతజ్ఞత వెల్లడింపరే !

అచ్చ తెనుంగు కావ్యముల కూరుపునేర్పు-
మెచ్చుగా నవలలు మెఱయించు బలుతీర్పు
మధురకథాభినిర్మాణంబులోఁ దీరు-
ప్రథితనాటక కళాగ్రథనంబులో సౌరు
కవికథాసంధాన కరణమ్ములో శక్తి-
నవరీతిఁ బరిశోధనంబులో ననుషక్తి
ఒకటికా దెన్నన్నొ యుదయించి పెంపొందె-
సకలంబు వీరేశసాహిత్యఖనియందె.

కొన్నిదారులు చూపెఁ - గొన్నిదారులు మాపె
తెలుఁగు సాహితిలోన - తెలుఁగు సంఘములోన
కందుకూరి కవీంద్రునందు - నాంధ్రుల విందు
కడలిలోపలఁ బెట్టు - వెడఁగు తేనియబొట్టు.

పరమపవిత్ర శీత "శతవార్షిక" వార్షుకబిందు బృంద బం
ధురతకుఁ జాతకంబులయి నోరులు విచ్చిన తెల్గువారిపైఁ
గురియుము నీ కటాక్షరస గుంభన ; మోయమృతప్రథాసహో
దర హృదయాంబుజా ! సరి యుదాహరణంబులు లేవు నీ కెటన్.

———

# అన్నమార్యోదాహరణము

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య, ఎమ్. ఏ.
ఆంధ్రభాషోపన్యాసకుఁడు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి.

## ప్రథమా విభక్తి

శ్రీదయితామనోహరుఁ డశేషజగజ్జనకుండు భక్తులో
కాదృతదివ్యమూర్తి పరమాత్ముఁడు వేంకటశైలనాయకుం
డాదర మిచ్చి మెచ్చిన మహాత్ముఁడు నందవరీక వంశసిం
ధూదయపూర్ణచంద్రుఁడు బుధోత్తముఁ డన్నయ ప్రోల్చుఁ గావుతన్.

## కళిక

మఱియుఁ దిరుమలపయిని మెఱసినమహితనాదవికాసలేశము
సరసవేంకటశైలనాథవిశాలనయనాబ్జప్రకాశము
విమలమానసరమణశీల నవీనకలహంసల నినాదము
క్రమపదంబుల ఘనగతిం దగి కళల నెలవగు గానవేదము
నష్టదళజలజమున మధురస మాన మాననిచంచరీకము
దుష్టదుష్కవితా పిశాచవిధూననోజ్జ్వల సుకవిలోకము
సరససంగీతప్రసంగతి సాహితీసతి చెలఁగు భవనము
పరమహంసలు భావవీచీపథములను నడయాడుభువనము

## ఉత్కళిక

'అచ్యుతానందా జో' యని
యచ్యుతుని హృదియందుఁ బాయని

భక్తిజోలను బాడి నిద్రా
సక్తుఁ జేయుప్రసన్న ముద్రా
కలితకరపంకజుని సేవా
లలితగీతికలాప భావా
ర్ద్రావితాత్మహృదబ్జధాముఁడు
జీవరచనాప్రథితనాముఁడు

## ద్వితీయావిభక్తి

నారదతుంబురుప్రముఖ నాదకళాప్రవణాత్మచిత్తులన్
మీఱఁగ శ్రీరమాదయితు మీఁదను నాదర మొప్పఁ బాడి వి
స్తారయశంబుఁ గాంచి బుధతండము మన్ననగొన్న యన్నవిం
గారవ మొప్పఁ గొల్తు మది గానకళాకమనీయ విగ్రహున్.

## క ళి క

మఱి పురందరదాసమైత్రి పడసినవాని
విరచితానేక కృతివిస్తారుఁ డగువాని
సంకీర్తనముల లక్షణముఁ జెప్పినవాని
సంకీర్తనాచార్యసత్కీర్తిఁ గనువాని
రామానుజార్యమతరతహృదుండగు వాని
గోమినికిఁ దంద్రి యనుగొప్పఁ గాంచినవాని
శృంగారవృత్త శతకృతికర్త యగువాని
సంగీతసాహిత్యసర్వస్వ మగువాని

## ఉత్కళిక

కలహంసముల గెల్చి
చిలుకపలుకు లదల్చి
కలిమిచెలి మొలనూలి
కలరవంబుల నేలి
వాణీసతీమధుర
వీణాతిమృదులవర
కలరవంబులఁ బూని
చెలఁగుకవిత గలాని.

## తృతీయా విభక్తి

వరకర్ణాటక గానపద్ధతిని నెవ్వం డీయిలన్ దొల్తగా
విరచించెం బలుకీర్తనంబులను నావిశ్వేశుపై భక్తివి
స్తరమోదంబున వానిచేత బుధుచే సంగీతశాస్త్రజ్ఞుచేఁ
దిర మై యొప్పెనలారె గానకళ యీతెల్గందు నన్నయ్యచే.

## కళిక

మఱియు నాదవేదజలధి మథనకార్యదక్షుచేతఁ
బరమ యోగి హృదయసదయ భావజీవచక్షుచేతఁ
గృతిసుమార్చనాతిప్రీతకేశవ వరహృదయుచేతఁ
జతురగోపికాసతీప్రసంగకృతిసముదయుచేత
వర పదకవితావిశేషవర్ష నవవంతుచేత
విరచితాత్మభక్తిగీతవిస్తర వేదాంతుచేత
సాహితీవియత్తలమునఁ జాల వెలుఁగుచంద్రుచేత
దేహగేహములను దేవదేవు నిడుకవీంద్రుచేత

## ఉత్కళిక

నన్నయాది కవుల కృతుల
నున్న మేలిపదము లతుల
గౌరవమునఁ దనపదములఁ
గూరిచి కఱిదొరపదములఁ
జేరిచి కృతిఫల మందిన
కారణజననము పొందిన
యన్నయార్యబుధునిచేత
సన్నుత కవివిధునిచేత

## చతుర్థీ విభక్తి

తన సంగీతరస ప్రవాహమునఁ బద్మాభామినీచిత్తమో
హను ముగ్గించి సెబాసు మే లని భళా యంచున్ శిరఃకంపతం
దని వొప్పించెడునన్న యార్యబుధుకై దాతృత్వసౌశీల్య వ
ర్తనుకై యాత్మ రచింతు నంజలులు విస్తారప్రభావాఢ్యుకై.

## కళిక

మఱియును గర్ణాటకసంగీతసమాగమ శుభఘటికా సూచనుకై
తిరువేంకటపతి తిరుపదముల గతి తెలిసితి ననువరమతిలోచనుకై
శ్రీయలమేల్మంగాసతిజనకతఁ జెలువగు వేంకటపతి శ్వశురునకై
పాయని యనురాగమున రాగమునఁ బాడెడు గాయకకవి గురువునకై
పెదతిరుమలకవి పేరఁ గవిని గని పేర్మిఁ జెందు బంగారుకడుపుకై
సదమలకృతిచిత్రముల నాదకవి జరపినట్టి రంగారునిడుపుకై

కుల మెల్లను గవులును గాయకులనుగొప్పఁ జెప్పికొనఁ నొప్పినగురుకై
కలకాలముఁ దనతనువు మనువు కృతికన్య కలనమున జరపినవరుకై

ఉ త్క ళి క

ఇల సిద్ధులు సాధ్యులు గుమి గూడఁగ
నల రంభాద్యప్సరసలు నాడఁగ
నారదతుంబురు నాదకళాభిజ
నారతు లెల్ల రనారతమును నిజ
నాదకళల నిడి నయమునఁ గొలువఁగ
వేదసమానకవిత్వమునను జగ
మెల్ల నుతింపఁగఁ బాడినకృతికై
సల్లలితోక్తివిశారదమతికై

పంచమీ విభక్తి

దిన మొక్కింటికి నొక్కటేన్ గృతిని బ్రీతిం జేతుఁగా కంచుఁ బూ
ని నయం బొప్పఁగ షోడశాబ్దముసు మున్నీరో యనం గీర్తనో
ద్ఘన భాండారము నింపె నర్వదివరాబ్దంబుల్ తగన్ మించ న
వ్వనజాతాయతనేత్రుభక్తువలనన్ వాసించు గానం బిలన్.

క ళి క

మఱియు గీతామృతసమగ్రసింధునివలనఁ
బరమయోగిజనాళిభావబంధునివలన
గాయకావళి యేఁగుగానతీర్థమువలన
రాయదిగ్గజకవిరాజసార్థమువలన

భక్తిపరవశ మైన భావపూర్ణునివలన
సిక్తశృంగారరససింధుకర్ణునివలనఁ
ద్రాక్షఫలకములందుఁ దనరు శేముషివలనఁ
గ్రమసంగీతసత్కారవైదుషివలన

ఉత్కళిక

సాహితీప్రాంగణము
మోహనకళాగుణము
సంగీతమును జిలికి
రంగారఁగా నలికి
కృతిముత్తెముల ముగ్గు
లతకరించుట మొగ్గు
గలుగుకవివరువలన
లలితభావునివలన

షష్ఠీ విభక్తి

సాళువగుండవంశ్యనరసప్రభునానతి ధిక్కరించి శ్రీ
లోలునిమీఁద భక్తజనలోకవశంవదుమీఁదఁ గాని నా
నాలుక పాడఁజాలదని నాణెముగా వచియించినట్టి యా
తాళులపాక యన్ననికి ధార్మికశీలున కంజలించెదన్.

కళిక

మఱియుఁ దలుగు నెఱుఁగనట్టిమహితకృతికలాపమతికి
మెఱసి దఱిసి కరఁగి మరగ మెయికొనురసవిసరకృతికి
నరస సరస నరవర వరు నాల్కఁ బల్కనట్టియతికిఁ
గర మరుదుగఁ జెఱ విడుమర గాంచినయంచితసుగతికి

వ్యావహారికాంధ్రభాష వాడినతొల్తటిసుకవికి
భావజీవకిరణవికచభ కి గీతపద్మరవికి
రామచరిత ద్విపదకవిత రచియించినభక్తినిధికి
నామకీర్తనమున దేవనాయకు మెచ్చినయవధికి

ఉత్కళిక

పల్లవి కృతిమొదలఁ జెంద
సల్లలితవిధమున నంద
చందములుగ నేఁడు పాడు
చందమునకుఁ దొలుతవాఁడు
నాఁగఁ బెంపు నింపుఁ జెంది
యాగమసాగరము నంది
నిలిచి వెలుఁగు లలితకృతికి
ఫలితపూర్వ పుణ్యకృతికి

సప్తమీ విభక్తి

అన్నయపాట విన్నచెవి నన్యకృతంబులఁ గీర్తనంబుల
న్నెన్నఁడు నే వినం బలుకు లియ్యవి నిశ్చయ మంచుఁ జెప్పె నాఁ
డెన్నఁగ నన్నయార్యుని యహీనకృతుల్ విని వేంకటేశుఁ డా
యన్నయయందుఁ జెందుఁ గద సార్థక మై కృతికార్య మిద్ధరన్.

కళిక

మఱియు వేంకటనాథమాన్యునందు
సరససంగీతకృతిజన్యునందు

ద్రావిడాగమజలధితరణియందు
భావపుష్కలకృతుల బరణియందు
నధ్యాత్మకీర్తనవిహారునందు
సుధ్యానతీర్ణ భవళూరునందుఁ
గర్ణాటపద్ధతి వికాసునందుఁ
గర్ణాటగీత సంకాశునందు

ఉత్కళిక

పరఁగు వైశాఖ
దొరసెడువిశాఖ
నక్షత్రదినము
న క్షమాగుణము
పొదల జన్మించి
పదకృతివిరించి
యనుప్రధితి నందు
వినయకృతియందు

సంబోధన ప్రథమావిభక్తి

ఆగమవేదశాస్త్రకలశాంబుధితీర్ణమతిప్రభావ! పం
చాగమచక్రవర్తి? కృతిసంగ్రథనాధ్వరదీక్షితేంద్ర! ప్ర
జ్ఞాగురు! సత్కృతిప్రభవకారణ! గానకళావిలాస! యం
ధ్రాగమసార్వభౌమ! యమరాధిపగాయకతుల్యవైభవా॥

కళిక

మఱియు పదినెలచేత మాట వడ్డకవీంద్ర!
సరసు లౌజ్జలయొద్దఁ జదువనట్టిచంద్ర!

యక్కమ్మసతిఁ బెండ్లి యాడి కూడినప్రోడ !
చక్క సంగీతవిజ్ఞాన మరసినవాఁడ !
భగవదుద్బోధసద్భావపుష్కలగీత !
సుగమనిగమవిచారశుద్ధచిత్తోపేత !
పదకవిత్వపయోధిపార మీఁదినశూర !
పదపదంబున రసము పరిఢవిల్లెడువీర !

## ఉ త్క లి క

చందమామయు జోల
యంద మగుసువ్వాల
సొంపు గులికెడిలాలి
యింపు ధవళము లోలి
నర్ధచంద్రికపదము
లర్థిఁ దుమ్మెదపదము
లను రచించినకీర్తి
నెనసినట్టిసుకీర్తి !

## సార్వవిభక్తికము

నీవు మహాకవీంద్రుఁడవు నిన్నుఁ దలంచెద నర్థి నీదుచే
జీవ మెలర్చెగానకళ చేసెద నీకొఱకై నమస్కృతుల్
నీవలనం గృతుల్ వెలఁగె నిత్యత నీకు రచించు నంజలుల్
భావ మడంగు నీదుపదపద్మములందుఁ గవీందుశేఖరా !

## అంకితాంకపద్యము

శ్రీగురుదేవ పాదసరసీరుహసన్నిధి నుండి గేయవి
ద్యాగమచక్రవర్తి ! భవదన్వయదివ్యవిభూతికీర్తనో
ద్యోగములోన మానుగ సముత్సుక చిత్తుఁడనై రమించి యం
ధ్రాగమసార్వభౌమ ! త్వదుదాహరణం బిది నే రచించితిన్.

# శంకరోదాహరణము

శ్రీ కవికిశోర శంకరప్రసాద్, ఆంధ్ర భాషోపన్యాసకుఁడు,
నిడుబ్రోలు కళాశాల.

## ప్రథమా విభక్తి

శ్రీనగజా హృదీశుఁడు వశీకృత పంచశరుండు భక్త సం
ధాన మనోజ్ఞ శోభితుఁ డుదార గుణాఢ్యుఁడు పంకజాసనా
ద్యానమితాఖిలామర సమర్చిత పాద సరోరుహుండు పం
చాననుఁ డిందుశేఖరుఁ డనంతుఁడు శంకరుఁ డోమెడిన్మమున్

## కళిక (వృషభగతి)

మఱియు భక్త మనోజ్ఞ పాళిని మరగితిరిగెడు చంచరీకము;
కఱదలెరుఁగని దీనజనములఁ గాచుచుండు దయాసముద్రము;
కడిమి బాణాసురుని మోసలఁ గావుఁగాచిన వీరసింహము;
పుడమిఁ దేరుగఁజేసి పురముల మూఁటిఁగూల్చిన పరమతేజము;
కడు ముదమ్మునఁ దన సతీమణి కొడలిలో సగమిడిన దేవుఁడు;
పెడఁద యేనిక మోము దేవర కొడుకుఁ బడిసిన శుభసమగ్రుఁడు;
కడలిఁబుట్టిన కాలకూటము కంఠసీమను నిలుపు ధీరుఁడు:
జడలలోఁ బ్రవహించునేటిని మడచి తిరుగు మహానుభావుఁడు.

## ఉత్కళిక

పతినిగోరుచు గంగచెంతను నతులభక్తిఁ దపంబుచేతను
మతికి నింపౌనఁగూర్చుకన్నెకు వ్రతఫలంబౌనఁగూర్చి వన్నెకు
నుతికినెక్కఁగ లీలనగపడఁ బతియటంచును తొందరగ పడ
నయిదుమాఱులు కన్నెయనవుడు నయిదుగురఁగొమ్మనిన దేవుఁడ

## ద్వితీయా విభక్తి

జనులు కృతాపరాధులయి జన్మఫలంబునెరుంగ లేమిచే
తను గనుపట్టువేల్పుల వృథాగ ననారతముఀ భజియించుచుం
డిన ఫలమింత కల్గదుసుఁడీ! తరియింపఁగ నొక్కమాఱునె
మ్మనమున భక్తితోడుత సుమాధవుశంకరునిన్ స్మరింపుఁడీ!

## కళిక (ద్విరదగతి)

మఱియు బల్లహునింట - మనసు నిల్పినవానిఁ
గరి చర్మమొదలిపైఁ గప్పికొనియెడువాని
ఫణిహారములు మేనఁ బాదుకొల్పెడువాని
గణనీయమౌ పుస్కఁ గలిగి యుండెడువాని
నొడలెల్ల వెలిబూది నొప్పియుండెడువాని
బొడవులకు నెల్లఁదా నొడయఁడై చనువాని
నలమృకండునిపట్టి నెలమిఁ బ్రోచినవాని
వలరాజునకుఁ బ్రాణముల నొసంగినవాని

## ఉత్కళిక

మాయరూపున మించి - జాయతోడుతఁగంచి
పురిమెట్టి చిఱుతొండఁడరసి విందుకువేఁడఁ
గొడుకు మాంసముగాని కుడువనని తుదివాని
మదిమెచ్చి పసివాని బ్రదుకొసంగినవాని

## తృతీయా విభక్తి

తొలఁగు దరిద్రతావ్యథలు దూరములయ్యెడు నీతిబాధ ల
వ్వలఁ జనురోగముల్ పొడవుపావనమయ్యెడు మానవుల్ వృథా
కళవళమందనేల గతగాథలకై మది నీప్సితార్థముల్
గలుగు కపాలిచేత మృగలాంఛనుచేతఁ బినాకపాణిచేన్.

కళిక (తురగవల్గనము)

మఱియు వల్లకాటియందు మసలునట్టి జోగిచేత
సురలఁ గరుణఁజూచి సకల శుభములిడెడు శూలిచేత
నెపములెన్నకుండఁ బ్రజలఁగృపనునేలు విభునిచేతఁ
దపమె తడవుగా వరాల దయనొసంగు వేల్పుచేత
హరి హిరణ్యగర్భ గర్వ హారియైన హరునిచేత
నరుని తపమునకును మెచ్చి శరములొసఁగు దాతచేత
గొల్లగఱిత కోరిపిలువఁ గూర్మిఁజేరు రసికుచేత
నుల్లమొసఁగి భక్తిధనముఁ గొల్లగొట్టు వేల్పుచేత

ఉత్కళిక

వేఁడు మిండ జంగమంబు నాఁడు సభను వెక్కసంబు
నందునట్లు జిలుఁగువలువ మందయాన యొకతె యొలువ
మానమింత తూలనీక తాను నెనరుమాని కోక
లిచ్చిప్రోచి ప్రజలచేత మెచ్చులందు శివునిచేత

చతుర్థీ విభక్తి

వరదుఁడటంచు భక్తిని దపంబొనరింప వరంబుఁ గోరుమం
చురుకరుణన్వచించి తనయుల్లమునన్ నిలుమన్న యాగజా
సురుని యభీష్టమున్మదిని సుంతయునోడక తీర్చుసామికై
కరుణ రసార్ద్రమానసునకై గిరిజాహృదయాపహారికై

కళిక (హరిణగతి)

మఱియును భక్తుని క్రమఁగని బరువగుచెఱకులమోపిన శ్రీకంఠునకై
వరగిరిజాముఖచంద్రుని రోచుల మరగి చరించు చకోరంబునకై
కరికిని ఫణికిని సాలీనికి వేఁ గైలాస మొసంగిన దేవునకై
యెఱుకని భక్తినిగనఁ గన్నులఁగొని మరల నొసంగిన వేల్పునకై

మురహరుఁడు న్మరిమేరువు జలనిధి శర చాప నిషంగము లౌపతికై
ఖరకర శీతక రానలులేతన కనులుగఁజెలఁగు నుమాపతికై
కలియుగ కైలాసమునాఁజను తిరుమలపై నలరెడు మహాదేవునకై
జలజాతాసన మఘవార్చితపద సరసీరుహ శోభిత కాయునకై

ఉత్కళిక

గంగకుఁగలిగిన గర్వము నడఁపఁగ చెంగున భుజిజాలరిగ శపింపఁగ
వంగి పదమ్ములఁబడి పద్మానన "అంగజహర ! నిన్విడువగఁలే" నన
"నతివరొ! కొన్నాళ్ళరిగినపిమ్మట జతఁగూడెద బ్రేమమ్మనఁ బొమ్మట"
కనియాదటజంగమమై సతికై చనియట పరిణయమగు పశుపతికై

పంచమీ విభక్తి

గ్రహదోషంబని వారదోషమని నక్షత్రంపు దోషంబటం
చిహసౌఖ్యంబునకేల సల్పజనులిస్సిస్సీ ! వృథాశాంతు లా
యిహసౌఖ్యంబుఁ బరంబుఁ జేకుఱును సుంతేనిన్ దిరంబున్నచోఁ
దుహినక్ష్మాధరపుత్రి భర్తవలనన్ దోర్దోధరామండలిన్

కళిక (తురగవల్గనము)

మఱియు వెండికొండమీద మనికికన్గు విభునివలన
గిరిజ హృత్సరస్సునందుఁ దిరుగు పరమహంసవలన
మత్తగిల్లినట్టి సత్తు గిత్తనెక్కు సామివలన
బత్తిఁబత్తిరిడిన బుత్తిముత్తులొసఁగు వేల్పువలన
నమరులెల్లఁగొలువ వేడ్కనాడు నాదినటుని వలన
సమరమందు వెన్నొసంగి చననియట్టి జోదువలన
నాది మధ్య లయము లేక యలరునట్టి యభవువలన
వేదవేద్యుఁడౌచు లీల విశ్వమేలు ప్రభువువలన

## ఉత్కళిక

మామయలిగి పిలువకున్న భామచనక మాననన్నఁ
బొమ్మటంచుఁ బంపి గౌరవమ్ము జరుగకుంట వీర
భద్రుఁడౌచు దిక్కులెల్ల నద్రువ దక్షయజ్ఞమెల్ల
చెఱచి సురల నుతులవలన గరుణఁబ్రోచు శివునివలన

## షష్ఠీ విభక్తి

పుట్టిన దాదిగా భవ సముద్రములోఁబడి కొట్టుకొంచునే
గట్టును జేరలేకను నగాధము నందున మున్గితేలుచు
న్నట్టి యమాయిక ప్రజల నందఱఁగావఁగ గంకణమ్ముఁ దాఁ
గట్టిన పార్వతీపతికి గాఢపుభక్తిని మ్రొక్కుఁడీ జనుల్

## కళిక (మధురగతి)

మఱియును జగముల మనిచెడువిభునకు
మురహర చరణాంబుజ మధుకరునకుఁ
బ్రమథగణార్చిత పాద కమలునకు
విమల యశశ్శోభిత సుచరితునకు
వాసవగర్వ విభంజన కరునకు
శాసిత త్రిజగత్సంభ్రమ హరునకుఁ
గరుణారస సాగరునకు హరునకు
శరణాగత రక్షణునకు శివునకు

## ఉత్కళిక

మును నిశ్చలమగు మనమునఁ దనమగు
వగుటకుఁ తపమును నగజ సలుపఁగను
విని యాయమ మనమును దాఁగనుఁగొన
నటఁ జను వటునకు నిటలనయనునకు

## సప్తమీ విభక్తి

మానవులార! దైన్యమున గ్రుంగఁగనేల? సుమాయుధుండు మీ
మానముఁదీయు నంచు ననుమానము కల్గెన? క్రోధలోభ మో
హానల దగ్ధులై చనెద రన్నభయంబుననా? సుఖంబు మీ
మానసము స్థిరంబుగ నుమాధవు నందున నిల్పి పొందుఁడీ!

## కళిక (హయప్రచారము)

మఱియు లోక మాన్యునందుఁ
గరుణఁ జిలుకు ఘనునియందు
అరులఁ జంపు హరునియందు
వరము లొసఁగు భవునియందు
నభయ మొసఁగు నభవు నందు
శుభములొసఁగు శూలియందు
నగజ హృదయ హరునియందు
జగములేలు శర్వునందు

## ఉత్కళిక

మమతతోడ నుమను గూడ
మాయజోగి చాయ నేఁగి
కలికి యలుగఁ బలికి త్వరగఁ
బొడవు నందు మృడుని యందు

## సంబోధన

స్థిరరతభక్తి నిన్ హృదయ సీమను నిల్పినయంతఁ బ్రేడిమున్
వరములొసంగు భక్తజనవత్సల! మున్నొక రాక్షసుండు తాఁ

గరమునఁ దాకినన్ నివుఱుగా వరమిమ్మన నీయలేదె ? శం
కర ! గిరిజాసనాథ ! సుమకార్ముక భంజక ! చంద్రశేఖరా !

క ళి క (హయప్రచారము)

మఱియు దక్షమఘ విభంగ !
సరసిజభవ సన్నుతాంగ !
భోగినిచయ భూషణ గణ !
రాగరహిత రమ్య సుగుణ !
మానసభవ మదవినాశ !
దానవజనతా నివేశ !
శ్రీశ మఘవ హృదయవర్తి !
కాశసుమ వికాస మూర్తి !

ఉ త్క ళి క

ముదమెసంగ మదినెఱుంగ
"శివ ! కొరటను జివురు దయను
నొసఁగు" మనుఁడు బసవునపుడు
కరుణఁగనిన హర ! త్రినయన !

సా ర్వ వి భ క్తి క ము

నీవాద్యుండవు నిన్నుఁ గొల్తు నెపుడున్ నీచే సుఖంబబ్బె నీ
కై వేడ్కన్ గయిమోడ్తు నీవలన నిక్కంబిష్టమీడేరె నీ
కేవేగన్ మనమిత్తుఁగై కొనఁగదే ! హెచ్చయ్యె నీయందునన్
నా విశ్వాసము దేవదేవ ! గిరిజానాథా ! లలాటేక్షణా !

# అర్పణము

తిరముగ నీవిలాసములఁ దీరిచిదిద్ది తెలుంగులో "సుదా
హరణము" వ్రాసి భక్తిమెయి నర్పణఁజేసితిఁ గైకొనంగదే !
వరగిరిజాహృదబ్జచరబంభర ! చంద్రకళాధరా ! హరా !
సుర నుత ! శంకరా ! కవికిశోరుఁడ శంకరుఁడన్ త్వదీయుఁడన్

---

# శ్రీమద్రామానుజోదాహరణము

శిరోమణి, విద్వాన్, శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులు
రీడరు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

## ప్ర థ మ ద శ ము

శ్రీరామారమణాంఘ్రి సారససుధాసేవా విలాసోల్లస
ద్ధీరాజ్యంబునఁ బట్టభద్రుఁడగుచున్ దివ్యాన్య సంపత్తులం
జేరబోవని యోగిరాజు సుమనో జేగీయమానోదయుం
డా రామానుజసూరి వెల్గెడు విశిష్టాద్వైత జీవాతువై.

## క ళి క

మఱియు శ్రీపేరంబుదూరను మహిత సరసిని విరియు పద్మము
మెఱయు యతితతి జ్ఞానభిక్షకు స్మేరముఖముల దరియు పద్మము
అమల కాంతిమతీ సతీ ప్రా గంగనామణి గర్భరత్నము
సుమతి కేశవభట్ట భూసుర శోభనైక ఫల ప్రయత్నము
సప్తశైల నివాసియౌ శ్రీశైలపూర్ణుల భాగినేయుఁడు
దృప్తవాది విరోధిశీర్ష విదీప్తమంగళ భాగధేయుఁడు
భవ్య పరతత్త్వార్థ నిశ్చితిఁ బతగకేతను విజయకేతువు
సవ్యతమ నిగమాంతకాంతా స్వాంతసాంత్వన ముఖ్యహేతువు.

## ఉ త్క ళి క

ధ్యాన మించుక లేక హరిపై జ్ఞాన మింతయు లేక ధరపై
పుట్టి గిట్టుచు గిట్టి పుట్టుచు వట్టిపూనికఁ బుట్టి నెట్టుచు
దరిని జేరఁగలేని జీవుల హరినిఁ జేరెడు నట్టిత్రోవలఁ
జూపి ప్రోచిన సూరివర్యుఁడు పాపముల నెడబాఁప ధుర్యుఁడు.

## ద్వి తీ య ద ళ ము

మానుగ మున్ను బాల్కడలి మంజుల మంగళ వృష్పశయ్యయై
పూనికఁ దమ్మఁడై పిదప పుల్లసరోరుహ నేత్రుఁ గొల్చి రా
మానుజమూర్తియై కలిని నా హరితత్త్వముఁ దేల్చువాని వి
జ్ఞానివరేణ్యు గణ్యు యతిసత్తముఁ జిత్తము హత్తఁ గొల్చెదన్.

### క ళి క

మఱియు సర్వవేదశాస్త్ర మహిమ నిండుమనము వాని
నెఱినిఁ జక్రిదత్తభార నిర్వికారుఁ డయినవాని
స్వప్రకాశవిహిత యాదవ ప్రకాశుఁ డయినవాని
విప్రకుల మహాపయోబ్ధి విమలచంద్రుఁ డయినవాన
గురుఁడు యాత్రమిషను జంపఁ గోర దెలిసి మెలఁగువాని
సిరియు హరియుఁ ద్రోవఁజూపఁ జేరి కాంచి వెలుఁగువాని
కాంచిఁ గాంచిపూర్ణు కృపను గాంచి తత్త్వ మెఱఁగువాని
వంచితాన్యభావనా ప్రపంచభక్తిఁ దనరువాని.

### ఉ త్క ళి క

ఆదికావ్యసార మెల్ల-ఆదరమునఁ జేవి కొల్ల
కొల్లగాఁగ నుల్ల ముల్లసిల్లఁ-ద్రాపమామ తెల్ల
తెల్లనై ప్రపత్తినిష్ఠ-వెల్లివిరియ సుప్రతిష్ఠ
లోకమాన్యుఁ డయినవాని-ప్రాకృతాళి మనుచు వాని.

## తృ తీ య ద ళ ము

పాయనపట్టుగొమ్మసుమ ! భాగవతాళికిఁ బల్లవావనీ
నాయకు నింటి భూతమును నాశిలఁజేయుట దెంతవింత ? చూ
చాయఁగఁ జూచుమాత్ర ఘనసంసృతి భూతములెల్ల ద్రెళ్లఁ మా
శ్రీ యతిరాజుచేత విలసిల్లు మనోరథసిద్ధు లెల్లెడన్.

క ళి క

మఱియు శిష్టాచార మార్గసోమునిచేత
పిఱివోని వాక్యార్థ పృథివి భీమునిచేత
శ్రీ యామునస్వామి చిత్తచోరునిచేత
తోయజాక్షపరత్త్వ దుందుభిధ్వనిచేత
జ్ఞానముద్రాలసితి శస్తహస్తునిచేత
వైనతేయతురంగ బద్ధచిత్తునిచేత
భవరోగజాలములఁ బాపు వైద్యునిచేత
స్తవనీయ గుణములం దనరు హృద్యునిచేత.

ఉ త్క ళి క

యామునార్యు వ్రేళులెంచి-స్వామి! కృతుల నే రచించి
తీర్థుఁ గోర్కెలనెడు మంచి-వార్తవ్రేళ్ళు విరియఁగాంచి
ధన్యజీవితం బటంచు-మాన్యవరులు సంస్తుతించు
చరిత నెసఁగు ధుర్యుచేత-గురువు లక్ష్మణార్యుచేత

చ తు ర్ద ద శ ము

అల కపి యాసనంబువలె నా హరి యుండునటంచు నొజ్జ దాఁ
బలికిన పల్కు ముల్కుగుట భావనఁ దక్కపి సూర్యుడంచు లోఁ
దెలిసి వచింపఁ బండితులు ధీవిభవమ్ము నుతించిరట్టి తీ
ర్థుఁడు యతిమౌళికై కృతులు దోరపుభక్తి రచింప నింపగున్.

క ళి క

మఱియును శాంతవసంత నిశాంతము
మధురాంతకమున మసలుమేటికై
తెలివులుసూపు మహాగుణపూర్ణులఁ
దీర్థులఁ బొందిన పుణ్యపేటికై

పూర్ణుల పూర్ణ కృపార్ణవ మొసఁగిన
పూత సుమంత్రామృత పాయికినై
చూర్ణితదాసజనాఖిలదోష సు
సుందర మందస్మిత దాయికినై

కాషాయాంబర వేషోద్భూషిత
కాయ సురద్రుమ కమనీయునకై
ఘోషిత కౌస్తుభ భూషాతోషణ
గురుతామల వాక్స్పృహణీయునకై

కరము త్రిదండము గరమున మెఱయఁగఁ
గన్నులజున్ను ప్రపన్నుల పతికై
హరియే పరుఁడగు హరియే గురుఁడగు
హరియే వరుఁడని చాఁటెడు యతికై.

ఉ త్క ళి క

అవని యథార్థముగాదని మతి కైతవమునఁబల్కువితండుల ముఖ కై
రవములు మొగడఁగగఱకఱ నుడికైదువు భానులుసెలఁగఁగదమిరవికై
శౌరపు దీప్తులఁదగి భక్తుల కైవారములంగొని దాసులఁగని కై
వల్యముఁజూపిన గుణశేవధికై కల్య కృపారస ఘన నీరధికై.

ప ం చ మ ద శ ము

క్షీరాంబోనిధి కన్యకావదన పంకేజాత నిర్యాత వా
క్సారామోద పరంపరా ప్రవిలసత్కర్ణద్వయీశాలియౌ
నీరేజాక్షుఁడె మేలనంగఁ గవితానిర్మాణముల్ సేయు మా
శ్రీరామానుజ యోగివర్యువలనం జేకూరు సర్వార్థముల్.

క ళి క

మఱియు తిరుమంత్రసుమ మధుపరాజము వలన
అఱగొఱలు తొలఁగించు నమరభూజమువలన
ఎసఁగుకృతఁ గూరేశు నేలు తీర్థుని వలన
వెస వైష్ణవోద్ధార వీరపార్థుని వలన
స్వాలాప పరిపోషి తాంధ్ర పూర్ణునివలన
వ్యాలోల జనతావ నాగ్రకర్ణునివలన
శిష్యతాగౌరవా శ్రిత దాశరథివలన
హృష్యద్రమేశా ప్త హృదయ నీరధివలన.

ఉ త్క ళి క

గోష్ఠిపూర్ణులఁ జెంది నిష్ఠ మంత్రముఁ బొంది
గురునాజ్ఞలను మీఱి దరి గోపురముఁ జేరి
మూలమంత్రముఁ జాటి లీల మానవకోటి
నలరించు కృతివలన వెలయు యతిపతివలన.

ష ష్ఠ ద శ ము

వెన్నెలబాట ప్రాఁబలుకు వేలుపురాణికిఁ గ్రొత్త కప్రపుం
దిన్నెలనేల కట్టిమదిఁ దేర్చిన వెన్నుని పాటిబోటికిన్
గ్రొన్నన సెజ్జ చిల్కనుడి కూరిమిపానకు వేని దెంప మా
వన్నియకాఁడు మా యుదయవర్లకు నిచ్చలుఁ గేలు మోడ్చెదన్.

క ళి క

మఱియును యామునఋషి యాదేశము
మౌళి వహించిన మంగళమతికిన్
గుఱుతుగ శ్రీరంగమ్మునఁ బీఠముఁ
గోరఁగనెక్కిన దేశిక పతికిన్

ఆగమవాక్య పరాక్రమలీలను
యజ్ఞసుమూర్తిని గెల్చిన గుణికిన్
భాగవతాకాశ మ్మది వెల్గఁగ
భాసిలు జ్ఞాన నభోమణికిన్
గోవిందాఖ్యుని వైష్ణవముద్రల్
గూడఁగఁజేసిన గురుతర యతికినౌ
పావనవాచా లహరుల ద్రావిడ
వసుమతిఁ బూత మొనర్చిన కృతికిన్
బంధుర మాయావాది తమమ్మలఁ
బాఱఁగద్రోలిన భాసుర రవికిఁ
బంధనహేతు వివాది కువాది
ప్రచయాచలగణ ఖండన పవికిన్.

ఉ త్త రి క

తొలి ముగురాళ్వారులు మడిఁజేయన్ కులశేఖరులటఁగాల్వలుదీయన్
అలశఠగోవులు విత్తులువేయన్ లలి పెరియాళ్వార్ నీరమువోయన్
అలరుల నాండాళ్ ముడువఁగ మాలిక అలరెడి వైష్ణవ వనమునకేలిక
వీనులఁ దనిపెడి కోయిల తేనికి దీనులఁ బ్రోచెడి దివ్యజ్ఞానికి.

స ప్త మ ద శ ము

భద్రారంభములున్ రమారమణ దివ్యశ్రావ్యకావ్యోక్తి సం
పద్రాగమ్మలు పద్మనాభదృఢ సంబంధుత్వ సంకేతముల్
ముద్రాంకమ్ములు గల్గి వెల్గు సుకృతుల్ మోదింతు రెంతేని శ్రీ
మద్రామానుజయోగియందు యతిసామ్రాజ్యేశునం దెప్పుడుఁ.

క ళి క

మఱియు వేంకటాద్రి హరిని మహిమఁజూపు సూరియందు
కొఱలు భక్తిఁ జేరువారి కొఱలుమాపు శౌరియందు
కాలగతికి నెదురు నడచి క్రాలునట్టివానియందు
మేలుకోటఁ బతిత జనుల మేలుగూర్చువానియందు
వనజ నయన శయన మనుజ భావనావతారునందు
మనసిజాత జాతవికృతి క్రమందఁజేయు ధీరునందు
నాస్తి నాస్తి వాదిమౌళి న్యస్తపాదపద్మునందు
ఆస్తిక ప్రపంచ సంచితార్థ విభవసద్మునందు

ఉ త్క ళి క

మేలు కావిశాటి గట్టి కేల దండ మొనరఁ బట్టి
నిలువు పుండ్రములను బెట్టి తళుకు జందెములను జుట్టి
వన్నెచిన్నె లన్ని నెట్టి చిన్నసిగను దాల్చినట్టి
మంగళాంగరంగునందు రంగపద్మ భృంగమందు,

సం బో ధ న ద శ ము

ఏదీ ప్రేలుమడంచి చూపుమనుమీ! యీ విశ్వవిశ్వంబునన్
వాదప్రౌఢినొ? శాస్త్రసంగతినొ? సత్ప్రామాణ్యసంపత్తినొ?
వేది న్నీసరి నిల్వఁగల్గు మతిమద్వేదండు వేత్తొక్కనిన్
పూదండల్ యతిరాజ! రాజవదనాంభోజా! త్వదారాధనన్.

క ళి క

మఱియు శ్రీభాష్య కృన్మహనీయ శుచికీర్తి!
వఱలు శాంతిప్రభల వరణీయ రుచిమూర్తి!
గీతకును భాష్యమున్ గీలించు మతిప్రోడ!
చేతమున హరి నిల్వఁ జేసికొను యతిజేడ!

సరస గద్యత్రయా సంధాన గుణశాలి !
పరమపదసోపాన పాళి వచఃకేళి !
వేదాంతసారకృతి వేదితాగమమర్మ !
వేదాంతదీపరుచి వివృతాఖిల సుధర్మ !

ఉత్తరిక

పాతముల్ వడిఁ దెల్పి పీఠముల్ గడు నిల్పి
జిష్ణువాదము వేసి విష్ణుమయముగఁ జేసి
తనయాన జగమెల్ల అనయమ్ము వర్ధిల్ల
వర్ధిల్లు గుణసాంద్ర ! వర్ధిల్లు యతిచంద్ర !

సార్వవిభక్తిక పద్యము

యతిరత్నంబవు నీవు నిన్ను గొలుతున్ బ్రాప్తించు నీచేత స
ద్గతి నీకై కృతులిత్తు నీవలన జేతఃప్రీతి సంధిల్లు శ్రీ
పతి నీకుం గడుఁ గూర్చువాఁడగుట సంపద్వృద్ధి నీయందు సు
వ్రత! రామానుజ! మమ్మునేలుకొనుమీ! స్వామీ! నమోవాకముల్.

అంకితాంక పద్యము

సూరుల్ పత్రమొ పుష్పమో యను విధిన్ జూడంగ రంగాఖ్యుఁ డీ
సారోదాహరణమ్ము నాంధ్రకవితన్ సంధించి సద్భక్తిమై
శ్రీరామానుజ ! కీర్తికౌముదిగఁ ద్వచ్ఛ్రీపాదకళ్యాణ కృ
ప్నీరేజమ్ములఁ బ్రోల గాన్కయిడె దీనిన్ స్వామి ! గైకొనగదే !

---

# శ్రీ వి శా లాం ధ్రో దా హ ర ణ ము

డాక్టరు దివాకర్ల వేంకటావధాని ఎమ్. ఏ. (ఆనర్స్) పి. హెచ్. డి.
ఆంధ్రభాషాశాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

## ప్ర థ మా వి భ క్తి

శ్రీలకు నాలవాలము నశేషజనస్తవనీయ వృత్తమున్
శాలిముఖ ప్రసిద్ధ బహుసస్యసమృద్ధము శాస్త్రశిల్పవి
ద్యాలసితమ్ము వైభవనిధానము నైన మహాంధ్ర రాష్ట్రము
ద్వేలయశః ప్రమోద నిరతిం గలకాలమెసంగుఁగావుతన్

## క ళి క

మఱియుగోదావరీ మహితవాః ప్లావితము
వరకృష్ణవేణీప్రవాహపరిశోభితము
తుంగభద్రాపగా తోయసిక్తోదరము
భంగిత పినాకినీ భాసి విమలాంతరము
వంశధారానదీ వారి భరితోత్తరము
వంశాయితోర్మిపాపఘ్ని సరిద్వరము
నాగావళీపయః స్నానపూతజనమ్ము
శ్రీ గణ్య విమలమం జీరోర్మిగానమ్ము

## ఉ త్క లి క

జననకాలముఁ దొట్టి జననియను గుఱిపెట్టి
యతిభక్తి మదిమెచ్చి నతి సహస్రములిచ్చి
జనులెల్ల సేవింప ఘనవినుతిఁగావింప
నెసలారు కామగవి పసమీఱు తెల్గుభువి

### ద్వితీయా విభక్తి

ప్రాణమ్ముల్ బలిపెట్టి యెట్లెటులో సంపాదించు కొన్నట్టి భా
గ్యానందైక నిధానమౌట లసదైక్య ప్రాప్తినాంధ్ర ప్రజల్
న్యానత్వమ్ము తొరంగ నాల్గు దెసలందుం గీర్తిపర్వంగ స
మ్మానింపం దొరకొంద్రు గాక నవజన్మమ్మున్ విశాలాంధ్రమున్

### కళిక

మఱియు శాతవాహననృప మౌళిగుప్త మైనదాని
నిరతకృతాధ్వరధూమా న్విత పరిసరమైనదాని
చిరమిక్ష్వాకుర్వీపుల చేఁబాలితమైనదాని
గురునాగార్జున కమ్రో క్తులసారము గొన్నదాని
చాళుక్యాధిప బాహా శ్రయ సంపదమన్నదాని
పాలిత వేదోక్తవిధి ప్రకరాంచిత మైనదాని
కాకతీయనృపతిపరా క్రమరక్షిత మైనదాని
ప్రాకటకీర్తి జ్యోత్స్నా ప్రభలను సడిసన్నదాని

### ఉత్కళిక

శకపహ్లవులాక్రమించి వికలత్వమునందుముంచి
నిగమాచారముకలంచి తెగిఘోరములాచరించి
అనివార్యతఁజెలరేఁగఁగ గనికోపముమదిరేఁగఁగ
మదమడఁగించిననేత్రిని ముదమడరించినధాత్రిని

### తృతీయా విభక్తి

అమితప్రాభవమంది సాటిజనులందాధిక్యముంబొందిఁపూ
ర్వమువోలెన్ మహనీయవైభవయశఃప్రాప్తిన్ విరాజిల్లిశ్రే
యముసాధించెడుఁగాత తెల్గుప్రజ నిత్యమ్మున్ విశాలాంధ్రరా
ష్ట్రముచే నూతననిర్మితాంగకసమగ్రత్వస్ఫురన్మూర్తిచే

క ళి క

మఱియునన్నయ భట్టుకవితా మధువుచిందినపుష్పవనిచే
వరకవీంద్రుని దిక్కనను గని వాసికెక్కినరత్నఖనిచే
అనఘుఁడెఱ్ఱనకావ్యబీజము లడరఁజేసినక్షేత్రమణిచే
ఘనుఁడు సోమనరసనికాయము కలయనించినమహితధునిచే
రసికవరు శ్రీనాథుకనక ప్రసవపూజల తన్పుగుణిచే
మసృణకవితామూర్తి పోతన మాధ్వీచల్లిన పూతజనిచే
ఆంధ్ర కావ్యపితామహుని కవి తామృతాపగపారుధరచే
ఆంధ్ర పదకావ్యాబ్ధిత్యాగయ అవతరించిన వసుంధరచే

ఉ త్క ళి క

సుగతబోధామృతము లానుచు సుగతినార్జింపంగఁబూనుచు
విభవభోగాసక్తి వీడుచు శుభదచింతాతతులు తోడుచు
బుద్ధదేవుని మహిమ లెంచుచు ఇద్ధచిత్రములను సృజించుచు
మనినశిల్పులఁగనినభువిచే ఉనికిమార్చిన చారుదివిచే

చ తు ర్థీ వి భ క్తి

ధనముల్ భోగములున్ సుఖానుభవమున్ ద్యాగమ్ము కావించి వ
ర్ణనకున్ మీఱినభక్తి రేయుఁబవలున్నాకెంతొ చింతించుచున్
దనువుల్ ప్రాణచయమ్ము కూడ బలులై దైవార నాంధ్రప్రసూ
తనయుల్ ప్రాజ్ఞులొనర్చి రెన్నొ ఘనయత్నమ్ముల్ మహాంధ్రమ్ముకై

క ళి క

మఱియు ససారమ్మయిభ ర్మముపండెడిధారుణికై
నిరత ఫలిత పుష్పితతరు నికరలతాశోభినికై
పూతనదీజల శీకర పూరితతను పవనముకై
వీతభయామయజనగణ విలసితనగరవనముకై

ఉన్నతభూమీధరశిఖరోల్లసితాకారముకై
సన్నుత ప్రాసాద శిరః సంగశోభితాభ్రముకై
అనవరత దయౌదార్యము లలరు జనుల వాసముకై
గుణగణసంపాదితసిత కుందశోభాసముకై

ఉత్కళిక

దేశమునకు నడుమనుండి వైశాల్యముచాలనొంది
ఆర్యసంస్కృతినిధరించి వీర్యమహిమలను వహించి
హారతరళ మణినిబోలి వారిజకర్ణికకుఁజాలి
అలరుతెలంగాణముకై తెలుఁగువారి ప్రాణముకై

పంచమీ విభక్తి

సమరహితోత్తమప్రతిభ సర్వమహత్తర కీర్తివైభవం
బమరఁగ భోజనాంబర గృహాదికమందొకలోటులేక యు
త్తమగుణసంపదంగనిన తమ్మనవాత్తలసన్మహాంధ్రరా
ష్ట్రిమువలనందెలుంగుప్రజ సర్వసమృద్ధినెసంగుఁగావుత॥

కళిక

మఱియు రాజరాజనృపతి మన్నించినధరణివలన
వరకవినన్నయ జనించి వర్ధిల్లినయవనివలన
గణపతిదేవు పరాక్రమ ఘనత కన్నధాత్రివలన
అనఘుడు తిక్కన జనుల నదలిచిన ధరిత్రివలన
పరులనోర్చి రెడ్డివిభులు పాలించినజగతివలన
అరులుబెగడ శ్రీనాథుండలరాలినవసుధవలన
రాయల భుజపీఠంబున రాజించిన జాణవలన
మాయనికవిత కవీంద్రుల మదినిల్పిన గాణవలన

## ఉత్కళిక

వేదార్థమ్ములనెఱుఁగక వాదమ్ములొనర్చు చురక
నిజసంస్కృతికిని వెలియై గజిబిజి కనిశము గుఱియై
కలఁగు తెలుఁగువారిఁ బ్రోవఁ గల వేదార్థంపు త్రోవ
వెలయించిన భూమివలన విలసిల్లు జగమ్ము వలన

## షష్ఠీ విభక్తి

ఇమ్మగుసుస్థితిన్ జలసమృద్ధిలసత్తృణకాష్ఠవృద్ధిసౌ
ఖ్యమ్మొనగూర్చుసాధనని కాయములన్ దగుపాడిపంటలన్
గమ్మనిపల్కులన్ మతివికాసమునన్ గొదయేది? యాంధ్రరా
ష్ట్రమ్మునకున్ జరిత్రవిలసన్మహనీయ యశోవిభూతికిన్

## కళిక

మఱియు విద్యారణ్యసితవో మహిమపొందిన ఘనఫలమునకు
అరినృపాల భయంకరుఁడు తిమ్మరుసు మతిలతనుసుమమునకు
వీరభామినిరుద్రమాంబపవిత్రయశమలరారునేలకు
క్రూరయవన చమూమహాబ్ధిని రోధకాతి విశాలవేలకు
బాలచంద్రు మహాపరాక్రమ వహ్ని రేగిన కాననమునకు
శీలధన జనతాయశస్సు శ్రీవితానము తానకమునకు
మతి బృహస్పతియౌ యుగంధర మంత్రిఁగడుపునఁ గన్నతల్లికి
వితత రసములఁగావ్యసుమముల వెల్వరించిన మంజువల్లికి

## ఉత్కళిక

క్రొత్తమత్తాశ్వములఁదోలుచుఁ
జిత్తరయమెసఁగంగఁబోవుచు
రథము యువకుని పైఁదరల్చిన
ప్రథమ పుత్రుని స్మృతి వచించిన

మరణదండన పాలుచేసిన
యరిది ధర్మము ప్రోదిచేసిన
రాజుపాలనగన్న ధరణికి
తేజమెఱసిన పుణ్యసరణికి

## స ప్త మీ వి భ క్తి

కమలాక్ష ద్రుహిణేశ్వరుల్ సకలలోక త్రాణపారాయణుల్
నమదింద్రాది సురేంద్రమౌళి మణిమాలారంజి తాంఘ్రిద్వయుల్
ప్రమదంబారఁగృపార్ద్రవీక్షణములన్ బర్వింత్రుగాకాంధ్ర రా
ష్ట్రము నందున్ భరతప్రసూగళగభూషారత్నమందున్ సదా

## క ళి క

మఱియు త్యాగరాజుగాన మధువానినదేశమందు
సరసమృదుల కర్ణాటక సంగీతనివాసమందు
గోపాల పదాలసృష్టి యేపారినసీమయందు
దీపిత శృంగారరసము తీపులీను ధామమందు
కూచిపూడి గ్రామమునకు కుదురైన ధరిత్రియందు
ఏచిన నాట్యవిధానము వింపులొల్క ధాత్రియందు
చారుశిల్ప చిత్రకళల సదనమైన వాటియందు
భూరికీర్తి శేముషీ విభూతి భరిత పేటియందు

## ఉ త్క ళి క

పరసేనల దవ్వునఁగని పరమోత్సాహమ్మునఁజని
అణువంతయు వెఱపెఱుఁగక అనిమొన ధైర్యము విడువక
ఘోర వీర్యమునకుఁదగిన కీరితి సంపాదించిన
సుతులగన్నతల్లియందు వితరణగుణవల్లియందు

## సంభోధన ప్రథమావిభక్తి

తొల్లి తెలుంగు భూపతులు దోర్బలసంపదనిస్సమానులై
యెల్లహరిత్తులంగెలిచి యేలిన వైభవముందలంచి క
న్నీళ్లలు నించునాంధ్రులకు నేఁటికిఁబూర్వవిభూతి చేకుఱెన్
జల్లని చూపులంబరపి సాకుమువారి మహాంధ్రరాష్ట్రమా.

### కళిక

విశ్వదాత త్యాగమహిమ విలసిల్లినదేశమ్మా
శశ్వదమలకీర్తిరుచి చ్ఛటలలరిన రాజ్యమ్మా
తెలుఁగు హరీంద్రము గర్జల దెసలులిసిన ఘనవనమా
విలసిత ధైర్యగుణాంచిత వీరజనన పావనమా
రాధాకృష్ణవచఃశ్రీ రంజిత హరిదంతరమా
గాథాశతసంకీర్తిత క్రమకీర్తి సుందరమా
పొట్టివంశశశియసువులు పొందిన రూపాంతరమా
దిట్టతనముచే నాంధ్రులు తెచ్చుకొన్నరాష్ట్రమా

### ఉత్కళిక

ఆమనివేళ చిగిర్చిన మామిడితలిరులు మేసిన
కోయిలకొదమలు పలికిన హాయిగొల్పు రొదలొలికిన
మాధుర్యమ్ములునిండిన సౌధమహోరుచిచెందిన
పలుకు తేనియలపుట్టా పరమవిభవములపట్టా

### సార్వవిభక్తికము

నీవేతేరఁగ సంతసంబు కలిగెన్ నిన్నెంచమైపొంగు నీ
చేవర్ధిల్లు సమస్తసౌఖ్యవితతుల్ నీకై కదా కోరికల్
నీవల్లన్ సిరులబ్బు వృద్ధియగుతన్ నీకెప్డు నీయండదే మా
భావమ్ముల్ నిరతమ్మునిల్చు శుభగ ర్భమ్మా త్రిశైలాంధ్రదేవతా.

---



# శ్రీ వీరభద్రోదాహరణము

శ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మ - అధ్యక్షులు,
ప్రాచ్య కళాశాల - వరంగల్లు.

## ప్ర థ మ

శ్రీ కల్యాణగుణామృతాంబుధి కృపాస్నిగ్ధాంతరుం డాశ్రితా
నేకార్థప్రద దివ్యవీక్షణుఁడు భగ్నీభూత దక్షాధ్వరుం
దేకాధీశ్వరుఁ డేకవీరుఁడు మునిధ్యేయుండు శ్రీభద్రకా
ళీకాంతుండగు వీరభద్రుఁడు సిరుల్ చేకూర్చి రక్షించుతన్.

## కళిక - జయభద్రరగడ

ఆదిమత్స్యమురేఖ లదలించి గదలించి
ఆదికూర్మముమించు నడుగుఁ దమ్ములవాఁడు
ఆది కిరిదంష్ట్రికాహారి జంఘాయుగీ
ప్రాదికిటి ఘోణతట దంకశోభలవాఁడు
భగ్ననరసింహోఽవలగ్నలక్ష్మీ పునః
ఫలితాత్మవక్షఃకవాటఫలకమువాఁడు
భుగ్నత్రివిక్రమ ప్రోద్ధకంకాళవి
స్ఫురితదంష్ట్రా భోగిముఖహస్తములవాఁడు
నందీశ్వర కకుజ్జనకదంసములవాఁడు
నాగేంద్రబంధ సుందరకర్ణములవాఁడు
స్పందితసుదర్శన శ్లధితశార్ఙ్గపరిభా
జాగ్రి దక్షిభ్రూవోదగ్రవక్త్రమువాఁడు
స్వధితిపరిభాచ్ఛటా ప్రౌఢనాసికవాఁడు
పరమేష్ఠి సృక్స్రువపరిభవోష్ఠములవాఁడు

విధి వీతిహోత్రగృహ విభ్రమాస్యమువాఁడు
వియదభ్రి విభ్రమత్పృథుజటాభృతివాఁడు.

ఉత్కళిక - ద్విరదగతి

హసియించి హసియించి యభ్రకాంతులచాలు
గ్రసియించి గ్రసియించి కలువపూవులడాలు
విహసించి విహసించి వెన్నునిమెయిఁదీవి
పరిహరించి పరిహరించి పరిదళితేందిరముసావి
హరియించి హరియించి యంబురాసులపొల్పు
విరచించి విరచించి వేయిఁగన్నులవేల్పు
లడర నెందఱు నేని నలరుతనుముద్రిందు
ఖలకాలరుద్రుండు ఘనవీరభద్రుండు.

ద్వితీయ

ఫలితకుర్విద్ధ దధీచినందనతపస్సంతుష్ట రుద్రాక్షిభూ
జ్వలనఖద్ధ సమస్తదేవగణ రక్షాదానలీలారతిన్
విలసద్గౌతమకన్యకా హృదయధాని న్నిండుకొల్పున్న మ
త్కులదైవమ్ముని బట్టి సప్రభుని గొల్తున్ వీరభద్రేశ్వరున్.

కళిక - తురగవల్గనము

ధృతిశీలున్ ధృతశూలున్ దృతహేలున్ దురితకాలున్
శ్రితపాళీస్తుతిలీలా స్మితలక్ష్మి వృతఫాలుఁ
రుద్భుగ్నీకృతఫాలున్ లులితద్రుహిణ కపాలున్
ద్విడ్భుగ్నీకృతిలోలున్ ధిగ్దిక్కృత సురపాలున్
శ్రితరక్షా ధృతదీక్షా కృతశిక్షా ఒదృతదక్షున్
దితకుహనా హర్యక్షున్ దృప్యన్మతి హర్యక్షుఁ

గళిత బ్రధ్నరదాంఘ్రిన్ ఖండిత వాయుకరాంఘ్రిఞ్
లలితమనోంబుజలీలా లాలితభూమిరథాంఘ్రిన్

ఉత్కళిక - హయప్రచారము

శశిరుషమైశ్లధిత మిషాకిటిరదనము గళితమృషా
హరి రదనోద్ధతకదనముహర శూలోదయసదనము
స్వరుగుదిత స్వరుచక్రముపరిభావిత భవిచక్రము
కరవాలము గైకొనుపతిసురవారము చొచ్చినగతి

తృ తీ య

హేరంబోత్థిత హస్తసన్నిభ భుజాహిగ్రస్త సౌపర్వణ
శ్రీ రాకేందునిచేతఁ దీర్ఘపటలీ శ్రీజన్మపాదాంబురు
డ్భూ రానమ్ర పునఃపవిత్ర మురజిత్పర్యంకుచేతన్ గృపా
ధారాస్వర్ధుని తాఁణవాయినిగమాస్థానీ సుఖాసీనుచే

కళిక - తురగవల్గనము

భద్రుచేత రుద్రుచేత భావుకామరుద్రుచేత
కాద్రవేయ హారవార కలితకాలరుద్రుచేత
హారిచే విహారిచే నతారిచే క్షతారిచేత
వీరుచే నుదారుచే గభీరుచే ప్రధీరుచేత
దానిచే నిదానిచేఁ బ్రధానిచే సుధానిచేత
జ్ఞానిచేత మౌనిచేత సర్వసుగుణధానిచేత
లలితలలిత జలదరుచిర లసితతను సముద్రుచేత
విలయదహన విజయినయన విజయవీరభద్రుచేత

ఉత్కళిక - హయప్రచారము

పాణిముక్కఁ జెక్కఁ జెక్కఁ యేణధరునిఁ ద్రొక్కి తొక్కి
రవినిఁ బండ్లు రాలఁదన్నిదివిని భువినిఁ దెలిలితన్ని
లింపపతుల లెంపలొడిచిపంపు మిగులఁ బగుల నడిచి
తాతనేలు త్రాతచేతమాతృభక్తిమాతచేత

చతుర్థి

అరవిందాసనమూర్ధభేదికయి త్రయ్యర్థైకసంవేదికై
దురితారణ్యమహోగ్రకీలికయి యందూబద్ధలేఖాళికై
చరణాలంకృతవిష్ణుచక్రునకుకై సారాంగదచ్ఛక్రికై
కొలువి న్నిల్చినవీరభద్రుకొలకై కోదండదోర్దండుకై

కళిక - ద్విరదగతి

వీరభద్రునికొలకు విపులరౌద్రుని కొలకు
వైరినాశనుకొలకు ఫలితభద్రునికొలకు
ఘనునికై సర్వలోకభయంకరునికొలకు
ననఘుకై వరదుకై యభయంకరునికొలకు
భీమవేషునికొలకు విబుధభూషునికొలకు
శ్యామలాంగునికొలకు సకలపోషణుకొలకు
విజయ దాయకుకొలకు విఘ్నవిఘ్నహరునకై
త్రిజగతీ భరణైక దీప్ర నిజకరునకై

ఉత్కళిక

శ్రీభద్రకాళికాసౌభాగ్యమాలికా
ప్రధమాన మధుమాసవిధుహాసి దరహాస
నవసుధా సేవనాకవితా విభావనా
మధురావతారుకయిపృథుదయాసారుకయి

## పంచమి

భరితోత్సాహిత గౌతమీతనయ ప్రాగ్వారాశిఁ గ్రైసేయుచో
గుఱిగా నిల్చి సమస్తభక్తజనతాఽగోరాశివారాశిఁ గ్ర
చ్చతి నిర్జింకు లోనర్చి యెల్లపుడు వాంఛాసిద్ధు లందించుచున్
మురమళ్ళంగల వీరభద్రువిలసనం బుట్టెన్ జగద్భద్రముల్

### కళిక - హరిగతి

పదిరెండిందుల నొదిగినహయగతి
పడ నడిచిన గుణభద్రుని వలనన్
మదిరెట్టించిన హయవల్గనగతి
మదమడచిన బలభద్రుని వలనన్
చఱచఱతెచ్చిన జయమంగళగతి
చదలంటిన భుజసారుని వలనన్
ద్విరదగతులఁ బదిదెసలను తెచ్చిన
విదళించిన రణవీరుని వలనన్
మఱిమఱితెచ్చిన మసలక కసికసి
మడియించిన జయభద్రుని వలనన్
హరిగతి నెగయుచు హరిదంతమ్ముల
నదలించిన పదముద్రుని వలనన్
మధురగతులతోఁ బదియాఱు కళల్
మఱిమఱి గ్రోలిన ప్రమథుని వలనన్
విధురాకడలై వెతపోకడలై
వెడలెడు చూపుల సురధుని వలనన్

### ఉత్కళిక - మధురగతి

హరిణగతిం జనుహరి హయు వెంబడి
పరువు లుడిపి పెఱవారలపైఁ బడి

కసిమసఁగిన వృషగమనము మెఱయగ
దెస లెల్లెడఁ దన తేజము మెఱయఁగ
రణగుణరవములు రగడల బొగడఁగ
ఘణఘణరవములు ఘంటల నిగుడఁగ
భయము లడంచెడి భద్రునివలన౯
జయభద్రము లిడు శరభుని వలనన్

షష్ఠి

వక్షస్సౌజ్మధుమత్త బంభర విభాస్వద్భద్రకాళీశ్వరీ
వీక్షాలేపన గంధసంకుమదముల్ హేరంబ దంతాగ్రధా
రాక్షోణీధరచిత్రగైరికకృతిభ్రాంతి న్విరాజిల్లు లే
పాక్షీభర్తకు వీరభద్రునకు ద్రుహ్యాద్వైరిసంహర్తకున్

కళిక - ద్విరదగతి

కనకగిరిసారునకు ఖండితవిపక్షునకు
మునిహృదయచారునకు ముదితస్వపక్షునకు
జలనిధిగభీరునకు జలజాప్తనేత్రునకు
కలికలుషహారునకుఁ గంకాళవేత్రునకు
కాలకాలాఉగ్నిదృగ్ఘర చంద్రహాసునకు
ఫాలేందుచంద్రికా భవ్య దరహాసునకు
కాలాగ్నిరుద్రునకుఁ గళ్యాణభద్రునకు
పాలితబ్రహ్మాండపరమ చిన్ముద్రునకు

ఉత్కళిక

తా నిలామూర్తియైతాను రసమూర్తియై
తనుతాన యనలుఁడై తనుతాన యనిలుఁడై

తా నక్షత్రభాసియైతాన సోమాసియై
తనరుఖరకిరణునకుతన సుసితకిరణునకు

## సప్తమి

శివనిందాస్త్ర తిరస్త దక్షతనయాచిచ్ఛక్తి యోగాగ్నిసం
భవతేజమ్మన నాగమప్రథితతాత్పర్యమ్మనన్ దక్షయా
గవనానీదమనోవిశేషమున భగ్నబ్రధ్నదంతమ్మనన్
కవనారామవసంతసీమను జగత్కల్యాణధామమునన్

## కళిక - వృషభగతి

భక్తజనతా భవ్యకవితా వరవసంత విజృంభణమ్మన
రిక్తభక్తి జడాళయాళీ గ్రీష్మ భీష్మ విజృంభణమ్మన
భక్తవాంఛిత దానలీలా వర్షుకాభ్ర విజృంభణమ్మన
భక్తిపూత హృదభ్రవీధీ భరిత శారదజృంభణమ్మన.
మధురభక్తి సమగ్ర జనహే మంతవేళాజృంభణమ్మన
శిథిలమానస భవివనానీ శిశిరకాల విజృంభణమ్మన
సర్వజగతీ జననభృతిహృతి శౌండ వీక్షాజృంభణమ్మన
సర్వశత్రు విదాహదోహల చటులహాస విజృంభణమ్మన

## ఉత్కళిక - హరిణగతి

ఏడుజలధులు నింకఁ గ్రోలుచు నేడునగముల దూలద్రోలుచు
చుక్కలన్నియుఁ జెమటచుక్కలు దిక్కులన్నియు నడుసుఁద్రొక్కులు
కన్నులుమిసినరవ్వ లగ్నులు కన్నసురలు భయాబ్ధిమగ్నులు
గాఁగఁ బొల్చుమహోమహమ్మన రాగదూర సుఖావహమ్మన

## సంబోధన

శ్రీకాళీ స్తనగంధసంకుమద సుస్నిగ్ధాత్మదోరంతరా !
లోకద్రోహి వనీకుతార కరుణాఽలోకామృతాసేచనా !
శ్రీకల్యాణనిదానభక్తజనతా ! శ్రీకంఠఫాలేక్షణా !
రాకానాథసహస్రసుందరముఖా రావయ్య భద్రేశ్వరా.

## క ళి క

జయ కాళికానాథ జయ సర్వసురనాథ
జయ భక్తనలహేళి జయ శత్రుదంభోళి
జయ సర్వతో భద్ర జయ జగత్త్రియరుద్ర
జయ భక్తిసంసాధ్య జయ వీరనారాధ్య

## ఉ త్క ళి క

శ్రితకల్పము కృతిశిల్పము శ్రుతిరూపము స్మృతిరూపము
స్థాపించిన దీపించిన భవదీపము శివరూపము

## సా ర్వ వి భ క్తి క ము

నీవే మూలము నిన్నె నమ్మి కొలుతున్ నీచేసనాథుండ నీ
కై వేడ్కోలిదె లేఁడు దేవుఁడెట నీకంటెఁ గృతుల్ నీకు మ
ద్భావం బెప్పుడు నిల్చు నీయెడన భద్రా నీవు నావాడవై
ప్రోవన్ వాంఛిత మొందుదుం గలుగునే పుణ్యైకలక్ష్యైకృతీ

అంకితాంకము - హరిణగతి

అఖిలజగము క్రియాత్మకంబగు
సఖిలక్రియలు త్వదన్వయంబగు
అవియు నా జే డయ్యె నెనిమిది
భువి విభక్తులు మూర్తు లెనిమిది
అలరునీవయి యాత్మ యొకడుగ
వెలయు మధురకవిత్వ మింపుగ
ప్రతివిభక్తియు భవ త్రిశుద్ధిగ
రతిని నవగతి రగడ లడరఁగ
ఫలిత తావక పంచవింశతి
లలిత లీలా లాస్య సంగతి
పొడము స్మృతి నంబోధనమ్మున
ద్రఢిమఁ గను నారాధనమ్మున
సకలమును శివసాత్కృతిం గన
సకలశివసాక్షాత్కృతిం గన
ఇది యుదాహృతి యిది ముదాహృతి
ఇది సదాఽగతి యిది సదాగతి
ఉదితశ్రీమదుమామహేశ్వర
హృదయకమలప్రేమబంభర
నిరత తత్కార నీరజస్థితి
హరిణగతి యగు [1]హరిణసంగతి
హరశిరశ్స్థిత [2]హరిణసంగతి
హరితకృతి యగు నఖిలసంగతి

1. గతిక తినునది లేఁడి 2. చంద్రుఁడు

అద్రిజాకర [1]హరిత సంగతి
అద్రిజా పద [2]హరిత సంగతి
జయ శివాకృతి జయము శివ మగు
జయము శివ మగు జయము శివ మగు

శివమ్

# సామగాన ప్రియోదాహరణము

శ్రీమతి బుర్రా కమలాదేవి - విశాఖపట్టణము

శ్రీ చక్రాంతర భానుకోటి లలిత స్ఫ్రీ ఘోష రమ్యప్రభా
ప్రాచుర్యాకృతి రాగ బింబితముగా త్రైగుణ్య వాగీశ్వరీ
శౌచాక్రాంతిని గాంచి విశ్వపరిధిన్ సంగీత సాహిత్య ధీ
వాచాశక్తి మయూఖలన్ బరపు తత్త్వంబెంచ సాధ్యంబొకో॥

శ్రావ్యోదాహరణ ప్రచారకలిత ప్రాచీన కావ్యాంతర
శ్రీవ్యాసక్తిని నాయకీ గుణగణ శ్రేష్ఠత్వమున్ దెల్ప నే
దివ్యోద్గీథ విశిష్ట నాదగతి నుద్దేశించి రాగోద్గతిన్
నవ్యోత్పన్న వివిక్త నామముల విజ్ఞాపింతు వాణీస్తుతిన్॥

హృద్యంబౌ స్వరరాగ నామములఁ బ్రత్యేకించి విశ్వంభరిన్
సద్యోగప్రద వర్ణనానుగతి సంస్థాపింపగన్ సంప్రదా
యద్యోతంబది చంపకోత్పల నిభ క్త్యా సాధ్యమౌగాక జీ
వద్యుమ్నాంచిత వృత్తనర్తనము నేవ్యక్తంబుగాఁ బల్కుతిన్॥

## ప్రథమా విభక్తి

కలహంసోక్తియు భారతీ నవనమై కల్యాణి మేల్మేలనన్
లలితోక్త్యామృత వర్షిణీ సదృశ హేలాజన్య కోలాహలో
త్కల ఝుంకారము జీవరంజనిగ; కేదారాత్త నృత్తంబుగా
విలపిల్లన్ ధవళాంగిగై కొనదె సంప్రీతాత్మయై సత్కృతుల్॥

కళిక

మఱియు భారతి దానవారిధి మలయమారుత మంజువాహిని
మెఱపు మించెడు నిర్మలాంగియు మేఘరంజిని గగన మోహిని
చిత్తరంజిని దేవరంజిని చిత్స్వరూపిణి నయన రంజిని
యుత్తమోత్తమ జలజవాసిని యోగదాయిని సుజనరంజని
అమృత పంచమ యాది పంచమమాలపింపఁగ బూర్ణ పంచమ
మమల కనక వసంత మల్లితి హాసదీపక రాగ పంచమి
పూర్వభైరవి పూర్ధరూపిణి పూర్ణచంద్రిక పుణ్యయోగిని
నిర్వచింపఁగ పూర్వి పల్కున నిత్య శాశ్వత శబ్దభాగిని॥

ఉత్కళిక

చంద్ర కిరణియు చక్రవాకము
చంద్రకాంతము సామనేకము
సర్వకుతూహల తీవ్రవాహిని
శరధి తుంగ తరంగ దేహిని
చూర్ణకుంతల చారుకేశిని
పూర్ణమంజరి నవవిలాసిని
శంకరాభరణ ప్రహేళిక,
పంకజాంశుమణి ప్రవాళిక॥

ద్వితీయావిభక్తి

ఆలాపింపఁగ యక్షగాన ఫణితిన్ హంస ధ్వని వ్యాహృతిన్
ప్రాలంబ శ్రుతిగీత మిందు మతిగాన్ రామప్రియో పాస్తికై

లాలిత్యోత్కలి తార్ద్రిదేశిక వలెన్ శ్లాఘ్య ప్రభాభోగియో
శ్రీ లోకాయత నాదబిందు గత సంసృష్టిఁ విలోకించెదన్॥

క ళి క

మఱియు శూలిని నెంతు మది త్రిమూర్తిగ దాని
నెఱసి గౌరిగ పాడి నెరవు జూపెద దాని
మార్గదేశిక యట్టి మాన్యతత్త్వము దాని
సర్గసింధు తరంగ – శబ్దితశ్రుతి దాని
పుష్పలలితకను మించు మోహనాంగము దాని
పుష్పవంతులనేలు ముఖవికాసము దాని
ప్రభవ కల్లోలాచ్ఛ రమ్యధామ్యము దాని
శుభ నభోమార్గణము శుద్ధి కిరణిగ దాని
విభవ మా తనుకీర్తి వినతిఁ బల్కెద దాని

ఉ త్క ళి క

స్వక కళానిధి యౌటఁ బ్రకట మంజరి యౌట
మధువునుద్ధగ తోడి మధుపమై యజుఁడాడు
కామవర్ధిని వంచు కమల జన్మవటంచు
వ్యోమచారిణిగాను వ్యూహ బిలుచుచుదాని॥

తృతీయా విభక్తి

ఝుంకార భ్రమరీ నినాదమున దా ఛాయాత్మయౌ నాట నా
యోంకార ప్రియ పూర్ణషడ్జమ రుతిఁ జ్యోతిష్మతీ యుక్తిచే
హ్రీంకారోత్తరిగా కళావతిగ తంత్రీనాద నామక్రియా
సంకేతంబున నాభవ ప్రియయుఁదా ఝుంఝూటి యౌవాణిచే॥

క ళి క

మఱియు గీతమూ_ర్తి నిరత మనిత ధీరమతిగ చేత
మొలపు గాంచ ధవళహంసి యోజఁబెంచు స్వరముచేత
రాగ పంజరంబునంది రామకలికి తనముచేత
సాగి పలుకు కీరవాణి సర్వని బహుధారిచేత
దేవ సాళగముగ వివిధ దేశ్యరాగ మణులచేత
జీవ దుందుభి ప్రియాత్మ సేవలందు సురటిచేత
ధైర్యముఖిని మాళవీ ప్రథఁ జటాధరో_క్తిచేత
శౌర్య ఘూర్జరీ ప్రశ_స్త సరణిఁ బూజలిడుటచేత

ఉ త్క ళి క

కోకిల ప్రతాపమెంచి నాక దేవగిరిని గాంచి
సుగమక ప్రియో_క్తి పంచు ప్రగతిఁ జూపఁ దన విపంచి
ఖరహర ప్రియాత్మ సీరకరణి పతిసి గౌరవాతి
సాహితీపస్నఁ గొల్పుమాత యూహిరేందు భోగిచేత॥

చతుర్థీ విభక్తి

త్రిజనోమ్మోహిని గానమూ_ర్తి యగుటన్ శ్రీరంజనీ ప్రక్రియఁ
విజయశ్రీ గరుడధ్వని స్వరములాభేరిన్ బ్రపంచింపఁగఁ
స్రజ దేవాభరణంబు లిత్తు మణి సారంగ ప్రియోపా_స్తికై
స్వ్వజపంచా ఘనసింధు శబ్దమటు ప్రస్తారింప జీవంతికై॥

క ళి క

మఱియును కరుణాకరి చాముండియు
మణిరంగ సభాంతరిఁ గొలుచుకై_ట

తలిఁగను జయనారాయణి ధర్మిణి
తరుణీప్రియగాను దర్బారునకై
సముదయ రవి చంద్రిక లొక్కెడవిడ
జయసింధువు ఘోషను సన్నుతికై
ప్రమితిని కాంభోజీ నవతానము
రవళింతురు సభఁ గీర్తించుటకై
కదనకుతూహల సేనాపతి యటు
కలకంఠిని కీర్తిప్రియనిరకై
కదలెద ః గంధర్వ మనోహారికిఁ
గనఁగ గగన భూపాలిని యటుకై
పదముల గణిత వినోదిని దాఁ గొన,
భవరసిక ప్రియకిడు బొట్టునకై
పదపడి బలహంస ననిపి కమలా
భరణము ధవళాంబరి కొసగుటకై ॥

ఉత్కళిక

పిలిచెద దివ్య తరంగిణి లన్నిటి
దొలి యమునా కళ్యాణిని నన్నిట
గిరి కర్ణిక యాకు సుమ ప్రియ నీ
మిరి గొల్వఁగ కుసుమావళిఁ దెలిసీ
టిని వెదుకదే? గౌరీ ప్రియ రిషభాం
గిని మంగళ కైశికి మృదు సుషమాం
గిని మాయామాళవ గౌళనుకై
కొని రాదే? స్వరధన పాలినికై ॥

పం చ మీ వి భ క్తి

కౌమారీ కరకచ్ఛపీ స్వర ఝణాకార ప్రణాదంబునన్
శ్రీమంజీర రవ ప్రవర్తిత లయోత్సేకంబు చెల్వొంద, నా
దామేయస్వర కంపితోచ్ఛలిత సామాందోళికా సీనయా
శ్యామాంగిన్ నుతియింప శ్రీవలన హంసానంద మందింపనా॥

క ళి క

మఱియు శహనలఁ బల్కు మధ్యమావతి వలన
జిఱుము సద్ధవళ సరసీరుహాళుల వలన
వ్యాపనీయ శుభ రిషభప్రియ సృతుల వలన
చాప ఘంటారవ విజాత్యుపశ్రుతి వలన
కనక దీపరథంబు కదలు కలగడ వలన
వినుత బంగాళాత్త విజయ శంఖము వలన
దివ్యగాంధార మది దీపర మగుట వలన
నవ్య సప్త స్వర నినాద మొప్పుట వలన

ఉ త్క ళి క

సర్వ మనోహరి యాచు
ధర విపంచిగఁ దోఁచె
హృదయగత తంత్రిగను
మృదు చిదానంది గను
కమల సంభవు రాణి
విమల హస్తము కాణ
యాచి గాగను వలను
కై చిరతపము వలన

## షష్ఠీ విభక్తి

నవరస చంద్రికా స్ఫురిత నవ్య వసంత జయంత సేనయ
ట్లవహితమై, విపంచియు, కళాభరణంబుగ శ్రీకరాజ్ఞ సం
భవము గనన్ స్వరాళియు, భవానివలెన్ గనె ఛాయ లెన్మిదిన్
భవనట భైరవీ గరిమ, భానుమతీ ప్రథనింప వాణికన్॥

## కళిక

మఱియు షడ్విధ స్వరూపి
మానవతిగ పలుకు చెలికి
నెఱిని గూర్చు నళినకాంతి
నించునటుల మధువు వెలికి
మృదు కళా స్వరూపి యౌచు
కృష్ణవేణి పరువు దనకు
నొదవ గోపికా వసంత
మూని పలుకు తానమునకు :
స్వర పవిత్రి సారమతిగ
షణ్ముఖ ప్రియోక్తి నిలకు
నెరపి పంచమ ప్రపత్తి
నిల్పు మత్త కోకిలలకు
యౌవనీ ప్రథన్ లతాంగి
హంసనాద మంద తలకు
జీవరత్న భూషణములు
దేవినింప తళుకు లిలకు

## ఉత్కళిక

బిందుమాలినీ ప్రసిద్ధి
నంది హంస గమనసిద్ధి
నొంది తాన రంజితోక్తి
విందుగూర్చ సింధుశక్తి
స్వర కురంజి నీలవేణి
గురుగుహ ప్రియాత్మ వాణి
నిరను గొల్చు చామరములు
స్వరమహా రభీజ్య నుతికి·

## సప్తమీ విభక్తి

రమ్యశ్రీ తిలక ప్రకాశ గత సౌరాష్ట్రీయ మాంజిష్టమే
స్వామ్యంబౌ తను సుప్రకాశముగ చిత్సౌందర్య సీమంతినీ
సామ్యంబౌ స్వర సుప్రదీప మతి నాసాదించె వీణాధరీ
సౌమ్యాలంబముచే విపంచియు గళాశక్త్యుక్తు లందంతటన్.

## కళిక

మఱియు మాళవశ్రీ మాన్యయందు
చిఱునవ్వు మల హరిన్ జిందునందు
కువలయానందంబు కుల్కునందు
భవ తరంగిణి లింధు పర్వమందు
వాచస్పతి వ్యక్త భావమందు
ప్రాచీన ధన్యాసి రశ్మియందు
సంగీత భాష్యంబు సాగునందు
సాంగంబు ద్యోతించు హాసమందు,

ఉ త్క ళి క

నవ్య శిల్పోక్తి భవ్య కల్పోక్త
రాగ సంప్యుక్త యోగ సంప్రుక్త
సూర్యకాంతోప్త ధైర్యశాంతోప్త
గాన మెందెందు చాన యందందు.

సంబోధన ప్రథమావిభక్తి

కాళిందీ యమునా సరస్వతుల సద్గంగా తరంగ శ్రుతిన్
బౌళీ వీణె సుపోషితంబుగ భవత్ప్రాచుర్య భూషావళీ
మేళాప్తిఁ ప్లుత వేగవాహినుల సంపృక్త ధ్వనిఁ గాంచి యా
నాళీకాంత వివర్ధినీ స్వరనుతిఁ నాదించు నారాయణీ॥

క ళి క

మఱియు భూపాలోక్త మంగళోదయ కాంతి ।
అఱుము సింహేంద్ర మధ్యమ విరాజిత కాంత ।
పాలితాబ్జ ముఖారి । బ్రహ్మమానస హారి ।
ప్రాలేయ వకుళాభరణ సురాగాధారి
రత్నాంగి । కనకాంగి । రమ్యశంఖ సితాంగి
ప్రత్నాయ విభవాంగి । సర్వ విధాసరసాంగి
చేతోన్మిత స్ఫీత । శృంగార పరిపూత
గీత ప్రియాఖ్యాత । కృతి విభాసితమాత ॥

ఉ త్క ళి క

వర సైంధవిన్ గొల్వ
ధర వనస్పతి నిల్వ
నడ స్వరావళి దెల్ప
విడి సభా మణి దాల్ప

సరి ద్విజావతి రాగ
స్వరము నాగరి దేగ
కిరణావళుల రాణి
త్వరను రాగదె । వాణి !

## సార్వవిభక్తికము

తల్లీ భారతి । నిన్నె నమ్మితిని నీ తత్త్వంబు నీ చేత్వదీ
యోల్లేఖంబున వించు నీకయి మనోవ్యాపాత్మలన్ జేర్చి నీ
వల్లన్ విద్దెలనంది నీ కెపుడు సేవన్జేయ నీ యందు భ
క్త్యుల్లాంబు ననుగ్రహింపుము మదియోద్గాతవై మాతరో ॥

## కృ తి వి వ ర ణ ము

కమలాదేవ మనోహరీ స్వర విధా కావ్యప్రకాశంబునన్
గమలా సీనను మద్హృదబ్జమున సాక్షాత్కార మందన్ స్వర
క్రమ నద్వైత నివిక్త నామనుతి నాపాదింతు చంధస్సునన్
కమలోన్మేషము మాతృకీర్తనము లక్ష్మబిందు నాగీశ్వరీ॥

# శ్రీ వేంకటాద్రినిలయోదాహరణము

శ్రీ గాజుల వీరయ్య, ఎం. ఏ., ఆంధ్రభాషోపన్యాసకులు,
విజయనగర కళాశాల, హస్పేట - బళ్లారి జిల్లా.

## ప్ర థ మా వి భ క్తి

ఉ. శ్రీ మహిళా మనోహరుఁ డశేష కృపా విభవుండు భక్తర
క్షామహనీయ సచ్చరిత సంవృతి సన్నుతిఁ గన్నవాఁడు సు
శ్యాముఁడు సర్వమంగళ కళాంచితుఁ డాదిజుఁ డచ్యుతుండు మ
మ్మోముత వేంకటాద్రినిలయుండు సమస్త సుధీ సుఖమ్ములన్.

## క ళి క (మిశ్రగతి)

మఱియు సూర్యుని సోమునిం దన మసలు గనులుగఁ గలుగు దేవుఁడు
గొఱఁత లేఁక జగమ్ములెల్లను గుదురఁ జూచెడు సుస్వభావుఁడు
యోగి హృదయాంబుజములందున నుండియొప్పెడు సద్విరేఫము
భోగి శయ్యను సిరుల నిడుపూఁ బోడితోఁగల చిత్స్వరూపము
వేద వర్గమునున్ హరించిన పీతమతినిన్ నొంచె సదయుఁడు
వేదవర్గముఁ దెచ్చియిచ్చెను వేధనుతియింపఁగ సహృదయుఁడు
బాణమై త్రిపురముల నెల్లను భస్మమొనరగఁజేసె భయదుఁడు
జాణయై శివు వెంట నంటిన జాల్మ నడఁచెను నెరి నభయదుఁడు

## ఉ త్క ళి క (మిశ్రగతి)

సురల కందఱ కేది భోగ్యము శరధిఁబడఁగా నింద్రు భాగ్యము
పాలకడలి మథించు సమయము వేలుపులు ప్రార్థింప ననయము
కూర్మమై కుధరంబు మూఁపునఁ గూర్మిమై వహియించి యేపున
సురల సాయమ్మయిన ధీరుఁడు శరధి సుత హృదయాబ్జసూరుఁడు.

## ద్వితీయా విభక్తి

ఉ. లేములు లేవు పాపములు లేవు సుఖంబున నుండువార లీ
రేమిటి కీశ్వరున్ హరిని నింగితమందున నుంచరయ్యా మీ
కామయముల్ నశించు నరయన్ జనుఁడయ్యు మనంబు నందుని
ష్కామముఁబూని శ్రీపతిని గాంచ నతండు మిమున్ కృపన్‌గనున్.

### కళిక (ఖండగతి)

మఱియు మోహినియగుచు మరులు గొల్పిన వాని
సురలకెల్లను సుధను జూఱ నిచ్చిన వాని
రాహు శిరమును స్వచక్రమునఁ ద్రుంచిన వాని
మోహమున దితిజులను మోస పుచ్చిన వాని
క్షీర సాగర కన్యఁ జెట్టఁ బట్టిన వాని
వారి నిధి సతతమును వసతిగాఁగల వాని
భక్తులగు వారలను బాలింపనగు వాని
సక్తుడై సనకాది సంయములఁగను వాని.

### ఉత్కళిక (ఖండగతి)

ముదమున వరాహంపు వదనమునుగొని సొంపు
ఘోరాసురాధ్యక్షుఁ గ్రూరుని హిరణ్యాక్షు
నంతంబు నొందించి పంతంబునన్మించి
భూమిఁగాచిన వాని సేమమును గను వాని.

## తృతీయా విభక్తి

చ. హృదయములో విషమ్ముఁ గనిపించని తీరుననుంచి చూడఁగా
వదనమునన్ సుధంజిలుకు వంచన నుండును మానవుండు నీ
కదనున సాయమీడు కృప నారయఁగాంచుము జీవ! శ్రీసతీ
హృదయ నివాసుచేత దివిజేశునిచేత వృషాద్రినేతచేన్.

క ళి క (చతురస్రగతి)

మఱియును భువి నరసింహ రూపమును
మానుగఁ బొందిన మౌని వరదుచే
వెఱపును జెందని హిరణ్యకశిపుని
వీత మతిని వెస ద్రెంచిన హరిచే
ప్రహ్లాదుని గడు ననురాగమునకు
బాలించిన భువనైక వంద్యుచే
నాహ్లాదమునను దివిజులు కై మో
డ్పులరుచుఁ జేయఁగఁ దనరిన ప్రభుచే
శాపంబునఁ జెంచెతయై భువిఁగల
శరధి సుతను జేపట్టిన ఘనుచే
తాపం బోర్చుచు తపంబు సలిపెడు
తార్క్ష్యుని దయఁగను దయాజలధిచే
అహోబలా ! యని యందఱు వొగడఁగ
నభయము నిచ్చెడు నఖిలనేతచే
మహేంద్రునిన్ నిజ కరుణాలోకము
మనిపెడు త్రిజగజ్జన నాధునిచే.

ఉ త్క ళి క (చతురస్రగతి)

వామనమూర్తిగ నదితికిఁ బుట్టిన
నేమము తోడుత విద్యలఁ దట్టిన
బలిమఖంబునకు వటుఁడుగ వచ్చిన
లలి శుక్రుని కను దర్భను గ్రుచ్చిన

మూఁడు పాదముల స్థానంబడిగిన
మూఁడు లోకముల ముదమునఁ బడసిన
త్రివిక్రమునిచే దివిజ సురభిచే
భవుచే నభవుని చేతను హరిచే.

## చతుర్థీ విభక్తి

మ. గురుభక్తిం బటుశక్తులం బడసి దిక్కాలంబులన్ సద్యశోం
కురముల్ నాటి యొకానొకప్డు గురునిం గూర్మిన్ గనం బోవఁగాఁ
గరివక్త్రుండట యడ్డమై నిలువ భర్గాస్త్రంబునుంబూని చె
చ్చెర దంతమ్మును గొన్న భార్గవునకై శ్రీకాంతుకై జిష్ణుకై.

## కళిక (చతురస్రగతి)

మఱియును సురముని గణవందితుఁడై
మానుగ దశరథ సుతుఁడే హరికై
ఖరదూషణులను జంపి మఖముఁగనఁ
గౌశికు వెంటను జను బాలునకై
తాటకఁ జంపిన ధానుష్కునకై
దనుజులఁ ద్రోలిన ధీరవరునకై
బోటిగ రాతినిజేయు ఘనునకై
పుణ్యుని గౌతముఁ బ్రోచు ప్రభునకై
శివధనువును సంధించు నుతునకై
సీతను పరిణమాడు వరునకై
సవతితల్లి కోరికఁ దమ్మునితో
సతితో వనమున కరుగు వానికై

మారీచుని మద మణచు సుగుణికై
మానిని గోల్పడి మలయునరునకై
మారుతిఁ గాంచిన మహితాత్మునకై
మాన్యత నినజుని గనుదేవునకై.

ఉత్కళిక (చతురస్రగతి)

జానకి యశోక వనము నుండెనని
వానర ముఖ్యుని వలనఁ దాను విని
వనధికి సేతువు వెసఁ గట్టించుచు
దనుజుని రావణుఁ దుదముట్టించుచు
లెంకగ వచ్చిన రావణు తమ్ముని
లంకకు రాజుగ నుండుము లెమ్మని
సీతను దోడ్కొని రాజధానికై
యేతెంచిన ఘనుకై ధీధనికై

పంచమీ విభక్తి

చ. తెలియరుగాని మానవులు దేటపడంగను సంయముల్ నిలిం
పుల దీయితుండునైనఁ గనఁబోలక చింతనుజేయ నవ్వుచున్
దలవుల నిల్చు వాని వలనన్ ద్రిజగత్తుల నుండి భక్తులన్
వలపునఁ బ్రోచు శ్రీశువలనన్ గను లోకము శాంతి సౌఖ్యముల్.

కళిక (చతురస్రగతి)

మఱియును దేవకి గర్భము నందున
మానుగఁ బుట్టిన శ్రీహరి వలనన్
నెఱి వసుదేవుడు మోయగ యమునను
నిశిని దాటు పసి పాపని వలనన్

యశోద సుతుఁడుగ నందుని యింటను
నలరుచుఁ బెరిగిన బాలుని వలనన్
నిశాచరిణియగు పూతన యసువుల
నిసుమై త్రెంపిన నేర్పరి వలనన్
మట్టిని దిని బ్రంహాండము నోటను.
మాతకుఁ జూపిన మహిముని వలనన్
దిట్టులఁ దిననో వెన్నను దొంగిలి
తెలివకుఁ బూసిన దిట్టరి వలనన్
రోటికిఁ గట్టిగఁ ద్రాటి నీడ్చి భూ
రుహములఁ గూల్చిన ధీరుని వలనన్
బూటకంపు వృషభంబుల నేడిఁటి
పోడిమినడఁచిన పోటరి వలనన్.

ఉ త్క ళి క (చతురస్రగతి)

కాళియు శిరమున గజ్జెలు గలగలఁ
గ్రాలగ నాట్యము సేయుచు వలి మల
యల్లని గేరుచుఁ జల్లని చూపుల
గొల్లలు వొగడఁగఁ దనియుచుఁ గ్రేపులఁ
గానెడు బాలుల పాలిటి బాములు
గాసిని జెందగఁ జేయుచుఁ బాములు
గోరినఁ గాళియుఁ బుచ్చి దవ్వులన
కూరిమిఁ బరగిన కృష్ణుని వలనన్.

షష్ఠీ విభక్తి

శా. అంభారావ మొనర్ప గోవృష సమూహం బార్తి గోపుల్ హృదిన్
స్తంభింపన్ ఘనమేఘ సంచయముతో జంభారి వర్షింప వ
ర్షాంభపి పాతము నడ్డ వ్రేలిపయి నిర్వ్యాజంబు భూభృత్తునే
శుంభ న్మూర్తిధరించె నాతనికినే జోడింతు హస్తంబులన్.

క ళి క (త్రిస్రగతి)

మఱియుఁ గేశిఁ జంపినట్టి మహిమాన్వితుఁడైన హరికి
కరము కువలయాపీడపు గర్వమడచు క్రాంతమతికి
గోపికా సమూహహృదయ వాపికా సరోజమునకు
నేపుగాని కుబ్జరూపుఁ బాపి ప్రోచు తేజమునకు
చాణూరుని వెసఁ జంపిన జాణయైన జగజెట్టికి
ప్రాణములను గొని కంసుని పాపమాపు భవ్యమతికి
మృతుఁడగు సాందీపసుతు నమృతుని జేయు విజిత విధికి
హితము నెఱిఁగి భక్తులన క్షతముఁ జూచు సుగుణనిధికి.

ఉ త్క ళి క (త్రిస్రగతి)

కమ్మఁజూచి కాంతమనసు కమ్మనిదని యెంచి సొగసు
గౌరిపూజఁ జేసి వచ్చు గౌరవర్ణి భైష్మిఁదెచ్చు
సౌదామనితో మెలగెడు పాధోవహువలె వెలసెడు
నీలవర్ణ దేహునకుఁ గుచేల వరస్నేహితునకు

స ప్త మీ వి భ క్తి

మ. చని ప్రాగ్జ్యోతిషనాథుఁ జంపి సురలన్ సమ్మోద మందంగఁజే
సి నిలింపాధిపుఁ బీరమున్ నిలిపి నిస్సీమానురాగంబునన్
జనయిత్రింగని కుండలమ్ములిడి నిస్స్వార్థంబునం బర్వు వి
ష్ణుని యందెంచెద శ్లాఘ్య సద్గుణము లస్తోకమ్ము లింపారగన్.

క ళి క (త్రిస్రగతి)

మఱియుఁ బాండు రాజసుతుల మనుపనున్న మాన్యు నందు
కరము కట్టిచేత వనము గాల్పించిన దేవునందు
కారుకూతలాడుచేది కొంతు నడఁచు ఘనునియందు
కౌరవసభ సతిమానముఁ గాపాడెడు కరుణియందు

రాయబారియగుచు సభను రంజిల్లిన రమ్యునందు
సాయమౌచు విజయుని రథ సారథియౌ సదయునందు
ననిఁ గిరీటి గీతచేత నలరించెడు గురువునందుఁ
గినిసి భీష్మపై చక్రముఁ గేల బూను కృష్ణునందు.

ఉత్కళిక (త్రిస్రగతి)

గర్భమందు మడిసిపుట్టు నర్భకు నిం గాంచి బెట్టు
వాపోయెడు నుత్తరఁగని తాపంబును మానుమయని
బాలకు బ్రతికించినట్టి కాలము నెదిరించినట్టి
లీలాగోపాలునందు నీలాహృదయేశు నందు.

సంబోధన ప్రథమా విభక్తి

శా. సప్తగ్రావ నివాస ! వాసవ శిరస్స్రగ్పుష్ప సంతాన సం
ప్రాప్తాం ఘ్రిద్వయ భాసురా ! సుర మనః పంకేజ భానూ ! జగ
ద్వ్యాప్త శ్రీకర పావనోర్జిత కృపాపాంగేక్షణా ! సద్గుణో
ద్దీప్తస్వాంత ! బుధైక వేద్య ! కృపనన్ దీపింపరా శ్రీహరీ !

కళిక (త్రిస్రగతి)

మకరిపాలఁబడు గజమును మనిచినట్టి మాన్యహృదయ
శుకుని హృదయకంజ మధుపుఁ జూఅలాడు పుష్పంధయ
సుతుఁ బిలుచు నజామీళుని సుగతిఁ బోవఁజేయు వరద
నతిఁజేసిన యంబరీషు నార్తిఁబాపు నాగ మనుత
తపముఁజేయు బాలభక్తుఁ దనర ధ్రువునిఁజేయు సుమతి !
నెపముమై మయూరధ్వజు నియతిగాంచి బ్రోచు సుకృతి
నలిజలధిని వైవస్వతు నౌక లాగున గమభావ
ప్రళయంబున బాలుడవై వట పత్రము నుండుదేవ

## ఉత్కళిక (త్రిస్రగతి)

భక్తిగలుగు సుజనులెల్ల సక్తిఁజేయు పూజలెల్లఁ
గొనుచు వేంకటాద్రి శిఖరి దనరెడు గుణరత్నగిరీ
పద్మావతి యలివేలను పద్మనేత్ర లిరుగేలను
గొలువ నరులఁ బ్రోవనున్న కలియుగ సత్యస్వరూప !

## సార్వవిభక్తికము

శా. నీవున్నాడవు నిన్నునమ్మతినెదన్ నీచే ముదంబుందు నీ
కై వే మ్రొక్కులు గొందునీ వలననేఁ గాంక్షల్ సదా నీకు మా
సేవల్ నీపదయుగ్మమందెసఁగు నా చిత్తంబు పాలింపుమో
కైవల్యప్రద ! వేంకటాద్రినిలయా ! కళ్యాణ కాంతాప్రియా !

మ. వినమద్గాజుల వంశ్యకైరవ సుధాత్మ్వి ద్ధాముడన్ వీరయా
ఖ్యను వెల్గొందెద రోశయార్యునకుఁ జిన్నమ్మాంబకుం బుత్రుడన్
మన మందున్ గడు భక్తియేర్పడఁగ సంభావించుచున్ నిన్ను నీ
గొనముల్ కీర్తన సేసితయ్య కృపనన్ సూర్మిన్ గనన్ గోరుచున్.

# శ్రీ లక్ష్మీ నరసింహోదాహరణము

డాక్టరు సుప్రసన్న, ఎం.ఏ.పి.హెచ్.డి.,
ఆంధ్రభాషోపన్యాసకులు, వరంగల్లు కళాశాల, వరంగల్లు.

## ప్ర థ మ

శ్రీ మధురోహమార్గముల చిందిన వెన్నెల ఆర్త లోక తృ
ష్ణామరవారి జీవసుకృతాఖిల మూలము ముక్తికామినీ
స్వామి అనంత వేద పరిషత్పరి కల్పిత నైకమూర్తి ఆ
త్మామృతవర్తి శ్రీ నృహరి యాదగిరీంద్రుడు మమ్ము నేలుతన్

మరియు నాస్తిక సర్వభావోన్మాద మత్తకరీంద్ర మృగపతి
తరచు నెదలో విచ్చుకొను భక్తాబ్జ భృంగీ మధురభారతి
బహుజనుః పుణ్యస్వరూప ప్రాణదప్ను కటాక్షమహితము
ముహురనుస్మరణాత్త భావుల ముదల నవతాాత్త చరితము
పోలిపోలని భక్తిలో నెదపొల్చుకోర్కెల కల్పవృక్షము
ఏలి ఏలని లోకములనేలయించు దైత్యుల హరణదక్షము
మహిత విశ్వాధారమై అమ్నాయముల కొసలంచు దీపము
విహిత సర్వజగత్ప్రవృత్త్యావిష్కృతి స్ఫురదింద్రచాపము.

లిప్తక్షణమును రాత్రి దినము ప్రసుప్తి జాగ్రదవస్థ స్వప్న వి
భక్తమైన సమస్త లోకము భక్తిమార్గమునెత్తి యేతము
మధుర పధియై పొందుకాలా వధులకందని ముక్తిబాలా
స్మితజ్యోత్స్నా సంద్వీచిక అతను సంపన్మధుర వాటిక

## ద్వితీయ

ఏలో లక్షలు ఈ జనుస్సులకు ముందేమున్నదో వెన్కయే
దో? లీలాకృతికూడ తోచ దెదలోతుల్ ప్రోత్థవరాశివీ
చీ లావణ్యములో జడల్ విరిసెనే ఛేదించుచో గోటితో
మాలల్ గట్టిన పుట్టువుల్ నృహరి 'కొమ్మల' స్థితున్ గొల్చినన్.

మరియు నారగ్వధ కిసాలయ మహితరుచికే సరాలోలుని
సరిన్నాయక దుహితృ వక్ష స్థ్సగితఘుసృణాంకిత కపోలుని
విస్ఫురల్ శతకోటి సూర్యా విర్భవత్ సర ఉదయనేత్రుని
అస్ఫుటాంతస్థిత సరోజాంతర్భ్రమద్భృంద్భృంగివా ర్తుని
పరమ భక్తి రసాల వృక్షముపైన మ్రోసెడి పికీవధువును
తరుణ గోపీ మధుర నేత్రాంత స్రవత్ శృంగార మధువును
అది మనోబుద్ధ్యహంకార నియత మునీశ్వర ఫాలచంద్రుని
శతధృతి ప్రముఖాఖిలామర సంఘ సంస్తుతి వచస్సాంద్రుని

సుఖములో దుఃఖములో మించిన అఖిలలోకుల బ్రతుకునెంచిన
తృప్తిచాలని లోక వృత్తము దీప్త వాంఛా నిత్యచిత్తము
నిట్టకంబము మొలిచె నెదలో తుట్టతుద త్రొక్కిడుల వడిలో
నలుగు మమురక్షించువానికి తొలుత ధారుణి తాల్చువానికి.

తృతీయ

ముడి విడదీయరాని యొక మోహము పెంచుక కూరుచుండి నా
యెడద యెదో నిమేషమున నీశ్వరభావము గుత్తగైకొనన్
వెడగయి పోదు తత్క్షణమె వేదములంటలి వెల్లిపండుల్
కొడువటి వంచలోన నెలకొన్న నృసింహునిచేత నాయెద౽

మరియ శివుని సగము సేయు మదను కన్నవానిచేత
దురిత తప్తులెదలనడుమ తోచు న మృతవేణిచేత
తిరిగి తిరిగి జన్మజలధితెరువరులకు దివ్వెచేత
మొదసి మొరసి వేదములై మ్రోయు మింటి మువ్వచేత
అంచులంచులందు ప్రళయమైన దరము తాల్చుచేత
మించువాక కట్టినట్లు మెరయు కత్తి వేల్చుచేత
త్రిభువులను గెల్చు శార్ఙశిత కిణాంక పాణి చేత
అభ్రకరికరాభ గదా హరత్ ద్విషత్ శ్రేణిచేత

లయభావము మూర్తి కట్టి భయద భుజంగములచుట్టి
శివుడు సింహమైన యట్లు లవతరింప మింటబుట్టి
ప్రహ్లాదుని గాచి భక్త కష్టాలములమ్మరుక్త
తింబరపిన స్వామిచేత అంబుద సంక్రామిచేత

చతుర్థి

వ్యర్థములైన ఈ బ్రతుకు వాగురలంబడలాగు ధర్మకా
మార్థములం ద్యజించి మనసంతయు 'వేలుపు గొండ' మీద మో
క్షార్థుల కల్పజీవుల మహామునులం దరియింప జేయు 'సిం
హార్ధ నరార్ధ మూర్తియగు నాతనికై తపియించు టెన్నడో ?

మరియును సర్వచరాచరలోకము మరియాదల పాటించు విభునికై
విరసిన బ్రహ్మాండములకు లోపల వెలుపలనెల్లయుకల రవిభునకై
సకల జగమ్ములనొక కొలికికి తేజనుదైత్యుల గండర కర్తరకై
అకలుషజీవన పథముల వెన్నెల లలికించెడి సొగసులరే దొరకై
పరమ విపశ్చిన్మానస హిమధర భవదచ్ఛామృత స్వర్వాహినికై
సురకిన్నర సిద్ధమునీశ్వర సంస్తుతి వాగీశ్వరి చూడామణికై
స్వరరాగాంతస్స్ఫుర దానందా బ్జమునందున బ్రమోసెడి తుమ్మెదకై
తతపరమాణుస్ఫుటచైతన్య త్రాణ ప్రాణులు దాగెడిపొదకై

అవివృతమైన జగమ్ముల మూలము చివరలలో నొక మాయాజాలము
కలిపించిన సర్గము పేరిట వల వెలయించిన వైరించ్య రచనగల
ప్రాణులు కర్మలు పాథేయమ్ముల మానగలేక పురాఘచయమ్ములు
వగగొను మమునేలెడి శ్రీపతికై నగదు హిత్వాహా మధుప ఝంకృతికై

పంచమి

పొరయు నఘాభికర్షణము పొంటె మనస్సునుదాటి వాక్సమా
చరణము దాటి దేహముల సంస్కృత భావములం జరించు ఘ

ప్పిరిగ సమస్త జీవపతి 'వేదగిరీంద్రము' వెల్గు శ్రీనృకే
సరివలనఁ జగంబులను సాధుపథంబులు దీప్తిపొందుతఁ.

మరియు మధుర వేణుగాన మంజుల తానమమువలన
విరసి లోకములకుపైన వెలయు తెల్వి ద్రుమమువలన
సాధు భక్త భావ సరణి జల్లు తేనెవాక వలన
మాధురీతరంగ భక్తమనో జలధి రాకవలన
శ్రీ సరత్తరంగ డోల చెలగు వెల్లయంచవలన
దాస దీన మాంధ్యరాత్రి తళ్కులాడు మించువలన
పరమపదనివాస భక్త భావనా ప్రమోదువలన
సురనరోరగోర్విసరత్ స్రుతికారణ పాదువలన

ఎడదలోని తామసమ్ము పొడముకోర్కెలన్న దుమ్ము
తుదయెలేని రక్త సంధ్య తుదలనడ్డ మిడినవింధ్య
మట్టు వెలయు సంసరణము నెట్టుసటా యితకిరణము
లోలయుసింహ మూర్తివలన ఇలా దీపవర్తివలన

షష్ఠీ

సకలాంతర్వ్యధిలన్ హరింప నఘదోషమ్ముల్ విచారింపగఁ
సకలాభీష్టములొంద దుఃఖముల సస్యమ్ముల్ విజృంభింప జీ
వకదంబంబుల సర్వకామనల త్రోవల్ రేనికిఁ శేషనా
యక తల్పుండగు శ్రీ 'అహోబల' నృసింహస్వామికిఁ మ్రొక్కెదఁ

మరియు వేదోద్ధార మత్స్యావతారునకు
తరచునంబుధిని మందర శైలధారునకు
అఖిల భూభరణ సంయమన దంష్ట్రాగ్రునకు
నఖకృత్త దైత్యాంత్రనాళ రూపోగ్రునకు

యుగపత్ప్రదాంక నభోధోభువమునకు
నిగృహీత దైత్యభూనేతృ జీవమునకు
వైదేహికానంద వర్ధనుండగు దొరకు
ఆది తత్త్వమునరున కందించు దేవరకు

తొలి ఋషుల నుడితోడ వెలుగునిచ్చినజాడ
సర్వవిశ్వమునందు ధూర్వహత్వము చెందు
కాలదీపకమునై కాలస్వరూపమౌ
ధర్మ సంస్థానునకు కర్మసంధానునకు

సప్తమి

విరజాభంగములందు ముక్తిలలనా విస్ఫారవేణ్యంచల
స్ఫురితంబైన పరీమళంబు తనపొల్పుల్ మజ్జనం బాడుచో
చెరలాడన్ తనువం దతృప్తుని మృదు శ్రీ చందనాలేప సుం
దరు శ్రీ 'సింహగిరీ'ంద్రునందు నఖిలార్త శ్రేణి తృప్తంబగున్.

మరియును సామము సాగిన మంజుల గీతములందున
పరచిన మధురోపనిషత్ భావ స్రోతము నందున
నారద రమణీయ సుధా నాదంబర శశియందున
వేరొకడై బదరీవన వీధి వెలయు ఋషియందున
ఊహాసమధిగత విద్యా యోగీశ్వర మణియందున
ఆహ్లాద సర్వజగద్బాధావర్తాధ్వనియందున
చెలగిన నీలా భూ లక్ష్మీస్మిత సుందరునందున
జలజావక్షోజోద్గత చందన మందిరునందున

పొగడగ వాక్కులు చాలక మెగుడప చేతులు లేవక
యెదదను నిలుపగజాలక బడలిక తడబడి తీరిక



లుడిగియు లోకమున మునిగి విడుపును కోరుచు భజింప
బడు శ్రీ నరహరియందున కడువరముల ఝరియందున

సంబోధన

ఇదిగో! స్వామి గ్రహింపు బిందియలతో నీబెల్లపుం బానకం
బుదయాక్షీరతరంగవార్ధి! దయతో ముక్త్యంగణ గాథను
త్తదయాగ్న్యగ్రలయానుభావ! ఉదరస్థ ప్రాణిసంరక్ష! వా
స్పదనా! తార్క్ష్యహయన! 'మంగళగిరి' స్వామీ! జగన్నాయకా!

మరియు సర్గస్థితి మథన విద్యాస్థాన
తరణి బింబాంతరధ్యాతృ యోగీశాన
మధుర మధురానంద మయమనోజ్ఞాకాశ
అధరీకృతాజరుద్రాది లోకాధీశ
అతిమనోబుద్ధి వాగర్థ ప్రమాగాత్ర
వితతాత్మభావనా విస్ఫురత్ శతపత్ర
ఆనందమయ భావనాగ్ర స్ఫురన్మధు
వాణీకిరాటాగ్ర నల్ల దంశుక విధు

విరియుతెల్లని జడల నారయు రక్తపు సరుల
లోకముల మ్రింగగల బాల్‌నోరును కనుల
రక్తకాంతులు భయా శక్త జగమేలుటకు
అవతరించిన వేల్ప! ఆర్తవాంఛాకల్ప!

సార్వవిభక్తికము

నీవేస్వామివి! నిన్నెదన్ నిలిపెదన్ నీచేననున్నింతు నీ
కై వెల్లించెదనాత్మ నీవలన కామాదుల్ విదారింతు నీ

కె వేదమ్ముల పల్కు కూడ సరికాదే సుంత ? నీయందు నా
వౌ వాక్కుల్ ఫలియించుగాక నరసింహా ! సర్వలోకాధిపా !

అంకితాంకము

వాగ్వ్యాహారములేని మార్గమున దివ్య ప్రాభవుల్ యోగ స
మ్యగ్వ్యా వృత్తులు సాని పోయిరది సాధ్యమ్మౌనె నా బోంట్లకున్
ఋగ్వ్యాఖ్యాతములైన భావముల దారింగూర్చితిక నీ సుమ
స్రగ్వ్యాళి సక్త పరీమళంబు కొసలన్ రానీయవే శ్రీహరీ !

# సంస్కృతోదాహరణములు

## బసవోదాహరణము

### పాల్కురికి సోమనాథుడు

### ప్రథమా విభక్తిః

మాలిని. జయతు బసవరాజః ప్రాణలింగాత్మపూజః
శరణ దివిజభూజః స్మేరసంవిత్సరోజః
గణపరిషదధీనః ఖ్యాతదానావధానః
సరసమహిమగానః స్వానుభూత్యైకమానః॥

### కళికా - హరిగతిరగడ

అపి చ పురాతన నూతన శివగణ పాదోదక పరిల సదభిషేకః
క్షపిత విపల్లవపల్లవ జంగమ లింగ సమర్చన నిచిత వివేకః
సతత వికస్వర భాస్వర నిజముఖ మండల ఖండిత రజనీనాథః
కృతయుగ వర్తన కీర్తన నిరసన నిపుణ పవిత్రచరిత్ర సనాథః
ప్రకటిత దర్పక దర్పకరేణు ప్రమథన నిశిత కరాంకుశ హేళః
శుకముఖ మానస మానసకమలాకర విహరణ చణ రాజమరాళః
స్వాను భవాంచిత కూడలి సంగమ సంతత దేవధ్యానాభిజ్ఞః
సూనృత భాషణ భూషణ వాణీ సింహాసన గంభీర రసజ్ఞః

### ఉత్కళికా

కావుళ నారాట ధ్వని నారీరః
శ్రీవిశ్రుత పేశల శారీరః
వ్యతికర నానాగతి నిస్సీమః
శ్రుతి సంధాయి చమత్కృతి భూమః

శ్రుతి ముఖరస్వర సరస సమేతః
స్మృతి నికురుంబ రసాయనగీతః
ప్రముదిత హృద్వర్తన శితికంఠః
శమదమ లాలన గుణితోత్కంఠః

ద్వితీయా విభక్తిః

శా. వేదాంతార రహస్య భేద పిశున వ్యాపార పారంగత
ప్రౌఢ ప్రక్రియ వాక్ప్రపంచ రచనా చాతుర్య ధుర్యాశయమ్
దైవాస్తిక్య నిదర్శన ప్రతిభువమ్ తాపచ్ఛిదా పండితమ్
భాండాగార ధురీణ మత్ర బనవామాత్యం కిమాచక్ష్మహే.

కళికా - ద్విరదగతిరగడ

అపి చకరతలయుగళ విహిత పుర హరయజన
మవహిత కరణసతత పరిముదిత శరణజన
మహిమకర శశి సరణి విముఖ నిజపవనగతి
మహి పరిషదధిపనిభ వివిధ మధురిమ సుమతి
మతుల కరి హరి కనక మణి గణ గుణిత విభవ
మతివిషమ బహుళతరభవ జలధికలశభవ
మమల నిజహృదయ కృత పరిచయ విదను భవమ్
శమిత నిరవధిక కలివృజిన సహచర భవమ్.

ఉత్కళికా

నిరతి శయ జనదురిత
నిరసన నిపుణ చరిత
ఘన విషయ రస విముఖ
సనకశుక జనకముఖ

సకల యమి జన విమల
వికసిత హృదయకమల
పరికలన మధుకరం
శరణ జన శివకరం

తృతీయా విభక్తిః

శా. ఆస్థానే శివనాగ సంయమి కరద్వంద్వాంగుళి శ్రేణికా
లీలా లాలన మంథనా ద జనయత్ యః క్షీరధారావళిమ్
తేనా త్యద్భుత కర్మ కర్మఠ మహామాహాత్మ్య వర్ధిష్ణు నా
భాండాగార ధురంధరేణ బసవామాత్యేన కః స్పర్ధతే.

కళికా - తురగవల్గనరగడ

అపి చ నిగమ సారభూత వీరశైవ దీక్షి తేన
తపన శత సహస్ర సదృశ దేహదీప్తిలక్షి తేన
ఖండితప్రసూనవిశిఖ చాప దండల స్తకేన
మండి తాను భావ శరణ చరణ కలిత మ స్తకేన
విదళిత ప్రచండ వివిధ విషమ విషయ గర్జి తేన
హృదయ వివర నివసన ప్రగాఢ. లౌల్యవర్జి తేన
నీలగళ విశిష్ట భక్త భవనపుష్య దిందిరేణ
ఫాల నయన విమల హృదయ కమలమధ్య మంది రేణ

ఉత్కళికా

యావనాళ రాశినిహిత
భూవినుత కటాక్షమహిత
శక్తివై భవాభిజాత
మౌ క్తికప్రదానసీత

సాంగభక్తవృషభనిత్య
రంగవల్లినియమకృత్య
దృష్టసాద్భుతక్రమేణ
దుష్టదళన విక్రమేణ

చతుర్థీవిభక్తిః

శా. వేదాంతోదిత వీర శైవసమయాచారవ్రతప్రకియా
చర్యాదేశిక సార్వభౌమ మహిమ భ్రాజిష్ణవే జిష్ణవే
భాండాగారధురంధరాయ బసవామాత్యాయ చేతస్సదా
జాగ్రత్కూడలి సంగమేశ్వర మహదేవాయ తస్మై నమః.

కళికా - హరిగతిరగడ

అపి చ గౌతమకణాదకుంభజచ్యవనముఖ్యముని...సద్మనే
తపనవహ్నిహిమభానులోచన త్రిపురవైరిగణభావితాత్మనే
కరతలస్థ నిఖిలాండ మండలి ప్రకటకందుకసదావిహారిణే
కరటిదైత్యఘనతుంగమస్తక క్షరిత మౌక్తిక నికాయహారిణే
కుసుమబాణసంహతి గ్రసనధీరగుణసారశోచిషే
వసుమతీప్రముఖభూతచేతన ప్రదదయామయకటాక్షరోచిషే
వితతపాతక సమూహసానుమద్వితతినిర్దళన వజ్రబాహవే
శ్రుతిసముత్కర సదావిరోధకృత్సమయ బౌద్ధముఖ చంద్రరాహవే.

ఉత్కళికా

రుచిరరత్నమహనీయహాటక
ప్రచురరూపజవసత్త్వఘోటక
త్వరిత ధూతస్వాణిపాతధారణ
క్షరితదానజలగంధవారణ

ప్రథిత వస్తుపరిషన్నిరంతర
ప్రథమహోమహిమ కారణాంతర
స్మితపరిస్ఫురిత భక్తి చేతసే
స్తుతివచోముదితవహ్ని ర్వేతసే.

పంచమీ విభక్తిః

శా. చేత కీలిత సంగమేశ్వరమహాదేవాలికప్రస్ఫుర
జ్జ్వాలజాలజటాలవహ్ని శలభాకారప్రసూనాంబకాత్
భాండాగారధురంధరా ద్నృపవనామాత్యా త్సుపర్వావళీ
చూడాఘృష్టపదారవిందయుగళా న్నైవాపరం దైవతమ్.

కళికా - హరిగతిరగడ

అపిచ జగత్త్రియకర్ణసుధారస కుల్యాంచితసూనృతజల్పాకాత్
కుపితాంతర్గతరిపుషడ్వర్గమహోత్కట మస్తకతట కుట్టాకాత్
పరపనితాజనభాసురముఖమండలవీక్షణవిధిజాత్యంధాత్
నిరతిశయానుగ్రహశితఖడ్గలతా పరిలూనపునర్భవబంధాత్
కన్నడబ్రహ్మయకరుణాదుగ్ధార్ణవ సంవర్ధనరాకాచంద్రాత్
కిన్నెరబ్రహ్మయపురహరగోష్ఠీ సల్లపనాకర్ణననిస్తంద్రాత్
లాలితసకలపురాతనగణవాఙ్మణిముకురప్రతిబింబితరూపాత్
లీలాలాలసరసమణిచంచల నయనాంచల శితవిశిఖదురాపాత్.

ఉత్కళికా

ఆశౌజలసుతశిఖరిసమూహా
క్లేశతిమింగిల మిత్రగ్రాహా
స్వకళత్రసముత్కరనవఫేన
ప్రకటితబాంధవ మండలమీన

వ్యాధిపరిషదుత్తుంగతరంగ
క్రోధవిజృంభణఘోరభుజంగ
స్ఫురదురుతరభవ జలధివహిత్రాత్
దురితలతాచయలవనలవిత్రాత్.

షష్ఠీ విభక్తిః

శా. చిద్వ్యోమస్మయమానశీతకిరణోద్యోతత్సుధామాధురీ
నిర్వృత్తస్నపనప్రమోదభరిత శ్రీనీలకంఠాత్మన
ఉన్మీలద్గుణ రత్నరోహణమహా శైలస్యతస్యప్రభో
భాండాగారధురంధరస్య బసవామాత్యస్య దాస్యంభజే.

కళికా - హరిగతిరగడ

అపి చ శరనీహార హారమలయజ భసితి సితదివ్య దేహస్య
కుపథచరదుర్భావ భావ భవమదవిహృతి హృదిసుసన్నాహస్య
సంగమేశ్వర నిహిత హితమధుర సంగీత గీతానుభావస్య
జంగమ మనస్సంగ సంగ తేహోదావ దావ ప్రభావాస్య
భక్తిమహిళాశ్లేష జనిత మేదురవిపుల పులకసంయోగస్య
ముక్తి సౌఖ్యాధాన దాన విద్యా నిరతరతమహోద్యోగస్య
పరిచితసుధాసార సార మధురిమనికృతి కృతిచణ వచస్కస్య
ధరణి దిగ్వియదతల తలనిబిడ శశికరనికర నిభయశస్కస్య

ఉత్కళికా - ద్విరదగతి

నిటల లోచన భక్తవాత్సల్య కల్యాణ
కటక సీతావాస నిస్సీమ కల్యాణ
గోచరాంచిత విపుర్విస్ఫూర్తి మడివాలు
మాచయప్రభు దీర్ఘనయనాంచితోత్కళ

కోపప్రసాద (భాజన) తావిధాక్రాంత
దీపిత ప్రథమానభక్తి వినయాత్యంత
భారవైదిక సువిశ్రుత శివాచారస్య
సారజంగమ సూక్తి మణికర్ణపూరస్య.

సప్తమీవిభక్తిః

శా. ఓంకారాంకుర వేద పల్లవ లసత్పంచాక్షరీ మంజరీ
తత్త్వామోద నితాంతలుబ్ధ శరణానీకేద్ధపుష్పంధయా
యాసౌ నాదలతా తదీయ సుషమారామాభి రామస్థలే
తస్మిన్ శ్రీబసవాహ్వయే గుణనిధౌ కింవా న లోకోత్తరం.

కళికా – మధురగతి రగడ

అపవాధారనురంగ జ్ఞాతరి
సుపథ పథిక చిత్సుఖ సంధాతరి
వర్గచతుష్టయదాపన శీలిని
దుర్గతి నిరసన కరుణాశాలిని
శరణ పదాబ్జ పరాగలలామని
దురిత నిరాస ధురంధర భూమని
వేదవిరుద్ధాచార పరిద్విషి
నాద సుధాప్రీణిత పురవిద్విషి.

ఉత్కళికా

సురగిరి మందర
నిరుపమకందర
ఘనతర చందన
వనచయనందన

మహిళా సహచర
విహరత ఖేచర
లాలిత నామని
కీలిత సామని

సంబోధనవిభక్తిః

శా. మూలాధార వికస్వరాంబుజ వనీమధ్యస్ఫుర ద్దీపికా
యాతా యాతవినోదపేశలమతే! చిద్వ్యోమ శీతద్యుతే
సంసారార్ణవ కర్ణధార! కృపయామాంపాలయ ప్రత్యహం
భాండాగార ధురంధరేశ! బసవామాత్యేశ చూడామణే!

కళికా - ద్విరదగతి

అపి చ పాలిత వీరశైవవ్రతాచార
కృపణ జనరక్షణ కృతచరణవ్యాపార
సితయశః కర్పూర వాసిత బ్రహ్మాండ
మితిరహిత కిల్బిషాంబుజ షండ వేదండ
భుజగవర సుర గరుడ ఖచరకిన్నరసాధ్య
నిజగుణశ్రవణతోషిత పండితారాధ్య
శతమఖతరుస్ఫీత గణపరిషదుత్కంఠ
తత వితత ఘన సుషిర కీర్తిత శ్రీకంఠ

ఉత్కళికా

శుకముఖ మనోగమ్య
వికచగుణ గణ తామ్య
దల్లమప్రభుసత్య
సల్లిపనసాంగత్య

సాధితస్వాత్మావ
బోధ నిజసద్భావ
శివతత్త్వ విస్తార
భక్తి పథనిస్తార

సార్వ విభక్తికమ్

శా॥ యస్సంగీతనిధిర్యమాహురభవం యేనార్చితం సూనృతమ్
యస్మైస్వస్తి యతస్తదీయముదభూత్ యద్వీరశైవ వ్రతమ్
యస్యాపాంగ సహోదరీ చ కరుణా యస్మిన్మహత్త్వాధికం
సత్వంత్రీణిజగంతి పాహి బసవామాత్యేశ చూడామణే!

ఆర్యా॥ శ్రీ బసవ రాజగుణమణి
ఖచితం జయతాత్ సువర్ణమేతత్
సోమ సుకవినారచితం
హృదయాభరణం సదాముదాహరణం

గ్రంథ సూచిక :—


1. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము - చెన్నపురి — సంఖ్య డి. 9564

(Descriptive Catalogue of Sanskrit Manuscripts Vol xviii Stotras. 2. Prsamsa Stotras. Page 6801)

2. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక-సం. 32. సంచిక-3-4 స్వభాను - శ్రావణ కార్తీకములు. (81-88) పుటలు. శ్రీ బండారు తమ్మయ్య నిడుదవోలు వేంకటరావు. ఎమ్. ఏ గార్లచే సంపాదితము.

3. కన్నడ భాషలోఁ బ్రకటితము. శరణ సాహిత్య గ్రంథమాల. 2

పైని వివరించిన పరిషత్పత్రికాప్రతి ననుసరించి, కీర్తనకేసరి బి. శివమూర్తి శాస్త్రిగారిచేఁబ్రకటితము. ఈగ్రంథము బెంగుళూరు, వీరశైవసాహిత్య భాండారమున లభించును.

## ఉదాహరణ లక్షణము

### గౌరన - లక్షణదీపిక - (ప్రబంధ దీపిక)

ఓజః కాంతిగుణోపేతైః గౌడరీతి సమన్వితైః
అష్టభిః కథితైః పద్యైః కలికోత్కలికాక్రమైః
పద్యేననవమేనాంతే హృద్యం సర్వవిభక్తితః
జయేత్యుపక్రమంపూర్వైరుదాహరణముచ్యతే
అత్ర సర్వాణి పద్యాని నేతృనామాంకితాని చ
శక్వర్యాదీనిబద్ధాని మాలినీవృత్తమాదిమమ్ (తృతీయ ప్రకాశః)

అథోదాహరణా దీనా ముద్దిష్టానాం యథాక్రమం
లక్షణం క్రియతే సమ్యక్పూర్వాచార్యాను సారతః
యత్రాదౌ క్రియతే పద్యం కలికోత్కలికాదితః
విభక్తిప్రథమం పశ్చాత్ ఏవం సంబోధనాంతిమా
ద్వితీయాప్రముఖాస్సప్తక్రమేణస్యు ర్విభక్తితః
శక్వర్యాది మహాచ్ఛందో నిబంధో యత్ర దృశ్యతే
పద్యే పద్యే క్రమోపేత నేతృనామవిభక్తియుక్
జయేత్యది పదోపేతం మాలినీవృత్త మాదిమమ్
కించాద్యా వా విచార్యా వా కళికాష్ట దళాప్సృతా
కలికాతోద్యమాత్రావా కించి దూనాపి సోజ్జ్వలా
విభక్త్యాభాస సంయుక్తా చతుర్ధావా సుశోభనా
భవేదుత్కలికోపేతో పూర్వోక్తాంకాస్యతే ఉభే —(పంచమప్రకాశమ్)

ఉదాహరణమాత్రస్య స్యాద్విభక్త్యష్టకా యథా
సంస్కృతాద్యష్ట భాషాఢ్యా ఉదాహరణ మాతృకా

ఉదాహరణ మాత్రాస్యాత్ యధా సంబుద్ధివర్జితా
తదాస్యాత్ శ్లధరీనామ్నా సర్వత్ర పరితోషితా
ఉదాహరణ మేవంశ్యాత్ యదుత్కలికయా వినా
కల్యాణీతి తదానామ్నా విఖ్యాతా భువనాంతరే
యదుదాహరణం ఖ్యాతంత్వేత్కలికయా వినా
ఉత్ఫుల్లకమితి ఖ్యాతం నామ్నాచాటు విశారదైః

(మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తకశాల. సంఖ్య 12951. (సంస్కృతశాఖ)

# చిక్కదేవరాయోదాహరణము

## తిరుమలాచార్యుఁడు

### ప్రథమా విభక్తిః

జయతి మదనరూప శ్చారుకీర్తి ప్రతాపః
సతతరచితరంగ స్స్వామి సేవానుషంగః
సమదరిపు విభేదీ సర్వవిద్యానుమోదీ
మహిసురి చికదేవ క్ష్మాపతిర్భవ్య భావః

### కళికా

అపిచ నృసింహ సమర్చనశీలి
శ్చపలేతర వర సదవనలోలః
పాపవిదూరిత పావనకీర్తి
శ్చాపవిదారిత శాత్రవమూర్తి
శ్శమితోద్ధత ఖలజన సంభూతి
శ్శమసుర భూసుర సాత్కృతిభూతి
స్సమిదుద్భట భట సదయస్వాంత
స్సమ సంశిక్షిత సకలశాంతః

### ఉత్కళికా

గురుతరధైర్య స్థిరమతి ధుర్య
స్స్ఫురదురుతేజః పరమమహీజః

---

ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము - మద్రాసు. సంఖ్య. డి 1611 (తెలుఁగు) ప్రతిననుసరించి లిఖింపఁబడినది. ఇది తాళపత్ర ప్రతి. అచ్చుటచ్చుట గ్రంథ పాతములు గలవు. గ్రంథాంతమున గ్రంథము లిఖింపఁబడిన కాలముగాని వ్రాయసగాని పేరుగాని లేదు. శీర్షిక 'చిక్కరాయోదాహరణము' అని వ్రాఁతప్రతిలోఁ గలదు.

కవనీయగుణ స్తవవాక్యచణః
స్తుక ధర్మగుణః కృతభూరిరణః

ద్వి తీ యా వి భ క్తిః

శా॥ ప్రత్యర్థిక్షతజాపగా వశపతిత్వఖ్యాయశః కైతవా
గంగా శ్రీచిక దేవరాయమగమజ్జన్యే నివాసం పితుః
శ్రీశ్యాలింగతి తేన బాడబమిషక్రోదాగ్నినా శార్ఙిణా
పీతం ద్విస్మహీశాశ్రుభిస్స్వపితరం సంపూరయంతం ముదా.

క ళి కా

అపి చ బంధుర ధర్మ హర్మ్య సంచారిణమ్
స్వపద నమ్రనృపాల జాల శుభ కారిణమ్
ధాత్రి ప్రజానంద దాయి సంపద్భరమ్
పాత్రదానప్రాప్త పరమ పుణ్యాకరమ్
చంచలద్విప కర్ణ చాలితాంభోధరమ్
పంచబాణవిధూత భామా (మనోహరమ్) సమాదరమ్
పంచాననావార్య పటుశౌర్య మండనమ్
చంచన్మదాటోప శత్రురాట్ ఖండనమ్

ఉ త్క ళి కా

మదవారియుక్తస మ్మదకారి దంతి సం
వలదశ్వయోధ సంకులఘోరయుద్ధ సం
గత శత్రు రక్త రంజితభూమి భాతరం
గయుతచాపోజ్జ్వలమ్ నయన ధూతోత్పలమ్.

## తృ తీ యా వి భ క్తిః

శ్లో॥ యే భూపాశ్చరణం భజంతి కృతినో దత్తాఖిలోపాయనా
యే భూపాశ్చరణం భజంతి సహసా నిర్వక్రదోర్విక్రమాః
తే సర్వేఽపి యథోచితక్రమవిదా శ్రీచిక్కదేవావనీ
[1]భర్త్రా భోగభుజో భృశం విరచితాః స్వస్థాన ఏవాద్భుతమ్.

### క ళి కా

అపిచ రిపుచరిత్రగాత్ర హారిభూరి సింధురేణ
నిపుణ కృపణ లోక శోక విరసనరసబంధు రేణ
విమల కమల పత్రమిత్ర విపుల చపలలోచనేన
కుమత విమత పత్ర చిత్ర ఘోరనీర సేచనేన
చరణ శరణ వీరవార జాత శీత వీక్షితేన
భరిత చరిత పుణ్య గణ్య భాతి భూతిలక్షితేన
విహిత మహిత యుద్ధ శుద్ధ విదిత గదిత ధీగ్రహేణ
సహిమ మహిమ సాంద్ర చంద్ర సామ్య రమ్య విగ్రహేణ

### ఉ త్క ళి కా

రూపవిజిత వీరసేన భూపతనయ భీమసేన
తులితమహిత భూరిసేన చలితసమద శత్రుసేన
జవహృతస్మయోద్గమేన జవనహయ తురంగమేన
నియుతనియత బంధురేణ నయకళా ధురంధరేణ

1. భర్త్రా వ్రా. ప్ర.

## చతుర్థీ విభక్తిః

స్వస్తి ... ... ... ... ... ... శ్రీ చిక్కదేవక్షమా
[1]భర్త్రేమన్నెరగండ మన్నెరవిభాళాంకాయ బోభూయ తాం
ద్దానే జాంకుళ మర్తుబాంక మకరక్షోణీ వరహాధ్వనత్
భేరీ సింహలలాట ముఖ్యబిరుద భ్రాజిష్ణవే జిష్ణవే

### కళికా

అపిచ నూత్నరత్నఖచిత హర్మ్యరచిత తోషణాయ
విపులతర సమస్తదాన విహితవిబుధ పోషణాయ
భూమిపాల మౌళిమణివి భూషితాంఘ్రిసాయకాయ
సామభేద దండనీతి సాధితారినాయకాయ
కులధరాధరాభిరామ కుంజరేంద్ర జాలకాయ
విలసితాననాబ్జ భృంగ విభ్రమప్రదాలకాయ
పర్వచంద్ర చంద్రికావిభాసికీర్తి మండనాయ
సర్వదేవతా వితాన సన్నుతారి ఖండనాయ

### ఉత్కళికా

సమర సమయ విహితమాయ విమత కుమత రాడపాయ
కరణపటు తరోగ్రసాయ కరణకరణ చణదుపాయ
ఫలిత మహిత జయనికాయ విలస దతిమనోజ్ఞ కాయ
కలిత వివిధ భూషణాయ లలిత సరస భాషణాయ

## పంచమీ విభక్తిః

రాజశ్రీ చికదేవపార్థివ మణే వీరప్రతాపాష్ట ది
గ్రాజ వ్రాత మనోభయంకర మహారాజాంకరారాజతః

1. భర్త్రే. వ్రా-పా.

రాజాద్యు త్పరమేశ్వరాంగ ఘననా ద్రాజాధిరాజాంక నా
ద స్త్యం తెంబరగండ చండ బిరుదాన్నాన్యో వదాన్యో నృపః.

క ళి కా

అపిచ యోషామనోహారి సౌందర్య త
స్తపనీయ మయ ధరాధర భూరిధైర్య త
స్తరణినందన వినిందన మహౌదార్యత
స్పర సలోకైక రక్షణ కార్యధుర్యత
స్సకల సంసదుపాస్య సారసౌజన్యతః
ప్రకుపిత ప్రతివీర భయ దహాయజన్యతః
పునరుల్లసిత దేవ భూదేవమాన్యతః
కనదురు క్రమ పరాక్రమ చక్రమాన్యతః

ఉ త్క ళి కా

శతధృతి మత్యా దృత ఘనసత్యా
దర రణ కృత్యా దరభట నుత్యా
ద్భుతపర మాయా దితసదుపాయా
దిమగణనీయాత్ దమమహనీయాత్

ష ష్ఠీ వి భ క్తిః

రాజశ్రీ చికదేవరాయనృపతేః సర్వోవిపక్ష క్షమా
భృద్వర్గః కిమభంగసంగర హితోద్యోగస్స్వపక్షోఽజని
అహ్నాయాదపతత్కథంను నదివం నోచేదుదగ్రాగ్రహా
దభ్యేత్యోత్కట పాదఘట్టన చలత్ సర్వంసహా మండలః

